# వీక్షణం

రాజకీయార్థిక సామాజిక మాసపత్రిక

అక్టోబర్ 2006 63 రు. 10

* ఫోకస్ : ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ అసమానతలు
  తెలంగాణ, రాయలసీమ,
  కళింగాంధ్ర, పల్నాడులపై ఏడు వ్యాసాలు
* కడప యురేనియం ప్రాజెక్టు
* తెరాస రాజీనామాలు
* అభివృద్ధి - భిన్న దృక్పథాలు
* వందేమాతరం వివాదం
* 'జార్జిబుష్ దయ్యం'పై ఛావెజ్ ఉపన్యాసం

# తెలుగునాట సామాజిక పరిశోధనా రంగంలో కొత్త ప్రయోగం
# సిడిఆర్‌సి - వీక్షణం స్వల్పకాలిక ఉపకార వేతనాలు

తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే అన్వేషణకు మార్గాలు కల్పించడానికీ, ఆ అన్వేషణను వ్యక్తీకరించడానికీ ఏర్పడిన సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సిడిఆర్‌సి), రాజకీయార్థిక సామాజిక మాసపత్రిక వీక్షణం తెలుగునాట సామాజిక పరిశోధనా రంగంలో కొత్త వెలుగులు ప్రసరింపజేయడానికి ఒక కొత్త ప్రయోగానికి పూనుకుంటున్నాయి. తెలుగు సమాజంలో వివరమైన, లోతయిన పరిశోధన అవసరమయిన అనేక సమస్యలపై తగిన సమయం తీసుకుని పరిశోధన జరపడం కొరకు స్వల్పకాలిక ఉపకార వేతనాలను ప్రకటిస్తున్నాయి.

అనంతపురం కరువు, మహబూబ్‌నగర్ వలసలు, నల్లగొండ ఫ్లోరైడ్, నల్లమల చెంచుల దుర్భర జీవనం, కడప యురేనియం, సిరిసిల్ల చేనేత కార్మికుల ఆత్మహత్యలు, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ వల్ల మూతబడిన పరిశ్రమల కార్మికుల వెతలు, రైతుల ఆత్మహత్యలు, బాక్సైట్ తవ్వకాలు, వన్ ఆఫ్ సెవెంటీ చట్టం, హైదరాబాద్ పరిసర భూములు, కొల్లేరు ఆక్రమణలు, పోలవరం .... ఆంధ్రప్రదేశ్‌లో వివరంగా అధ్యయనం చేయవలసిన సామాజిక, రాజకీయార్థిక అంశాలకు కొదవలేదు. ఇవి కాక మరెన్నో సామాజిక అంశాలు కూడ ఉండవచ్చు. కాని ఈ అంశాలలో చాలా వాటిపైన అడపాదడపా పత్రికావ్యాసాలు, వార్తలు తప్ప వివరమైన, సమస్యను అన్ని కోణాల నుంచి చర్చించే పూర్తి స్థాయి అధ్యయనాలు లేవు.

**ఈ స్వల్ప కాలిక ఉపకార వేతనం...**

★ పరిశోధనా విద్యార్థికి నెలరోజుల వ్యవధి ఇస్తుంది.

★ ఖర్చులతో కలిపి రు. 10,000 ఉపకార వేతనం ఇస్తుంది. (ఇందులో రు. 4,000 ఖర్చులకు సరిపోవచ్చునని, రు. 6,000 పారితోషికం అని అంచనా)

★ పరిశోధనా విద్యార్థి వ్యవధి ముగియగానే వీక్షణం కు ఒక వ్యాసం/నివేదిక రాయవలసి ఉంటుంది.

★ మరొక నెల రోజుల వ్యవధిలో అదే అంశం మీద వివరంగా దాదాపు 80-100 పేజీల అధ్యయన నివేదికను సమర్పించవలసి ఉంటుంది.

★ ఆ పుస్తకానికి గణాంకాల పట్టికలు, వివరణలు చేర్చి, ప్రచురించి, విస్తృతంగా ప్రచారం కల్పించే బాధ్యతను వీక్షణం పబ్లికేషన్స్ తీసుకుంటుంది.

**సామాజిక శాస్త్ర విద్యార్థులకు, పాత్రికేయులకు, పరిశోధకులకు, ఆలోచనాపరులకు అపూర్వమైన అవకాశం.**

వెంటనే మీ దరఖాస్తులు పంపండి. మీ రచనా, పరిశోధనా అనుభవం, మీరు ఎంచుకునే సామాజిక అధ్యయనాంశం, ఆ అంశాన్ని అధ్యయనం చేయడానికి మీకున్న అర్హతలు, అవకాశాలు తెలియజేయండి.

**ఎడిటర్, 'వీక్షణం'**

సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్,

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

ఫోన్/ఫ్యాక్స్ : 040 - 66843495

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

63 అక్టోబర్ 2006



వార్షిక చందా: రు.120 విడి ప్రతి : రు. 10

సంపాదకీయం

## యాభై ఏళ్లు నిండిన ఆంధ్రప్రదేశ్ భవిత్యం?

ఈ నెల గడిస్తే ఆంధ్రప్రదేశ్‌కు యాభై సంవత్సరాలు నిండుతాయి. మరి కొంత కాలం గడిస్తే ఆంధ్రప్రదేశ్ అనే రాజకీయ, ప్రాదేశిక అస్తిత్వం ఉంటుందా, ఉండదా అనే విషయంలో ఎవరికీ అనుమానాలు లేవు. అందుకు ఎంత సమయం పడుతుంది, ఏ రాజకీయ ఎత్తుగడలలో భాగంగా అది జరుగుతుంది అనేవే చర్చనీయాంశాలు గాని, ఆంధ్రప్రదేశ్ విభజన, తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు బహుశా తప్పనిసరిగా జరిగిపోయే పరిణామాలు. అంతకు ముందు రెండు శతాబ్దాలు వేరువేరు పాలనల కింద ఉండి, సమైక్యత సమయంలో అనుమానాల, భయాల వ్యక్తీకరణల మధ్య, పెద్దమనుషుల ఒప్పందాలతో రూపొందిన తెలుగు భాషా ప్రయుక్త రాష్ట్రం ఏర్పడిన పదమూడు సంవత్సరాలకే తొలి చీలిక కోరికలను బయటపెట్టింది. అప్పటినుంచి అప్పుడప్పుడు బహిర్గతంగానూ, దాదాపు మొత్తంగా అంతర్గతంగానూ ఆ కోరిక ఉంటూనే వచ్చింది. కనీసం మూడు సందర్భాలలో విస్తృత ప్రజా ఉద్యమ రూపం ధరించింది. ప్రజా ఉద్యమం అన్నప్పుడే అందులో విభిన్న ధోరణులూ ఉంటాయి. ప్రతి ఒక్క ధోరణీ తాను మాత్రమే మొత్తం ఉద్యమ ప్రతినిధిననీ, తన ప్రయోజనాలే మొత్తం ఉద్యమ ప్రయోజనాలనీ చెప్పడానికి ప్రయత్నిస్తుంది. ఉద్యమంలో భాగస్వామిగా ఆ ధోరణికి సముచిత పాత్రా ఉంటుంది. తానే ఉద్యమంగా ప్రకటించుకుని, ఆపాదించుకున్న మేరకు దాన్ని విమర్శనాత్మకంగానూ చూడవలసి ఉంటుంది. గత ఆరు సంవత్సరాలుగా తెలంగాణ రాష్ట్రసాధన ఆకాంక్షలను ప్రకటిస్తూ, ఆ ఆకాంక్షను దేశ రాజకీయ చిత్రపటంలో ప్రముఖ స్థానానికి తెచ్చిన విషయంలో తెలంగాణ రాష్ట్ర సమితికి తప్పనిసరిగా అపూర్వమైన పాత్ర ఉంది. ఆ ఆకాంక్షను నెరవేర్చేందుకు ప్రజా ఉద్యమ నిర్మాణం అవసరం లేదని, లాబీయింగ్ చాలునని భావించి గత మూడు సంవత్సరాలుగా తెరాస నిర్వహించిన పాత్రను విమర్శనాత్మకంగా చూడాలి. ఇప్పుడు తెలంగాణ రాష్ట్రసమితికి చెందిన కేంద్ర మంత్రులిద్దరూ రాజీనామా చేయడం గాని, తెరాస అధ్యక్షులు కె. చంద్రశేఖర రావు తన లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా చేయడం గాని, మొత్తంగా తెరాస యుపిఎకు మద్దతును ఉపసంహరించుకోవడం గాని ఒక రకంగా ఆ పార్టీ గత మూడు సంవత్సరాలలో చేసిన తప్పులకు ప్రాయశ్చిత్తంగా భావించాలి. ఇప్పుడిక లాబీయింగ్ తలుపులు మూసుకు పోయాయి గనుక మిగిలిన ఏకైక మార్గం ఉద్యమ నిర్మాణమే. ఆ రకంగా 2006 ఆగస్ట్–సెప్టెంబర్‌లలో జరిగిన పరిణామాలు ఆంధ్రప్రదేశ్ భవితవ్యాన్ని ఒక నిర్ణయాత్మకమైన దశకు తెచ్చాయి. చాల సందర్భాలలో ఇటువంటి దశలు ఒక సమాజగమనంలో కీలకమైన మార్పులకు కారణమవుతాయి. అంతవరకూ చాల మందకొడిగా, పడుతూలేస్తూ, కుంటుతూ నడిచినట్టనిపించిన సమాజ గమనం ఇటువంటి సందర్భాలలో చాల వేగంగా, ఉరుకులు పరుగులుగా, ఊహించలేని మార్పులతో ముందుకు సాగుతుంది. ఇవాళ తెలంగాణ గురించి వివిధ రాజకీయ నాయకులు, విభిన్న ప్రజా సమూహాల నాయకులు వ్యక్తం చేస్తున్న అభిప్రాయాలలో ఇటువంటి గుణాత్మక తేడా కనబడుతోంది. ఇటువంటి సంక్షుభిత సమయాలలో సామాజిక శాస్త్రవేత్తల పాత్ర మరింత పెరుగుతుంది. మార్పును ఆహ్వానించడంలోనూ, వస్తున్న మార్పులలో విమర్శించి సరిచేయగలిగిన వాటిని సరిచేయడంలోనూ, మార్పుకు ఉన్న విస్తృతినీ, మార్పు భవిష్యత్తునూ ప్రజలకు అర్థం చేయించడంలోనూ అవసరమైన బృహత్తర కృషికి సామాజిక శాస్త్రవేత్తలు, అధ్యయనపరులు, విద్యావంతులు పూనుకోవలసి ఉంది. ◆

# లోపలి పేజీల్లో...



## ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ అసమానతలు

ఆంధ్రప్రదేశ్ లాంటి అర్ధభూస్వామ్య, అర్ధవలస సమాజంలో ఈ అసమానాభివృద్ధి జరిగిందని చెప్పడానికీ, భూస్వామ్య, కుల అంతరాల సమాజం వల్ల ఆ అసమానాభివృద్ధి మరింత వికృతంగా ఉందని చెప్పడానికీ చాల ఆధారాలున్నాయి. భూస్వామ్య గతం కొన్ని రంగాల అభివృద్ధికి ఆటంకంగా నిలవడం ఒక ఎత్తయితే, *1956* తర్వాత జరిగిన మార్పులలో, భూస్వామ్యానికి, అర్ధవలస పాలక విధానాలకూ కుదిరిన మిలాఖత్తు అసమానాభివృద్ధి అఖాతాన్ని ఇంకా పెంచింది. గత రెండు దశాబ్దాలుగా ఆంధ్రప్రదేశ్ ఆర్థికవ్యవస్థకూ, అంతర్జాతీయ ద్రవ్య, వాణిజ్య సంస్థలకూ, బహుళజాతి సంస్థలకూ పెరుగుతున్న అనుబంధంవల్ల ఈ అసమాభివృద్ధి ఇంకా వైరుధ్యస్వభావాన్ని సంతరించుకుంది.






**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040 - 66843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

సహాయ సంపాదకులు : డి.వి.రామకృష్ణారావు
సర్క్యులేషన్ మేనేజర్ : వై.రామచంద్రం 9949391028
కంపోజింగ్ & లే ఔట్ : పి. రాజశేఖర్

## పాఠకుల వీక్షణం

వీక్షణం ఆగస్టు పత్రికలో బి. రాజయ్య గారు, 'ప్రొఫెసర్లు రాసే వ్యాసాలలో పులుముడు ఎక్కువగా వుంటుంది. భాష కొరకరాని కొయ్యగా ఉంటుంద'ని వ్యంగ్యంగా గుండు గుత్తగా వ్రాశారు. అయితే ఎవరి వ్యాసమో ఏయే విషయాల్లో కూడా వ్రాయవలసి ఉంటుంది. అలా వ్రాయడం వలన ఆ విషయాలు నిజంగా అలా ఉన్నాయో లేదో తెలుస్తుంది. లేదా ఏవైనా విషయాలు మీకు విరుద్ధంగా ఉండడం వలన సరైన విమర్శ చేయలేక ఆ విధంగా స్పందించారో తెలుస్తుంది. మంచిగా ఉందన్నప్పుడు వివరణలు అవసరం లేకున్నా, బాగా లేదు అన్నప్పుడు ఒక్క మాటలో చెప్పడానికి వీలులేదు. ప్రతిఘటన సినిమాలో లాగా తిడ్తాంర్రా పొగుడ్తాంర్రా అన్నట్లు ఉండకూడదు. నేను ఫెయిల్ కావడానికి కారణం మా టీచర్ చెప్పకపోవడమే అనే విధానం ఉండకూడదు.

– బి. సైదులు
కురవి

వీక్షణం పత్రిక ప్రారంభం నుండి నేను క్రమం తప్పకుండా చదువుతున్నాను. తెలుగులో ఇ.పి.డబ్ల్యు. లాంటి పత్రికలు లేని లోటును పూడ్చాలనే మీ ప్రయత్నం ముదావహం. అయితే 'వీక్షణం' మరీ అకడమిక్‌గా తయారవుతుందని, అందువల్ల పాఠకులకు సమకాలీన సామాజిక పరిస్థితుల పట్ల సరైన దృక్పథాన్ని యిచ్చే లక్ష్యం నీరుగారి పోతుందేమోనని మా భయం. అంగీకరించినా, అంగీకరించపోయినా, ప్రతి పత్రిక ప్రారంభం వెనుక ఒక స్పష్టమైన లక్ష్యం వుంటుందని, దానికొక ప్రాపంచిక దృక్పథం వుంటుందనేది కాదనలేని సత్యం. ఇ.పి.డబ్ల్యు. నే ఒక ఆదర్శంగా తీసుకోకుండా, కలకత్తా నుండి వెలువడే 'ఫ్రాంటియర్' నూ ఆదర్శంగా తీసుకుంటే బాగుంటుందేమో ఆలోచించండి.

– అరుణ్
కర్నూలు

వీక్షణంలో ఈ మధ్య కాలంలో వేరువేరు సామాజిక అంశాల మీద వ్యాసాలు, పరిశీలనలు వస్తున్నాయి. సంతోషం, కాని, ఇప్పటికీ మీ వ్యాసకర్తల ద్వారా మేము ఆశించే విషయాలన్నిటి మీద తగిన పరిశీలనలు రావడం లేదు. ప్రతి సంచిక లోనూ రాష్ట్రానికి సంబంధించి జరుగుతున్న అన్ని ఘటనల మీద మీ నుంచి పరిశీలనలు కోరుతున్నాము. అదే విధంగా జాతీయ, అంతర్జాతీయ విషయాలు కూడా మీ పత్రిక ద్వారా మేము తెలుసుకోగలిగిన విషయాలు తెలుసుకోలేక పోతున్నాము. దయచేసి గమనంలో వుంచుకోండి.

– పి. రామనర్సయ్య
ఖమ్మం

సెప్టెంబర్ సంచికలో కోర్టు తీర్పులకు సంబంధించి నాలుగు వ్యాసాలు బాగున్నాయి. ప్రతీ సంచికలో కోర్టు తీర్పులకు సంబంధించి ఒక్క వ్యాసమైనా తప్పనిసరిగా ప్రచురించండి. రాష్ట్ర వ్యాపితంగా పెరుగుతున్న ల్యాండ్ మాఫియాలను వారికి అందుతున్న ప్రభుత్వ అధికారుల సహకారాలపై పరిశీలనా వ్యాసం ప్రచురించండి. మన రాజధాని, పలు నగరాలు ల్యాండ్ మాఫియా కబంధ హస్తాలలో నలుగుతున్నాయి.

– టి. శ్రీరామమూర్తి
గాజువాక

ఈ మధ్య కాలంలో సుప్రీం కోర్టు, హైకోర్టులు చాలా అప్రజాస్వామిక తీర్పులు యిస్తున్నాయి. వీక్షణంలో 'జుడీషియల్ వాచ్' లేదా 'కోర్టు తీర్పులు' అనే శీర్షిక ప్రవేశపెడితే బావుంటుందని సూచన. వీలయినంతవరకు ఇలాంటి తీర్పుల మీద వ్యాఖ్యానం చేసి మీకు పంపించగలను. మీరు కూడా మీ దృష్టికి వచ్చిన కేసులు తెలియజేయగలరు.

– ఎస్. శేషయ్య
అనంతపురం

వీక్షణం ఆర్థిక, సామాజిక మాసపత్రిక అని ఉపశీర్షిక ఉంటుంది. కాని రాజకీయ విషయాలు కూడ తగినంతగా ఉంటున్నాయి. రాష్ట్రంలోని కళాశాలలో రాజనీతి శాస్త్ర శాఖలు, రాజనీతి శాస్త్ర అధ్యాపకులు, విద్యార్థులు ఈ పత్రికను ఆదరించాలంటే ఉపశీర్షికలో రాజకీయ అని చేరిస్తే బాగుంటుంది.

– లక్ష్మి
హైదరాబాద్

### రచయితలకు సూచన

**ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడ అంతే. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వారపత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.**

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. అంటే ఏ నెల సంచిక ఆ నెల మొదటి వారానికల్లా పాఠకులకు చేరుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారం లోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
**9949391028**

# కొత్తపుస్తకాలు








- **నిమ్మ చెట్టుకు నోరుంటే** - నల్లమల ఎన్‌కౌంటర్ పై పౌరహక్కుల సంఘం నివేదిక - ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం ప్రచురణ, 32 పేజీలు, 1/8 డెమీ, రు. 5, ప్రతులకు : సి.ఎచ్.ఎల్.ఎన్. మూర్తి, అడ్వకేట్, కొత్తపేట వీధి, వినుకొండ, గుంటూరు.
- **వరద స్వర్ణాక్షరి** - జి.ఎస్. వరదాచారి - స్వర్ణోత్సవ సంఘం ప్రచురణ, 288 పేజీలు. 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : మీడియా హౌజ్ పబ్లికేషన్స్, 1-9-289/4, పోస్ట్ ఆఫీస్ వెనుక, విద్యానగర్, హైదరాబాద్ - 500 044.
- **ఉరిపోసుకున్న శిరస్సులన్నీ** - జనజ్వాల కవిత్వం - అమ్మ ప్రచురణ, 56 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : జనజ్వాల, 15-23, రాయిగడ్డ, వనపర్తి, మహబూబ్‌నగర్ - 509 103.
- **దిగులు వర్ణాలు** - పి. శ్రీనివాస్ గౌడ్ కవిత్వం - సంధ్య ప్రచురణలు, 44 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : పి. శ్రీనివాస్ గౌడ్, రైస్‌మిల్ ఎదురు, స్వర్ణగేట్ వద్ద, చీరాల, ప్రకాశం జిల్లా - 523 155
- **రాజ్యమే తన ప్రజలపై యుద్ధం చేస్తే** - ఛత్తీస్‌ఘడ్ ఆదివాసీల మీద సాల్వాజుడుం హింస - ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం ప్రచురణ, 36 పేజీలు, 1/4, క్రౌన్, రు. 10, ప్రతులకు : అన్ని పుస్తకాల షాపులు
- **అలావా** - ముస్లిం సంస్కృతి కవిత్వం - సంపాదకులు : షాజహానా, స్కైబాబ, నసల్ కితాబ్ ఘర్ ప్రచురణ, 162 పేజీలు, 1/8 డెమీ., రు. 50, ప్రతులకు : షాజహానా, 10-1-639, చింతలబస్తీ, ఖైరతాబాద్, హైదరాబాద్ - 500 004.
- **కాళోజి ముచ్చట్లు** - నాగిళ్ళ రామశాస్త్రి - కాళోజి ఫౌండేషన్ ప్రచురణ, 154 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : నాగిళ్ళ రామశాస్త్రి, 2-7-457, ఎక్సైజ్ కాలనీ, హనుమకొండ.
- **సవాలక్ష సందేహాలు** - స్త్రీలు - ఆరోగ్యం, సంస్కృతి, రాజకీయాలు, అన్వేషి హెల్త్ ఇనిషియేటివ్ నూతన సంకలనం. 1/4 క్రౌన్, 482 పేజీలు, రు. 200, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్.
- **కథ 2005** - సంపాదకులు : వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్, కథాసాహితి ప్రచురణ, 208 పేజీలు, 1/8 డెమీ, రు. 45, ప్రతులకు : రాష్ట్రంలోని అన్ని ప్రముఖ పుస్తకాల దుకాణాలు.
- **అభివృద్ధి - విధ్వంసం** - రెండేళ్ళ కాంగ్రెస్ పాలనలో పౌర ప్రజాస్వామిక హక్కులు - ఆం.ప్ర. పౌరహక్కుల సంఘం ప్రచురణ, 44 పేజీలు, 1/8 పేజీలు, రు. 10, ప్రతులకు : ఎస్.ఎస్.సి. బోస్, డాక్టర్ రామనాథం స్మారక న్యాయ కేంద్రం, డోర్ నెం. 27-17-25, పెద్దిబొట్లవారి వీధి, గవర్నరు పేట, విజయవాడ - 2.











# కడప యురేనియం - వెంటాడుతున్న విధ్వంసక అభివృద్ధి

- డా. కె. సత్యలక్ష్మి, కె. సజయ

"యురేనియం కార్పొరేషన్ రోజుకు 1250 టన్నులు దాదాపు 20 సంవత్సరాలపాటు తవ్వి తీయబోతోంది. ఇది భయాందోళనలు కలిగించే పరిమాణం. దీని అర్థమేమిటంటే అణుధార్మిక వ్యర్థాలు భారి స్థాయిలో విసర్జింపబడతాయి. యుసిఐఎల్ జార్ఖండ్‌లో మూడు చోట్ల యురేనియం గనులు నడుపుతున్నారు. వాటిని యుసిఐఎల్ ఎంత అధ్వాన్నంగా నడుపుతున్నారంటే, యుసిఐఎల్ ఇక్కడ బాధ్యయుతంగా నడుచుకుంటారని నమ్మటం కష్టం. మొన్నటి మంగళవారం లంబాపూర్ (నల్గొండ జిల్లా)లో ప్రజావిచారణను నిస్సిగ్గుగా అటకాయించటం దీనిని స్పష్టం చేసింది.

నా కాంగ్రెస్ పార్టీ సహచరుడు ఎం. శశిధర్‌రెడ్డి ఆగస్ట్ 16న రాజకీయ నాయకులు, శాస్త్రవేత్తలు, పర్యావరణవేత్తలు, స్వచ్ఛంద సంస్థల సమావేశం నిర్వహించి జాదుగోడకు సంబంధించిన వీడియో చూపించారు. అక్కడ పండ్లగింజలు వికృత రూపంలో ఉంటున్నాయి. ప్రజలు చికిత్స లేని రోగాల బారిన పడుతున్నారు. పిల్లలలో అంగవైకల్యాన్ని వివరిస్తే పాఠకులు భరించలేకపోవచ్చు. అయినప్పటికీ ప్రమాదామేమి లేదని యురేనియం కార్పొరేషన్ అంటుంది... ఈ మాటలు నమ్మడం తెలివి తక్కువతనం అవుతుంది."

**(21.08.2003, టైమ్స్ ఆఫ్ ఇండియా, హైదరాబాద్)**

ఈ మాటలన్నది మరెవరో కాదు. అప్పటి ప్రతిపక్ష నాయకుడు, ఇప్పటి మన రాష్ట్ర ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర రెడ్డి గారే. ఈరోజు అధికార పీఠం నుంచి, అదే యురేనియం కార్పొరేషన్ చాలా బాధ్యతాయుతమైందిగానూ, నమ్మదగిందిగానూ, లాభాలను, ఉద్యోగాలను కడప జిల్లాకు రప్పించేదిగానూ, అక్కడి ప్రజలకు అపారమైన కీర్తిని తెచ్చిపెట్టేదిగానూ, కనపడితే, మనం ఎంత మాత్రమూ ఆశ్చర్యపడకూడదు, అదేమని ప్రశ్నించకూడదు. ఈ మూడేళ్లలో జార్ఖండ్‌లోని జాదుగోడ పరిస్థితులు ఏమీ మారలేదు. యురేనియం కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (యుసిఐఎల్) ప్రత్యేకంగా ప్రజా, పర్యావరణ, ఆరోగ్య భద్రతా చర్యలు ఏమి తీసుకున్న దాఖలాలు లేవు. అయితేనేం, మన ముఖ్యమంత్రిగారికి, కాంగ్రెస్ పార్టీ అధికార ప్రతినిధికి, అందరికంటే ఎక్కువగా కడప పార్లమెంటరీ నియోజకవర్గ సభ్యులు మన ముఖ్యమంత్రిగారి సోదరుడైన వివేకానంద రెడ్డిగారికి యుసిఐఎల్ బంగారు గుడ్లు పెట్టే బాతులాగా కనిపిస్తోంది. బాతు బంగారు గుడ్లు నిజంగా పెట్టగలదా అని చచ్చు ప్రశ్నలు (శాస్త్రీయమైనవి) వేయకూడదు. పెట్టిందే ఫో, ఆ గుడ్లు ఎవరికి చెందుతాయి... అక్కడి ప్రజలకా... ఆంధ్ర రాష్ట్రానికా... యుసిఐఎల్ కా... అనే పుచ్చు ప్రశ్నలు వేశారో దేశద్రోహులయి పోగలరు జాగ్రత్త!!!?

నీరు బాయే బాంబు వచ్చే ధాం...ధాం...ధాం..., ముంచుకొస్తున్న యురేనియం ముప్పు..... మూడేళ్లనుంచి నాగార్జునసాగర్, నల్లగొండ జిల్లాను కుదిపేస్తున్న ఈ నినాదాల హోరు ఇప్పుడు కడప జిల్లాకి చేరింది. పాత్రధారులు ఒకరే. ఎటోచ్చీ అక్కడా, ఇక్కడా బలి పశువులు అమాయక ప్రజానీకమే.

ఈ సెప్టెంబరు 10వ తేదీన కడప జిల్లా, వేముల మండలం తుమ్మలపల్లి గ్రామంలో 'పర్యావరణ ప్రజాభిప్రాయ సేకరణ' పేరుతో జరిగినదంతా అధికార దుర్వినియోగమనటంలో ఎలాంటి సందేహం వుండనవసరం లేదు. ఒక ప్రైవేట్ పంచాయితీని తలపించేలా బారికేడ్లు కట్టి పోలీసుల పహారాలో బాధిత గ్రామస్థులకు చోటులేకుండా చేసి, సంబంధంలేని గ్రామాల నుంచి తమ అనుచరగణాన్ని రప్పించుకుని ప్రాజెక్ట్‌కు అనుకూలంగా ఓటు వేయించుకున్నారు. 'పర్యావరణ ప్రజాభిప్రాయ సేకరణ' సభ జరపాల్సిన నిబంధనలకు వ్యతిరేకంగా అధికార పార్టీ సభ్యులు, యుసిఐఎల్ అధికారులు వేదికను ఆక్రమించుకున్నారు. మరో విచిత్రమేమిటంటే వీరికి ప్రజలకన్నా, ప్రజల తీర్పుకన్నా, వారి వాక్‌స్వాతంత్ర్యం కన్నా, వారికున్న ప్రజాస్వామిక హక్కులకన్నా, వారు తరలివచ్చిన వాహనాలను నిలుపుకోవటం ప్రధానం అనిపించి అందుకై విశాల ప్రదేశాన్ని కేటాయించారు. ప్రజలకు మాత్రం చోటు లేని ఇరుకు స్థలాన్ని కేటాయించి, కుర్చీలలో బారికేడ్ల మధ్యన తమ అనుచరులను నింపి సాయుధ పోలీసుల వలయాన్ని పకడ్బందీగా సృష్టించారు. లోపలికి వెళ్లాలని ప్రయత్నించినవారిని అడ్డుకోవటమేకాక లాఠీలతో కొడుతూ తరిమారు. ప్రజలంతా కావాలంటున్నారని నమ్మబలకటమే కాక, ఎలాగైనా వచ్చి తీరుతుందని హెచ్చరిస్తున్నారు. పైగా మీడియా కూడా గోరంత వ్యతిరేకతను కొండంతగా చూపుతోందని, ప్రసార సాధనాలపై తమ అక్కసును కడప పార్లమెంటరీ నియోజకవర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్న వై. వివేకానందరెడ్డి వెళ్లగక్కారు.

భారత కేంద్ర ప్రభుత్వ అణుశక్తి విభాగం (అటామిక్ ఎనర్జీ డిపార్ట్‌మెంట్) అనుబంధ సంస్థ అయిన యురేనియం కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (యుసిఐఎల్) కడప జిల్లా వేముల మండలం వేల్పుల, మీదిపెంట్ల రెవెన్యూ గ్రామాల పరిధిలో భూగర్భ గనుల ద్వారా యురేనియంని తవ్వి తీస్తామని ప్రకటించింది. దీనికోసం తుమ్మలపల్లి, మబ్బుచింతలపల్లి, భూమయ్యగారిపల్లి, రాచకుంటపల్లి, కెకె కొట్టాలు గ్రామాలలో ప్రాజెక్టుకు అవసరమైన 879 హెక్టార్ల (2197.5 ఎకరాలు భూమిని ప్రతిపాదించారు. ఇందులో వ్యవసాయయోగ్యమైన భూమి 438.15 హెక్టార్లు (1095.375 ఎకరాలు). మిగిలిన 440.85 హెక్టార్లు (1102.125 ఎకరాలు) పోరంబోకు భూమి. ఈ గ్రామాలు సాక్షాత్తు మన ముఖ్యమంత్రిగారు ప్రాతినిధ్యం వహించే పులివెందుల అసెంబ్లీ నియోజకవర్గంలో వున్నాయి.

ఇక్కడ క్షారగుణం కలిగిన యురేనియం (ఆల్కలైన్ యురేనియం) ఖనిజ నిక్షేపాలు వున్నాయి. యుసిఐఎల్ ప్రవేశ పెట్టిన ఇ.ఐ.ఏ (ఎన్విరాన్‌మెంటల్ ఇంపాక్ట్ అసెస్‌మెంట్ అంటే పర్యావరణ ప్రభావ అంచనా-అధ్యయనం) రిపోర్టు ప్రకారం ఇక్కడ వున్న మొత్తం

యురేనియం 45.48 మిలియన్ల టన్నులు. దీనిలో వున్న సగటు $U_3O_8$ ఖనిజం 0.039%. అయితే బయటకు తీయగలిగేది 26.79 మిలియన్ల టన్నులు. దానిలో సగటు ఖనిజం 0.0407%. భూగర్భంలో గనులను తొలిచి ఇక్కడ ఖనిజాన్ని బయటకు తీస్తామని, సంవత్సరానికి 300 రోజులు నిరంతరాయంగా రోజుకి మూడు షిఫ్టుల్లో, షిఫ్టుకి ఎనిమిది గంటల చొప్పున పనిచేస్తూ, ప్రాజెక్టు మొదలైన 4 సంవత్సరాల తర్వాత రోజుకు 3000 టన్నుల ఉత్పత్తి చొప్పున 30 సంవత్సరాలపాటు తవ్వి తీస్తామని, ఈ ప్రతిపాదిత ప్రాజెక్టుకి ప్రాథమికంగా అవసరమయ్యే ఖర్చు రు. 1029.57 కోట్లు అని ఈ నివేదికలో తెలిపారు. అయితే ఏఏ అంశాలకు ఎంత ఖర్చు పెట్టబోతున్నారో ఎక్కడా వివరించలేదు (అంటే గనుల తవ్వకం, శుద్ధి కర్మాగారం తదితర అంశాలు). ప్రాజెక్టు నడపటం కోసం యుసిఐఎల్‌కి అవసరమైన ఉద్యోగుల సంఖ్య 934. అందులో 550 మంది గనిలో, మిగిలిన 384 మంది శుద్ధికర్మాగారంలో పనిచేస్తారు. దీనికి అదనంగా నైపుణ్యత అవసరం లేని కార్మికులు 500 మందిని కాంట్రాక్టు పద్ధతిలో తీసుకుంటారు. 30 సంవత్సరాలపాటు నిరంతరాయంగా జరిపే తవ్వకాలు, శుద్ధి తరువాత అక్కడ మిగిలేది అణు వ్యర్థాలు. అంటే 2 కోట్ల 70 లక్షల టన్ను అణుధార్మిక వ్యర్థాలు. దీని ద్వారా గాలి, నీరు (భూగర్భ, భూఉపరితల జలాలు), నేల అణుధార్మికతతో కాలుష్యమవుతాయి.

ఈ ప్రాజెక్టుకి పెద్దమొత్తంలో నీరు అవసరమవుతుంది. రోజుకి 3,348 కూబిక్‌మీటర్లు అంటే 33,48,000 లీటర్లు (ముప్పై మూడు లక్షల నలభై ఎనిమిది వేల లీటర్లు) అంటే 300 రోజులకి 1,00,44,00,000 లీటర్లు (వంద కోట్ల నలభై నాలుగు లక్షల లీటర్లు). ఈ నీటిని మొత్తం 50 కిలోమీటర్ల దూరంలో వున్న చిత్రావతి రిజర్వాయర్ నుంచి తీసుకోవటం జరుగుతుందని నివేదికలో పేర్కొన్నారు. అయితే చిత్రావతి రిజర్వాయర్ నుంచి నీరు వాడుకోవటానికి అనుమతి వుందా అనే విషయాన్ని పేర్కొనలేదు. ప్రస్తుతం అక్కడ నీరైతే లైదు. దీనికి సంబంధించి ప్రత్యామ్నాయాల్ని సూచించలేదు.

ఒక పక్కన ఇక్కడి యురేనియం నిల్వలలో యురేనియం ఖనిజం తక్కువగా వుండటం వల్ల కాలుష్యం అసలేమీ వుండదని చెబుతూనే, అపారమైన విద్యుచ్ఛక్తిని తయారు చేసే సామర్థ్యం వుంటుందని చెప్పటం పరస్పర విరుద్ధాంశాలు. అయితే వాస్తవమేమిటంటే, యురేనియం శాతం ఎంత తక్కువగా వున్నా, దాని శిధిల ఉత్పత్తులు, అణుధార్మిక అవశేషాలు (డికే ప్రొడక్టులు) భారఖనిజాలు, నికెల్, కోబాల్ట్, కాడ్మియం, ఆర్సినిక్, లెడ్ (సీసం) తదితర హానికారకాలు కూడా ఈ వ్యర్థాల్లో వుంటాయని యురేనియం కార్పొరేషన్ వారి రిపోర్టుల్లో ఎంత దాచినా దాగని సత్యం. వీటి నుంచి ప్రజలు తమని తాము ఎలా కాపాడుకోవాలో, వీటి ప్రభావం పర్యావరణపై, నీటిపై, తద్వారా పంటలపై, ప్రజలపై, సమస్త జంతుచాలంపై ఏ రకంగా వుండబోతోందో సరైన శాస్త్రీయ సాంకేతిక వివరణ లేకపోగా, అన్ని జాగ్రత్తలూ తీసుకుంటామనే ఒకే మాటతో 300 పేజీలతో కూడిన ఒక సమగ్ర నివేదికను, అది కూడా ప్రజలకు అర్థంకాని ఇంగ్లీషు భాషలో ముందుకు తీసుకు వచ్చారు.

'పర్యావరణ ప్రజాభిప్రాయ సేకరణ' సభలో 'అణుధార్మికత' (రేడియేషన్) అంటే ఏమిటో వివరించమని యురేనియం కార్పొరేషన్‌ని ప్రజలు కోరితే - దానికి సమాధానం ఏమి చెప్పలేక 'ప్రోటాను, న్యూట్రాన్లు...' అని ఏవో కొన్ని సాంకేతిక పదాలతో చెప్పబోయి విఫలమయ్యారు. చివరికి, అడిగిన వ్యక్తికి మాత్రమే తర్వాత చెప్తామని సమాధానం దాటవేసిన వైనాన్ని బట్టి చూస్తే వీరి నిజాయితీ ఏమిటో అర్థమవుతుంది. ప్రజలకు అన్ని విషయాలు విడమర్చి చెప్తామంటున్న వీరు, ఈ ప్రాజెక్టుకు సంబంధించిన అతి ముఖ్యమైన 'అణుధార్మికత' అంశం గురించి ప్రజలకు వివరించలేనప్పుడు వీరి మీద ఏం నమ్మకం ఏర్పడుతుంది.

యురేనియం అణుధార్మిక గుణం కలిగిన అస్థిర ఖనిజాలలో ఒకటి. అది తనంతట తానుగా థోరియంగా, రేడియంగా, రేడాన్‌గా ఇలా అంచెలంచెలుగా మారి చివరికి సీసంగా స్థిరపడుతుంది. ఈ క్రమంలో ఇది నిరంతరం అస్థిరంగా వుంటూ సుక్ష్మ రీతిలో విస్ఫోటం చెందుతూ అణుధార్మిక శక్తిని పరిసరాలలోకి విడుదల చేస్తూనే వుంటుంది. ఈ క్రమాన్ని 'అణుధార్మిక శక్తి విభజన' అంటారు. ఈ శక్తి విభజనలో ఆల్ఫా, బీటా అణుపదార్థలు, గామా కిరణాలు ఆగకుండా కాంతివేగంతో బయటకు వస్తూనేవుంటాయి. అయితే ఇదంతా ఏదో ఒక రోజులోనో లేదా రెండు రోజుల్లోనో సమాప్తమయ్యే అంశం కాదు. యురేనియం వంటి అణుధార్మిక గుణం కలిగిన పదార్థాలు, పదార్థ రీత్యా (అటామిక్ వెయిట్) సగం కావడానికి పట్టే సమయాన్ని 'హాఫ్ లైఫ్' అంటారు. ఉదాహరణకి రెండు గ్రాముల 'యు-238' పదార్థం అవశేషం (డికే) చెందుతూ ఒక గ్రాము పదార్థంగా మారటానికి 450 కోట్ల సంవత్సరాలు పడుతుంది. దీనికి రంగు, రుచి, వాసన తదితర స్వభావాలు ఏవి వుండవు - అణుధార్మికత తప్ప. ఈ అణుధార్మికత అనేక రకాలుగా రూపాంతరం చెందుతూ మన చుట్టూ వున్న వాతావరణంలోని నీరు, గాలి, పంటలు, ఆహారాలలోకి చేరి, తద్వారా మానవ, జంతు శరీరాల్లోకి ప్రవేశించి జన్యు వ్యవస్థ మీద తీవ్ర ప్రభావాన్ని చూపిస్తుంది.

ముప్పై సంవత్సరాలకు పైగా జార్ఖండ్‌లోని జాదుగోడలో యుసిఐఎల్ యురేనియం తవ్వకాలను చేపట్టి అక్కడి ప్రజల ఆరోగ్యాన్ని తీవ్ర దుష్ఫలితాలకు గురి చేసిందనేది అత్యంత విషాదకరమైన వాస్తవం. అక్కడ అనేక రకాలైన అంగ వైకల్యాలు, కాన్సర్‌లు, గర్భస్రావాలు, చర్మవ్యాధులు, వంధ్యత్వం, బుద్ధిమాంద్యం వున్న పిల్లలు పుట్టటం, మందులకి లొంగని అత్యంత బాధాకరమైన జబ్బులు చాలా ఎక్కువ శాతం వున్నట్లుగా అనేక శాస్త్ర సాంకేతిక నివేదికల్లో, ఆరోగ్య వైద్య సర్వేలలో నిరూపించబడింది.

పిల్లి కళ్లు మూసేసుకుని పాలు తాగినంత మాత్రాన, పిల్లి లేకుండా పోదుగా!? కానీ, యుసిఐఎల్ మొదటినుంచి కూడా జాదుగోడలో అసలే జబ్బులూ లేవని, ప్రజలంతా సంపూర్ణ ఆరోగ్యంగా వున్నారని ప్రచారం చేస్తోంది. ఇది మరీ విడ్డూరం! అసలు జబ్బులు లేని మానవ సమాజం వుంటుందా!? అంటే, యురేనియం తవ్వకాలవల్ల అస్సలు జబ్బులనేవే లేకుండా పోతాయని మనం అర్థంచేసుకోవాలన్న మాట. ఈ లెక్కన మనందరం కూడా ఊరూరా యురేనియం తవ్వకాలు జరగాలని కోరుకోవాలేమో? ఈ అశాస్త్రీయ, అసమగ్ర ధోరణులే మొదటినుంచి

యుసిఐఎల్ పనివిధానం మీద, వారు చెప్పే, వారు చేసే పనుల మీద నిరంతరం విమర్శలకు తావిస్తున్నాయి.

2020 నాటికి భారతదేశం తన దగ్గరవున్న మొత్తం యురేనియం వనరులను ఉపయోగించుకున్నా 10వేల మెగావాట్ల అణువిద్యుచ్ఛక్తిని మాత్రమే తయారు చేసుకోగలదని 'అటామిక్ ఎనర్జీ కమిషన్' ఛైర్మన్ అనిల్ కకోద్కర్ పదే పదే పేర్కొంటున్నారు. ప్రస్తుతం మొత్తం విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యం లక్ష మెగావాట్లలో అణువిద్యుత్తు సామర్థ్యం మూడువేల మెగావాట్లు మాత్రమే. అయితే, 2020 నాటికి ఇప్పటికిలాగే, అప్పుడూ అణుశక్తి మొత్తం విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో 2 నుంచి 3 శాతం మాత్రమే వుంటుందని గణాంకాలు తెలియజేస్తున్నాయి.

కాని, భారత అణుఇంధన శాఖ గత యాభై సంవత్సరాలుగా ప్రజాధనాన్ని లక్షల కోట్లు ఖర్చుచేయటమే కాక ప్రజావర్యావరణ అభద్రతను సృష్టించటం, చాలా అత్యల్ప నిష్పత్తిలో మాత్రమే విద్యుత్‌ను ఉత్పత్తి చేయటం జరుగుతోంది. ఒక ప్రజాస్వామిక దేశంలో ఇప్పటికీ అత్యధికులు నిరక్షరాస్యులుగా వున్న మన దేశ ప్రజలు అణు విద్యుత్‌ను నిజంగా కోరుకుంటున్నారా? ఈ వివరాలన్నీ ప్రజలకు సంపూర్తిగా అర్థమయ్యేలా వివరించగలిగే యంత్రాగమేదైనా పనిచేస్తోందా? లేదా బలవంతంగా వారిమీద రుద్దబడుతోందా? యురేనియం అంతిమ గమ్యం అణ్వాయుధ తయారీనే అనేది ఎంత దాచిపెట్టినా దాగని సత్యం. ఈ గమ్యం కోసమే అభివృద్ధి నినాదం పేరుతో మొదటినుంచి చివరి దాకా కూడా బీభత్స రచన సాగుతోంది.

అపారమైన విద్యుత్‌ను ఎరగా వేసి ఒక కలల ప్రపంచాన్ని సృష్టించి అధికార, సాంకేతిక బలంతో విధ్వంసాన్ని సృష్టిస్తున్నారు. ఎన్నో అభివృద్ధి చెందిన దేశాలు అణువిద్యుత్తు ఒక 'కల' మాత్రమేనని, దాన్ని సాకారం చేసుకోవడమంటే కొరివితో తలగోక్కోవడమేననే 'నిజాన్ని' అంగీకరించాయి. గత ముప్పై సంవత్సరాలుగా, మరీ ముఖ్యంగా 'చెర్నోబిల్' (పూర్వపు సోవియట్ యూనియన్, ఏప్రిల్ 27, 1986), 'త్రీ మైల్ ఐలండ్' (అమెరికాలో మార్చి 28, 1979 న జరిగిన ఈ ప్రమాదం తర్వాత అక్కడ ఇంతవరకు కొత్త అణుపరిశ్రమలు నెలకొల్పలేదు.) ప్రమాదాల అనంతరం అక్కడి ప్రజలు, ప్రభుత్వాలు అణువిద్యుత్తును నిరసిస్తుండగా... అన్ని విషయాల్లో మాదిరిగానే అభివృద్ధి చెందిన దేశాలు వదిలేసిన సాంకేతిక పరిజ్ఞానాన్ని, మూడోప్రపంచ దేశాలు... అందులో ఒకటైన భారతదేశం తన నెత్తిన పెట్టుకోవడం స్పష్టంగా కనిపిస్తోంది. దీని వెనుకనున్న రాజకీయాలను శోధించి బట్టబయలు చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

భారతదేశంలో ఉత్పత్తి అయ్యే విద్యుత్‌లో 40% సరఫరా సమయంలోనే నష్టమవుతోంది. అంటే దీనిని కనీసం తగ్గించుకున్నా 4 రేట్లు అణువిద్యుత్‌ను తయారుచేసుకున్నట్లే. ముడి ఇంధనం తవ్వకాలు, శుద్ధి, ఎన్‌రిచ్‌మెంట్ ప్రాసెస్, అణువ్యర్థాలు, అవశేషాల నిలువలు రక్షణ – ఇలా అనేక స్థాయిల్లో విపరీతమైన ఖర్చు, అభద్రతతో కూడుకుని వుంటుంది. అణువిద్యుత్తు, మిగిలిన అన్ని విద్యుత్ ఉత్పాదనల్లోకి చిట్టచివరగా ఎంచుకోవాలే గానీ, మొదటగా ఎంత మాత్రమూ కాదు. ముఖ్యంగా అధిక జనసాంద్రత కలిగిన మన దేశంలో, దీని దుష్ప్రభావం ఇన్ని స్థాయిల్లో ఇంత ఎక్కువగా వుండటం వల్ల ఇది మన దేశ అభివృద్ధికి ఎంతో అవసరమని చెప్పటం బాధ్యతారాహిత్యమే అవుతుంది.

కడప ప్రాజెక్టుకు సంబంధించి 'పర్యావరణ ప్రభావ అంచనా–అధ్యయనం' (ఇఐఎ) ఎంత అశాస్త్రీయంగా, సాంకేతిక లోపాలతో ఎంత అసమగ్రంగా వుందో తెలుసుకుందాం. అతి ముఖ్యమైన యురేనియం (ప్రిస్క్రయిబ్‌డ్ మెటల్) ని భూమి నుంచి తవ్వితీయటానికి పర్యావరణానికి సంబంధిన కొన్ని ముఖ్యమైన అంశాలను సంవత్సరాల తరబడి పరిశీలించిన తర్వాతే పూర్తి వివరాలతో 'పర్యావరణ ప్రభావ నివేదిక' ను తయారుచేయాలి. దీనికంటే ముందుగానే ఈ ప్రాజెక్టు ఉపయోగాలు ఏమిటో, ఇది ఏర్పాటు కాని పక్షంలో ప్రత్యామ్నాయల పాత్ర ఏమిటో, సమగ్రమైన వివరణ ఇవ్వాలి. ఈ ప్రత్యామ్నాయాలు కనుక వాటి ఉపయోగాన్ని నెరవేర్చేటట్లయితే, యురేనియం కంటే ఎక్కువ సామర్థ్యంతో పనిచేసేటట్లయితే, పర్యావరణానికిగానీ, ప్రజలకుగానీ ఏ హానీ చేయనట్లయితే, అది పునర్వినియోగం (రెనెవబుల్) చెయగలిగినట్లయితే (గాలి, సూర్యరశ్మి), మరీ ముఖ్యంగా చాలా చవుకగా లభ్యమయ్యేటట్లయితే యురేనియం బదులుగా ప్రజలు అటువంటి ప్రత్యామ్నాయలను ఎందుకు కోరుకోకూడదో, యురేనియమే ఎందుకు తప్పనిసరో వివరించాల్సిన బాధ్యత నివేదికను రూపొందించే వారి పైన వుంటుంది.

కానీ, అటువంటి వాటిని వేటిని పరిగణలోకి తీసుకోకుండా, తరిగిపోతున్న బొగ్గు నిల్వలు, పెట్రోలు గురించి మాత్రమే చెబుతూ, యురేనియం ఎప్పటికీ తరిగిపోని ఇంధనంగా చూపించటం యుసిఐఎల్ వారి అశాస్త్రీయ అతి తెలివికి పెద్ద నిదర్శనం.

కడప జిల్లా ప్రాజెక్టికి సంబంధించి కేవలం 2 1/2 నెలల శీతాకాలపు వివరాలను తీసుకుని, ముప్పై సంవత్సరాల కాలవ్యవధి కలిగిన ప్రాజెక్ట్‌ని తయారుచేయడమనేది ఏ మాత్రం అంగీకరించదగిన నివేదిక కాదు. అసమగ్ర సమాచారం నుంచీ తయారయ్యే నివేదిక చాలా లొసుగులతో కూడుకుని వుంటుదనేది నిర్వివాదాంశం. అంతేకాకుండా పలుచోట్ల యుసిఐఎల్ తమకు ఈ ప్రాజెక్టు నిర్వహణలో అపారమైన అనుభవం వుందని చెబుతూ, అన్ని జాగ్రత్తలూ తీసుకుంటామని అనటమే కానీ, ఆ జాగ్రత్తలు ఏమిటో, ఎలా తీసుకుంటారో పేర్కొనలేదు. ఉదాహరణకి, ముప్పై సంవత్సరాలకు తయారు చేసిన రిపోర్టులో పదిహేను సంవత్సరాలకు మాత్రమే సరిపోయే టెయిలింగ్స్ పాండ్ (అణుధార్మిక వ్యర్థాలను భద్రపరిచే చెరువు) గురించి చెప్పారు. అయితే మిగిలిన పదిహేను సంవత్సరాల్లో ఈ అణుధార్మిక వ్యర్థాలను ఏ ప్రదేశంలో భద్రపరుస్తారో మాటమాత్రంగా నయినా సూచించలేదు. అంతేకాదు, ఈ చెరువుల అడుగుభాగం చౌరబాటు సాధ్యంకాని, నీరు ఇంకకుండా వుండేవిధంగా (ఇమ్‌పర్వియస్) తయారుచేస్తామని రాశారే గానీ, అది ఎలా సాధ్యమవుతుందో, ఏఏ పదార్థాలు అందులో ఉపయోగించి, ఎలా చేస్తారో వివరించలేదు. పైగా క్షారగుణం కలిగిన ఖనిజం నుంచి యురేనియంని వెలికితీసే శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం గురించి వివరంగా చర్చించలేదు. బహుశా ఈ రకమైన సాంకేతిక అంశాలు మనలాంటి మూఢజనానికి అర్థంకావని కాబోసు!? ఇలా చెప్పుకుంటూపోతే ప్రభుత్వరంగ సంస్థ అయిన యుసిఐఎల్ మొదటినుంచీ చివరిదాకా ప్రతి అంశంలో కూడా

అశాస్త్రీయంగానూ, అసమగ్రంగానూ, బాధ్యతా రాహిత్యంగానూ వ్యవహరిస్తూ వుండటం కళ్లముందు లిఖితపూర్వకంగా కనిపిస్తున్న వాస్తవం.

మనం ఏ చిన్న వస్తువుని కొన్నా కనీసపాటి కాలవ్యవధిలో గ్యారంటి వుంటుంది. మనం దాన్ని ఆశిస్తాం కూడా. అయితే, ప్రాథమికంగానే 1029 కోట్ల పెట్టుబడితో ప్రతిపాదించబడిన ఈ ప్రాజెక్ట్‌కి ఎటువంటి ప్రమాద విశ్లేషణ (రిస్క్ అనాలసిస్) గానీ, అంచనాలుగాని ఏమి చెయ్యలేదు. ఇది ప్రజల ఆరోగ్యాన్ని గానీ, పర్యావరణ భద్రతను గానీ దృష్టిలో వుంచుకుని చేసిన నివేదిక కాదు. కేవలం యుసిఐఎల్‌కు ప్రాజెక్టును కట్టబెట్టటమే ధ్యేయంగా 'మెకాన్' కంపెని రూపొందించిన ఒక తప్పుడు తడకల నివేదిక. ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్న అనేక పరిశోధనల ఆధారంగా ప్రజలకు, పర్యావరణానికి బాధ్యత వహించి రిపోర్టును తయారు చేసేటట్లయితే, ఈ రిపోర్టును తిప్పిపంపటమో లేదా చెత్తబుట్టలో వేయడమో జరగాల్సింది. అందుకు భిన్నంగా, ఆంధ్రప్రదేశ్ కాలుష్య నియంత్రణ మండలి తన వంతు బాధ్యతగా 'పర్యావరణ ప్రజాభిప్రాయ సేకరణ' సభను ఏర్పాటు చేసేముందు ఒక్కసారైన చదివి వుండుంటే, ఇంత ప్రజాధనం, సమయం వృధా కాకుండా వుండేవి. ఈ సంస్థలన్నీ కూడా ప్రజల పట్ల, పర్యావరణం పట్ల పూర్తి నిర్లక్ష్య ధోరణితో మొదటినుంచి చివరిదాకా తమ ఆధిపత్యాన్ని, అధికారాన్ని, పెత్తనాన్ని అడుగడుగునా ప్రదర్శిస్తూ ఒక భయానక వాతావరణాన్ని సృష్టిస్తున్నాయి.

ఇటువంటి పరిస్థితుల్లో చదువుకున్న వారిగా, కాస్తో కూస్తో శాస్త్రీయ సాంకేతిక పరిజ్ఞానం వున్నవారిగా మనందరం ప్రజల పక్షాన నిలబడి, ఇటువంటి ప్రయత్నాలను గర్హించాలి. ముక్తకంఠంతో ఖండించాలి. ఇలాంటి తప్పుడు నివేదికలను అందించిన వారి మీద చట్టపరమైన చర్య తీసుకోవాలి.

ఈ ప్రాజెక్ట్ ప్రజల ఆరోగ్యం మీద ఏ విధమైన ప్రభావాన్ని చూపబోతోందో తెలియాలంటే, ప్రస్తుత ప్రజల ఆరోగ్య స్థితిగతుల (బేస్ లైన్ హెల్త్ డేటా) పూర్తి అంచనాలను పొందుపరచాలి. అప్పుడే భవిష్యత్‌లో వారిపై దీని ప్రభావం వుందా, లేదా, వుంటే ఏ రకంగా వుందనేది నిర్దిష్టంగా నిరూపణ అవుతుంది. గతంలో కూడా నల్లగొండలో ఇటువంటి ఆరోగ్య స్థితిగతుల అంచనాలను పర్యావరణ, ప్రజాసంఘాలు కోరినా గానీ అప్పుడూ ఇప్పుడూ కూడా 'మెకాన్' 'యుసిఐఎల్' సంస్థలు పట్టించుకోలేదు.

### కొసమెరుపు

ముప్పై సంవత్సరాలపాటు వచ్చే 2 కోట్ల 70 లక్షల టన్నుల అణుధార్మిక వ్యర్థాలు తరాలపాటు భరించేందుకు మూల్యంగా 'యుసిఐఎల్' చూపించే ఎరలేమిటంటే, నాలుగైదొందల నైపుణ్యంలేని ఉద్యోగాలు, రోడ్లు, పాఠశాలలు, ఆస్పత్రులు, సాంస్కృతిక కార్యక్రమాల వంటివి కల్పిస్తామని! అసలివన్నీ 'యుసిఐఎల్' వచ్చి కడప ప్రజలకు చేయాల్సిన అవసరమేంటి? వీటి కోసం తమకు జీవనాధారమైన పచ్చటి పంటపొలాల్ని, ప్రస్తుత, భవిష్యత్ తరాల ఆరోగ్యాల్ని పణంగా పెట్టాలా? ఈ మౌలిక వసతులు కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వాలది కాదా? ప్రాజెక్ట్ ఒప్పుకుంటేనే ఈ మౌలిక వసతులు కల్పిస్తామనే బెదిరింపు ఏమిటి? ప్రజలకు సమాధానం ఇవ్వాల్సిన బాధ్యత ఎవరిది?

అయోమయంలోకి, అభద్రతలోకి నెట్టివేయబడుతున్న స్థానిక ప్రజలు తమ అనుమానాలను, వ్యతిరేకతను తెలియజేయటానికి 'పర్యావరణ ప్రజాభిప్రాయ సేకరణ' సభకు వచ్చినప్పుడు వారిని బలప్రయోగంతో అడ్డుకోవటమేకాక, కిరాయి మనషులతో ప్రాజెక్ట్ కావాలని అరిపించటం, అన్ని అనుమానాలు నివృత్తి చేశామని బలప్రయోగంతో, లాఠిచార్జిలతో బెదిరించి ప్రజలకు సాంకేతిక పరమైన అనుమానాలేవీ లేవని ప్రకటించారు. పని కట్టుకుని కొంతమంది ప్రజాసంఘాలు, ప్రభుత్వేతర పర్యావరణ సంఘాలు, రాజకీయ పార్టీలు కడప జిల్లా అభివృద్ధి అడ్డుకుంటున్నాయని, తన నియోజకవర్గ ప్రజలకు మంచి ఏదో, చెడు ఏదో వేరే ఎవరూ చెప్పనక్కరలేదని, అంతా తనకు తెలుసునని ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర రెడ్డిగారు ప్రకటించారు.

కానీ, ఇది ప్రజాస్వామ్యం. ఇక్కడ వ్యక్తిగత ఇష్టాయిష్టాలతో పనిలేదు. ప్రజలకు తమకంటూ అభిప్రాయాలను ఏర్పరుచుకునే హక్కు వుంటుంది. దీనిని కాలరాయలని అనుకోవడం అప్రజాస్వామికం. ◆

# పోరుబాట పట్టిన తెలంగాణ

– నాగోబా

కేంద్ర ప్రభుత్వం నుండి కెసిఆర్, నరేంద్రల రాజీనామా అనంతరం రాష్ట్ర రాజకీయాలు ఒక్కసారిగా వేడెక్కినాయి. టిఆర్ఎస్ నేతల రాజీనామాలను తెలంగాణ ప్రజానీకం హృదయపూర్వకంగా స్వాగతించింది. తెలంగాణలో ఒక బలమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మిస్తే తప్ప, కోస్తా పాలక వర్గాలు అధికారాన్ని తెలంగాణ ప్రజలకు అప్పగించరని, అటువంటి ప్రజా ఉద్యమ దిశగా టిఆర్ఎస్ కదలాలని తెలంగాణలోని అన్ని వర్గాల, సెక్షన్ల ప్రజల నుండి అభిప్రాయం వ్యక్తమవుతున్నది. నిజానికి టిఆర్ఎస్ ఢిల్లీలో లాబీయింగ్‌కే పరిమితమై రాజకీయం నెరుపుతున్నప్పుడు కూడా ఇలాంటి అభిప్రాయమే వ్యక్తమైంది. కెసిఆర్ లాబీయింగ్‌కి వైఎస్ కౌంటర్ లాబీయింగ్ చెక్ పెట్టింది. అంతిమంగా ధనబలం, రాజకీయ పలుకుబడి, మీడియా బలం కలిగిఉన్న వైఎస్ కౌంటర్ లాబీయింగ్‌దే పై చేయి అయి కెసిఆర్ కళ్లు తెరిపించింది. అంగి నలుగకుండానే తెలంగాణని సాధిస్తానని కెసిఆర్ చెప్పేవారు. త్యాగాలు లేకుండా, పోరాటాలు లేకుండా పాలకులు అధికారాన్ని అప్పగించిన దాఖలాలు ప్రపంచ చరిత్రలో ఎక్కడా లేవని కెసిఆర్ కు తెలంగాణ ఉద్యమం గుర్తు చేస్తూనే ఉన్నది. తెలంగాణ వనరులపై ఆధిపత్యాన్ని వదులుకోవడానికి కోస్తా పాలకవర్గాలు సిద్ధంగా లేవు. వారిని ప్రజా ఉద్యమం ద్వారానే ఓడించవలసి ఉన్నది. కాంగ్రెస్ తెలంగాణకు చేసిన, చేస్తున్న ద్రోహాన్ని గుర్తించడానికి కెసిఆర్ కు రెండున్నర ఏండ్లు పట్టింది. ఈ రెండున్నర ఏండ్ల తెలంగాణ ప్రజా ఉద్యమం కొంత మేరకు స్తబ్దతకు లోనయినా ప్రజా సంఘాల కృషివలన, చొరవ వలన సజీవంగానే నిలిచి ఉంది. అయితే టిఆర్ఎస్ మాత్రం తీవ్రంగానే నష్టపోయింది. ప్రజల ఆగ్రహానికి గురి అయ్యింది.

రాజీనామాల అనంతరం తెలంగాణ అంతటా ఉద్యమ వాతారణం పుంజుకున్నది. తెలంగాణ మల్లోకసారి పోరుబాట పట్టింది. ఒకవైపు తెలంగాణ ప్రజా సంఘాల కార్యక్రమాలు, మరొకవైపు టిఆర్ఎస్ శ్రేణుల కదలికలు ఉద్యమానికి ఊపునిస్తున్నాయి. ప్రజల స్వచ్ఛంద ప్రతిస్పందనతో తెలంగాణ మేధావి వర్గం రచయితలు, కవులు, కళాకారులు, ఉద్యోగులు, జర్నలిస్టులు, విద్యార్థులు ఐక్య ఉద్యమ కార్యాచరణలో మునిగిపోయారు. సెప్టెంబరు 8న సిద్దిపేట శంఖారావం అపూర్వంగా విజయవంతం కావడంతో టిఆర్ఎస్ శ్రేణులలో ఉత్సాహం ఉరకలు వేస్తున్నది. కాంగ్రెస్ ద్రోహాన్ని నిరసిస్తు ఊరూరా ఊరేగింపులు, దిష్టిబొమ్మల దగ్ధం, ఘెరావ్‌లు, రాస్తారోకో సాగుతూనే ఉన్నాయి.

ఇప్పుడు రంగంలో శత్రువు స్పష్టంగానే కనిపిస్తున్నాడు. అందరి బాణాలు శత్రువు వైపుకే ఎక్కుపెట్టి ఉన్నాయి. పరస్పర విమర్శలు తగ్గిపోయినాయి. యుద్ధ భూమిలో తెలంగాణ శక్తుల మోహరింపు ఒకవైపు, తెలంగాణ శత్రువుల మోహరింపు మరోకవైపు జరిగిపోయింది. ఈ రకమైన ఏకీకరణ గడచిన రెండున్నర ఏండ్లలో మొదటిసారి కనిపిస్తున్నది. ఈ ఏకీకరణ కోస్తా పాలకవర్గాలలో గుబులును రేకెత్తిస్తున్నది. ద్రోహులు మౌనముద్రలోకి వెళ్లిపోయారు. ఇంతకాలం తమ మనోభావాలను హృదయంలోనే అణిచివేసుకున్న కాంగ్రెస్ ప్రజా ప్రతినిధులు ఒక్కొక్కరే తమను తాము ఘంటాపథంగా వ్యక్తీకరించుకుంటున్నారు. తెలంగాణ ప్రజా సమస్యలపై ప్రభుత్వాన్ని ఇరుకున పెడుతున్నా పి. జనార్ధనరెడ్డి, శశిధర్‌రెడ్డిలకు తోడుగా బలహీన వర్గాలకు చెందిన మధుయాష్కీ గౌడ్, సర్వేసత్యనారాయణ, వి.ఎచ్. హనుమంతరావులు తమ గొంతు విప్పడం కాంగ్రెస్‌లో కల్లోలం సృష్టిస్తున్నది. అదే విధంగా సమైక్య వాదాన్నే ఇప్పటికీ వల్లిస్తున్న తెలుగుదేశం నాయకుల్లోనూ అంతర్మధనం మొదలైనట్లుగా సూచనలు వస్తున్నాయి. దేవేందర్‌గౌడ్, వరంగల్ మాజీ ఎం.పీ. చాడ సురేష్ రెడ్డి ఇప్పటికే తెలంగాణ అనుకూల ప్రకటనలు చేసి ఉన్నారు.

ఊపందుకుంటున్న తెలంగాణ ప్రజా ఉద్యమాన్ని మరోక్కసారి జోకొట్టడానికి పాలకవర్గాలు కుట్రలు, మాయోపాయాలు, అబద్దపు ప్రచారాలు అమలు చేస్తున్నాయి. ఉద్యమానికి విరుగుడుగా పాలకవర్గాలు ప్రధానంగా ఎంచుకున్న మార్గం అభివృద్ధి మంత్రం. మరిన్ని ఎక్కువ నిధులతో ప్యాకేజీలను ప్రకటించడం. ఈ అభివృద్ధి చిలకపలుకుల్ని తెలంగాణ మంత్రులచే, ఎమ్మెల్యేల చేతనే పలికింప చెయ్యడం ఈ ప్రహసనంలో కొసమెరుపు. వారికి తనిఖీకి వీలులేని గణాంకాలతో దట్టించిన నివేదికలు తయారు చేయించి పంపిణీ చేశారు. ఆ నివేదికల్లో పొందుపర్చిన గణాంకాలనే ఏ ప్రశ్నలు లేకుండా చిన్నారెడ్డి ప్రభృతులు జపిస్తూ వైఎస్ హయాంలో తెలంగాణ బ్రహ్మాండంగా అభివృద్ధి చెందుతున్నదని ప్రజల్ని భ్రమింపజేయడానికి ఎంత ప్రయాస పడుతున్నారో! అయితే ఈ అభివృద్ధి బూటకత్వాన్ని తెలంగాణ ఉద్యమం సమర్ధవంతంగా ఎదుర్కొన్నది. ప్రభుత్వ గణాంకాలన్నీ అబద్దాలని సాధికారంగానే తెలంగాణ విశ్లేషకులు నిరూపించారు. వ్యవసాయరంగంలో, విద్యుత్‌రంగంలో, సాగునీటిరంగంలో, ఉద్యోగరంగంలో, విద్యారంగంలో తెలంగాణ వెనుకబాటుతనాన్ని, వివక్షని ముఖ్యంగా వైఎస్ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత వివక్షను సైతం ఎండగడుతూ పత్రికల్లో చర్చించారు. గత 50 ఏళ్లుగా భాషా, సాహిత్య సాంస్కృతిక రంగంలో వివక్షను అణిచివేతను వివరిస్తూనే ఇటీవలి కాలంలో పాలకవర్గాల వివక్షనూ ఎండగడ్తూ చర్చించారు. తెలంగాణ విద్యావంతుల వేదిక ఆధ్వర్యంలో సెప్టెంబర్ 10వ తేదిన 'పొలిటిక్స్ ఆఫ్ డెవలప్‌మెంట్' అన్న అంశం పై ఉస్మానియా యూనివర్సిటీలో ఏర్పాటు చేసిన సెమినార్‌లో ఒక రోజంతా సాగించిన చర్చలు ప్రభుత్వ అభివృద్ధి బూటకత్వాన్ని ఎండగట్టడంలో, తిప్పికొట్టడంలో గణనీయమైన ఫలితాలు సాధించాయి. ఈ చర్చల ఫలితంగా – తెలంగాణ కేవలం అభివృద్ధితో ముడిపడిన అంశం మాత్రమే కాదు, తెలంగాణ స్వయం పాలన కోరుతున్నది. వనరులపై ఆధిపత్యాన్ని, వనరుల వినియోగంపై స్వేచ్ఛని కోరుతున్నది. తెలంగాణ తనకున్న ప్రత్యేక భాషా సాంస్కృతుల

అస్తిత్వాలను పరిరక్షించుకోవాలనుకుంటున్నది. అందుకు ప్రత్యేక రాష్ట్రమే పరిష్కారమని, ప్రత్యేక రాష్ట్రంలోనే తెలంగాణ సమగ్ర అభివృద్ధి సాధ్యమని తేల్చి చెప్పినట్లయింది. ఈ చర్చల సారాంశాన్ని అందిపుచ్చుకున్న కాంగ్రెస్ ఎంపీలు మధుగౌడ్, సర్వే సత్యనారాయణ కూడా అభివృద్ధితో సంబంధం లేకుండానే తెలంగాణ రాష్ట్రం ఏర్పడాలి. ప్రత్యేక రాష్ట్రమే ప్రజల ఆకాంక్ష అని నిర్ద్వందంగా ప్రకటించడంతో అభివృద్ధి మంత్రం జపించడం ఆగిపోయింది.

ఉద్యమానికి విరుగుడుగా పాలకవర్గాలు ఎంచుకున్న మరో మార్గం తెలంగాణ అంశం చుట్టూ చిక్కుముడులు వేసి తెలంగాణ బయటపడేందుకు వీలు లేకుండా చేయడం. అటువంటి కుట్రలో భాగమే – తెలంగాణ ఏర్పాటైతే హైదరాబాద్ నగరం కేంద్ర పాలిత ప్రాంతం అవుతుంది. దానికి ఓవైసీయే ముఖ్యమంత్రి అంటూ జె.సి. దివాకరరెడ్డి లాంటి నాయకులు, హైదరాబాద్‌లో భూములు, వ్యాపారాలు, మాఫియా లావాదేవీలు నిర్వహిస్తున్న నాయకులు హైదరాబాద్ పై తమ పట్టు జారిపోకుండా ఉండేందుకు ప్రయాసపడుతున్నారు. దీనికి ఎంఐఎం పార్టీ తెలంగాణ చరిత్రను, తెలంగాణకు హైదరాబాద్‌తో ఉన్న భౌగోళిక, చారిత్రిక, సాంస్కృతిక అనుబంధాన్ని మర్చిపోయి కోస్తా వలసవాదుల కుట్రలకు పావులుగా మారడం ఒక విషాదం. మరోవైపు తెలంగాణ కంటె ముందు సీమ ఏర్పడాలంటున్నారు. ఉత్తరాంధ్ర కూడా వెనుకబడిన ప్రాంతం కాబట్టి ఉత్తరాంధ్ర ఏర్పడాలంటున్నారు. వెనుకబాటు తనమే తెలంగాణ ఏర్పాటుకు ప్రాతిపదిక అయితే ప్రతీ వెనుకబడిన జిల్లా ఒక రాష్ట్రంగా ఏర్పడాలని మరొక కోస్తాంధ్ర రాజకీయ మేతావి వ్యాఖ్యానించాడు. వీరిచే ఈ రకంగా వ్యాఖ్యానాలు చేయించి ప్రసారం చేసేందుకు మిడియా ఎనలేని కృషి చేస్తున్నది.

తెలంగాణ ఉద్యమం పైన వివరించిన చిక్కుముడులను విప్పేందుకు, అసలు చిక్కుముడులు పడకుండా జాగ్రత్తపడవలసి ఉన్నది. దూరదృష్టితో వ్యవహరించవలసి ఉన్నది. ఎవరు కాదన్నా ఎంఐఎం హైదరాబాద్‌లో బలమైన రాజకీయ శక్తి. ముస్లిం ప్రజానీకం పై పట్టుకలిగిన సంస్థ. అటువంటి సంస్థ వలసపాలకుల కుట్రలకు పావుగా మారుతున్నదంటె హైదరాబాద్ నగరం ఒక జటిల సమస్యగా, రాష్ట్రావతరణకు అడ్డంకిగా మారే అవకాశమున్నది. అయితే తెలంగాణ ముస్లింల మనోభావాలు తెలంగాణకు అనుకూలంగానే ఉన్నాయి. వారి మనోభావాలను దృష్టిలో ఉంచుకొని ముస్లింలను ప్రత్యేక శ్రద్ధతో ఉద్యమంలోకి సమీకరించి ఎంఐఎం ని నిలువరించవలసి ఉన్నది. బొంబాయిని నగర రాష్ట్రంగా మార్చాలన్న గుజరాత్ డిమాడ్‌ను తిప్పికొట్టి బొంబాయి నగరం రాష్ట్రంలో విడదీయరాని అంతర్భాగమని అత్యంత గొప్ప వాదనా పటిమతో నిరూపించిన అంబేద్కర్ ఆలోచనా విధానం ఈ సందర్భంగా ఉద్యమానికి ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఇక టిజి వెంకటేష్ లాంటి రాయలసీమ నేతల లక్ష్యం తెలంగాణ ఏర్పడటాన్ని అడ్డుకోవడమే. రాయలసీమ రాష్ట్రం నిజంగా ఆ ప్రాంత ప్రజల ఆకాంక్షనే అయితే తెలంగాణ ఏర్పాటుతో సంబంధం లేకుండానే ఆ డిమాండు ముందుకు రావాలి. అట్లాకాక తెలంగాణ కల్సిఉంటే మేమూ కల్సి ఉంటాం, లేదంటే మా మానాన మేం విడిపోతాం అనడం తెలంగాణ ఏర్పాటును అడ్డుకోవడమే అవుతుంది. తెలంగాణతో సంబంధం లేకుండానే ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుండి విడిపోయి ఆంధ్రులతో కల్సి ఆంధ్రరాష్ట్రంగా ఏర్పడినారు. తెలంగాణ ప్రజల మనోభావాలకు విరుద్ధంగానే ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. ఆనాడు తెలంగాణతో ఎట్ల కలిసారో అట్లా విడిపోవడమే న్యాయం. అటు తర్వాత వారు కోస్తాతో కల్సి ఉంటారో లేదా విడిపోతారో వారిష్టం. చిక్కుముడులు బిగించి తెలంగాణ రాష్ట్రాన్ని అడ్డుకోవడం అప్రజాస్వామికం. ఈ విషయాన్ని రాయలసీమ ప్రజలకు, మేధావులకు, ప్రజాస్వామిక వాదులకు వివరించి వారి మద్దతును ఉద్యమం తీసుకోవాల్సి ఉన్నది.

ఇక కెసిఆర్ లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా చేయడం కాంగ్రెస్ అధిష్ఠానాన్ని మరింత ఇరుకున పడేసింది. సెప్టెంబర్ 23నాటికి కాంగ్రెస్ నుండి తెలంగాణ ఏర్పాటుకు సంబంధించి స్పష్టమైన ప్రకటన రానట్లయితే తన రాజీనామాని అమోదించమని స్పీకరును కోరడమే కాక, యుపిఎకి తమ పార్టీ మద్దతు ఉపసంహరించినట్లుగా రాష్ట్రపతికి లేఖ సమర్పిస్తానని కెసిఆర్ కాంగ్రెస్‌కు అల్టిమేటం జారీ చేసారు. కాంగ్రెస్ తర్జన భర్జన పడుతోంది. కరీంనగర్ ఉపఎన్నిక అనివార్యం అయితే మళ్లీ గెలవడం ఖాయం అన్నధీమాని సిద్ధిపేట శంఖారావం ఇవ్వగా కాంగ్రెస్ చతికిలపడిపోయి కెసిఆర్‌ని బుజ్జగించ చూస్తున్నది. కాంగ్రెస్‌తో పొత్తులేకుండా గెలిస్తే టిఆర్ఎస్ బలనిరూపణే కాకుండా, ప్రజల ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష మరోసారి వెల్లడయ్యే అవకాశం ఉన్నది. అది కాంగ్రెస్ ద్రోహాన్ని ప్రజలు గుర్తించినట్లవుతుంది. టిఆర్ఎస్‌పై పోటీ చేసి గెలువలేమన్న శంక కాంగ్రెస్‌ను పీడిస్తున్నది. అందుకే కాళ్లబేరానికి దిగింది. ప్రజాబలం మళ్లీ కెసిఆర్‌ని బలోపేతం చేసింది. ఇప్పుడు బంతి కాంగ్రెస్ కోర్టులో ఉన్నది. తెలంగాణ ద్రోహిగా తన మీద పడిన ముద్రను తొలగించుకుంటుందా? ఎన్నికల్లో ప్రజలకు ఇచ్చిన వాగ్దానాలను నెరవేరుస్తుందా? లేక యధావిధిగా తన ద్రోహ మార్గంలో పయనించి ప్రజల ఛీత్కారానికి గురి అవుతుందా? కొద్ది రోజుల్లోనే తేలిపోతుంది.

ఏది ఏమైనా ఉద్యమం ఐక్యంగా ముందుకు సాగాల్సి ఉన్నది. పరస్పర నిందారోపణలకు దూరం ఉండటం అవసరం. రెచ్చిపోయి పాలకవర్గాల ఉచ్చులోకి దిగి ఉద్యమాన్ని అణిచివేయజూసే కుట్రలకు బలికాకుండా సంయమనంతో వ్యవహరించవలసి ఉన్నది. దూరదృష్టితో ఉద్యమ కార్యక్రమాల రూపకల్పన జరపాలి. అందుకు అనువైన వాతారణం ఇప్పుడు నెలకొని ఉన్నది. ప్రజలు కూడా సంసిద్ధులై ఉన్నారు. తెలంగాణలో ప్రజలెప్పుడూ ముందున్నారు. రాజకీయ నాయకత్వమే వారిని నడిపించడంలో, వారికి మార్గ నిర్దేశనం చెయ్యడంలో వెనుకబడిపోయింది. ప్రజలకూ తమకూ ఉన్న ఎడమని దూరం చేసి, ఉద్యమ స్వభావాన్ని గుర్తెరిగి, అన్ని వర్గాల, సెక్షన్ల ప్రజలను కలుపుకొని పోయేందుకు నాయకత్వం విజ్ఞతను విచక్షణను ప్రదర్శించాలి. పోరుబాట పట్టిన తెలంగాణ విజయం సాధించడంలో ఇక ఎంతోకాలం పట్టదు. ◆

# 'వందేమాతరం' వివాదం-ఒక పరిశీలన

- పి. సాగర్

జాతీయగీతంగా 'వందేమాతరమ్' పై వాదవివాదాల విశ్లేషణలోకి వెళ్లడానికన్న ముందు క్లుప్తంగా ఆ గీతం చరిత్రను పరిశీలిద్దాం.

సుప్రసిద్ధ బెంగాలీ రచయిత బంకించంద్ర చటర్జీ 1875 'బంగదర్శన్' అనే పత్రికలో ఆ కవితను ప్రచురించాడు. నాలుగు చరణాలుగా రాసిన ఆ గీతంలో మొదటి రెండు సంస్కృతంలో ఉంటాయి. మిగతా రెండు బెంగాలీలో. ఆయనకు సన్నిహిత మిత్రుడైన నవీన్ చంద్రసేన్ అనే కవి ఇటువంటి కిచిడీని ప్రజలు ఇష్టపడరని చెప్పాడు. ఆ కాలపు సుప్రసిద్ధ బెంగాలీ గాయకుడు జాదుభట్ ఆ గీతాన్ని ఇష్టపడి ఆకర్షణీయమైన బాణీ కట్టాడు. 1882లో తానురాసిన 'ఆనందమఠ్' నవలలో బంకిం ఈ గేయాన్ని చేర్చాడు. 1885లో రవీంద్రుడు ఇంకో కొత్త బాణీని దీనికి కట్టాడు. అయినా బెంగాల్‌లో కూడ అప్పటికది పెద్ద ఆకర్షణకాలేదు.

బెంగాల్‌లో ముస్లింల జనాభా తగినంతగా ఉంది. అందులో 1905లో విభజింపబడేనాటికే తూర్పు బెంగాల్‌లో అత్యధికశాతం ముస్లింలే. ఈ ముస్లింలకు వ్యతిరేకంగా, వీళ్లను దేశం నుంచే తన్ని తరిమేయాలని సంతాన్‌లు (సన్యాసులు) ఉద్యమాలను నడిపారు. ఈ ఉద్యమాలను బలపరుస్తూ హిందూదేవత అయిన దుర్గను ఆవాహనచేస్తూ రాసిన గీతం 'వందేమాతరం'. 'ఆనందమఠ్' నవలా ప్రయోజనం కూడ అదే. 'వందేమాతరం' గీతంలోని మూడు నాలుగు చరణాల్లో దుర్గమాతను ఆవహింపచేసుకోవడం, ఏడు కోట్ల ప్రజలను (అప్పటి బెంగాల్ ప్రావిన్స్-ఇప్పటి బెంగాల్, బంగ్లాదేశ్, బీహార్, ఒరిస్సాల జనాభా)ఉద్బోధించే గీతమది. దీనిని ఇంగ్లీషులోకి అనువదించిన అరవిందుడు స్వయంగా "బెంగాల్ జాతీయ గీతాన్ని ఇంకొక భాషలోకి అనువదించడం-ఆ భాషలో ఉన్న ప్రత్యేక మాధుర్యం, సులభమైన సూటిదనం, ఉన్నత కవితాశక్తివల్ల కష్టమైన పని" అన్నాడు. ప్రశంసిస్తూనే అది 'బెంగాల్ జాతీయగీతం'గానే అరవిందుడు గుర్తించాడన్నది మనంగమనించాలి. ఇంక గీతాన్ని పూర్తి పరిశీలించి, 'ఆనందమఠ్' నవలను, ఆ నవలలో ఈ గీతాన్ని చేర్చడాన్నిబట్టి చూస్తే ఇది బెంగాలీల్లో కూడ హిందువులకు ప్రేరణగా రాసిన గీతమని పోల్చుకోవడం కష్టంకాదు.

పద్దెనిమిదోశతాబ్దం ఉత్తరార్ధంలో బెంగాల్‌లోని చారిత్రక సంధిదశను చిత్రించే నవల ఆనందమఠ్. కీలుబొమ్మ ముస్లిం నవాబును ముందుపెట్టుకొని ఈస్టిండియా కంపెనీ రైతులనుంచి పెద్దమొత్తంలో శిస్తులు వసూలుచేసే కుట్రలు చేస్తున్నది. వరుసగా మూడు అకాలాలలో తీవ్రమైన దుర్భిక్షం ఏర్పడింది. భూములు బీడుపడి మూడోవంతు ప్రజలు మరణించారు. రాజమార్గాలమీద దోపిడీలు మొదలయ్యాయి. కరువువాతపడిన గ్రామీణులు అందులోచేరడం ఆరంభమైంది. అటువంటికొన్ని బృందాలకు హిందూసన్యాసులు, ముస్లింఫకీర్లు నాయకత్వంవహించి ఒక నిర్మాణ రూపం ఇచ్చే ప్రయత్నంచేసారు. నవాబును సమర్థిస్తున్న ఈస్టిండియా కంపెనీ ఈ తిరుగుబాటును అణచడంలో బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశాన్ని సుగమంచేసింది. బెంగాల్ రెవెన్యూ, పరిపాలన, శాంతిభద్రతలపై పట్టు సంపాదించి వారన్ హేస్టింగ్స్ సైన్యాలుపంపి తిరుగుబాటును అణిచేసాడు. ఈస్టిండియా కంపెనీ చేతుల్లోకి అధికారం వచ్చింది. వలసవాద శిస్తు విధానం ఒక పద్ధతిప్రకారం అమలులోకివచ్చి రైతు మూలుగులు పీల్చడం ప్రారంభమైంది.

ఈ వలసవాద రెవెన్యూ విధానాల గురించి ఆరంభంలో కొన్ని మంచి విశ్లేషణా వ్యాసాలురాసిన బంకించంద్రఛటర్జీ ఈ మొత్తం కరువు, విధ్వంసాలకు నవాబును బాధ్యున్ని చేసి ఈ నవలరాసాడు. అంతేకాదు హిందువుల ఆత్మగౌరవం, విశ్వాసాలు, స్త్రీలు, కులాలు వినాశనానికి గురికావడానికి నవాబేకారణమన్నాడు. అంటే నవాబు ఏజెంట్లయిన ముస్లింలే కారణమన్నాడు.

"నీ పెట్టెలో నీ డబ్బుకు భద్రతలేదు. ఆలయంలో విగ్రహానికి భద్రతలేదు. తల్లి కడుపులో పిండానికి భద్రతలేదు. గర్భంచీల్చి శిశువుల్ని చంపుతున్నారు...మన ప్రాణాలకు ముప్పువచ్చింది. ఈ తాగుబోతు ముస్లిం భ్రష్టుల్ని తరిమేయకుండా మనహిందూ సమాజాన్ని ఎట్లాకాపాడుకుంటాం." (ఆనందమఠ్. పే. 727)

తిరుగుబాటుదారుల్లో ముస్లిం ఫకీర్లపాత్ర పూర్తిగా తొలగించి, సాయుధహిందూ సన్యాసులకు లేని మంచిగుణాలు, శక్తి, ఈ నవల ఆపాదిస్తుంది. అంతిమంగా హిందూజాతీయవాదం అనే భావనకు అనుగుణమైన ఒక కాల్పనిక నిర్మాణాన్ని చరిత్రను వక్రీకరించి కల్పిస్తుంది. పద్దెనిమిదో శతాబ్దం రెండోభాగంలో ఇట్లా ఆలోచించిన వాళ్లేఉండిఉండరు. ఇందులోని సంతాన్‌లు (అంటే పిల్లలు-మాతృభూమి అనే దేవత సంతానం) నిరాధారమైన చారిత్రక పునర్‌నిర్మాణాలు. 1937లోనే హోంశాఖ ఈ నవలను 'ముస్లింలపై ద్వేషగీతం' గా గుర్తించింది. ఈ నవలలో భాగంగా 'వందేమాతరం' గీతాన్ని చదివితేకానీ ఈ నవలేకాదు, ఈ గీతం కూడ ఎంత ముస్లిం వ్యతిరేకమో బోధపడదు.

1875లోనే బంకింరాసిన 'వందేమాతరం', 'ఆనందమఠ్' నవలలోచేరాక కొత్త సాహిత్య, రాజకీయ అర్థాలతో నవలతో ఒక ఆంగిక సంబంధాన్ని సంతరించుకున్నదని తనికాసర్కార్ ఒక పెద్ద పరిశోధనావ్యాసమే రాసింది (ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, సెప్టెంబర్16, 2006 పేజీలు 3959-3969).

దేశాన్ని మాతృభూమిగా, భూమిని మాతృదేవతగా ఆపాదించి, ఆ దేవతను శక్తి స్వరూపిణి అయిన దుర్గగా చిత్రించి ఆమె రక్తదాహంతో పది చేతుల్లో పది మారణాయుధాలతో శత్రువుపై యుద్ధానికి పురికొల్పుతున్నదని ఈ నవలలో ఈ గీతం ద్వారా మహేంద్ర అంటాడు. సంతాన్‌లు రాక్షస సంహారకుడైన కృష్ణున్ని పూజించే వైష్ణవులేకాదు, కాళిని పూజించే శాక్తేయులుకూడ.

జీవితంకన్న త్యాగం, త్యాగంకన్న భక్తి గొప్పదని, ఆ భక్తి మాతృభూమిని దేవతగా ఆరాధించేది కావాలని ఈ గీతం చెప్పుతుం "మేము ప్రతి దేవాలయంలో ఆరాధించేది నీరూపమే".

'వందేమాతరం' గీతంలోని మొదటి రెండు చరణాల్లోని శ్యామల సస్యాలు, సుజలాలు, సుఫలాలు, ద్రుమదళశోభలు-అన్నీ కరువుతో అంతరించి తర్వాత రెండు చరణాల్లో ఇష్టదేవత బీభత్స రూపాన్ని దాల్చి కత్తులు జళిపిస్తూ (ముస్లిం) శత్రువుల రక్తాన్ని కోరుతుంది.

"వాళ్లు చంపివేసిన శత్రువులనుంచి ఆయుధాలను లాక్కున్నారు. ప్రయాణికులను, దుకాణాలను దోచుకున్నారు. స్త్రీలను బలాత్కరించారు. అందరూ వందేమాతరం పాడుతూ-ముస్లింలను రూపుమాపాం. దేశం హిందువులకు తిరిగివచ్చింది..." అని ప్రకటించారు. (ఆనందమఠ్, పే.768)

'ఘరేబైరే' నవలలో రవీంద్రుడు నిఖిలేశ్ అనే వ్యక్తి ద్వారా ఆనందమఠ్ నవలతో, వందేమాతర గీతంతో సంభాషణ జరుపుతాడు. ఈ పాట రెండు చరణాలను నేను ఇష్టపడుతాను, కాని దేశాన్ని దేవతను చేసి పూజించలేను, దేశాన్ని ప్రేమిస్తాను, దేవున్ని మాత్రమే పూజిస్తాను, అంటాడు. నిఖిలేశ్‌కు దేశం గురించి ఆలోచించినపుడు తేజోవలయం ఆవరించిన దేవత మనో నేత్రం ముందు నిలవ లేదు. అతని ముందు దోపిడీకి గురయిన ఒక అనామక అమాయక అట్టడుగు కులం రైతు కళ్లకు కట్టాడు. నిఖిలేశ్ దృష్టిలో దేశమంటే ఈ ఆకలిగొన్న నిరాశ్రయ ప్రజలు తప్ప మరేమీకాదు. దేశాభిమానం అంటే ఇటువంటి ప్రజలకు సామాజిక న్యాయాన్ని సాధించగలిగేది మాత్రమే. ఇంకేదో విస్తృతమైన జాతీయ ప్రయోజనం ఉందనే భ్రమకల్పించి ఈ కర్తవ్యాన్ని తుడిచిపెట్టలేం.

'ఆనందమఠ్' నవలను ఎక్కడ వట్టినా ముస్లింలను తుడిచిపెట్టాలని ఉద్బోధించడం కనిపిస్తుంది. " తమకు ఎదురు బడిన ముస్లింలను చంపడానికి గ్రామీణ ప్రజలు పరుగులు పెట్టారు. రాత్రిళ్లు బృందాలుగా సమాయత్తమై ముస్లిం బస్తీలకు వెళ్లి వాళ్ల ఇళ్లు తగులబెట్టి, వాళ్ల సమస్తాన్నీ దోచుకున్నారు. ఎందరో ముస్లింలు చంపబడినారు. చాలమంది గడ్డాలు తీసేసుకొని, ఒంటికంతా మట్టిపూసుకొని హరినామ భజన చేసారు. పలికిస్తే మేము హిందువులమని చెప్పుకున్నారు. భయకంపితులైన ముస్లింలు పట్టణాలకు పారిపోయారు. మేము ఐదుసార్లు నమాజు చదివినా చందనం అలదుకున్నా హిందువులను అంతం చేయలేకపోయామంటే పవిత్ర ఖురాన్ తప్పని తేలిపోయింది అల్లా, అల్లా - విశ్వమంతా అబద్ధమే అన్నారు ముస్లింలు''. (ఆనందమఠ్-ఇంగ్లీషు పే. 161-162)

ఇదే నవలలో బ్రిటిష్ వలనపాలకులను బంకిం ప్రశంసించడంకూడ గమనించవచ్చు. హిందూసైన్యం(సంతాన్ తిరుగుబాటుదార్లు) ముస్లిం పాలకులను ఓడించి బ్రిటిష్ వాళ్లతో కూడి పోరాడడానికి కదులుతుంటే , కథానాయకుడైన సత్యానందను ఒక ఆశరీరవాణి ప్రత్యక్షమై వారిసుంది. "మీ కర్తవ్యం విజయవంతంగా ముగిసింది. మీరు మాతృదేశ సంక్షేమాన్ని సమకూర్చారు. ఇంగ్లీషు పరిపాలన సుస్థాపితమైంది. ఇంక మన సంపదలు, జీవితాలు భద్రంగా ఉంటాయి. మీరు యుద్ధాన్ని, శత్రుభావాన్ని విడనాడండి. ఇంక మనకు శత్రువులు లేరు. ఇంగ్లీషు వాడు మనకు అనుకూలమైన రాజు. ఇంగ్లీషు వాళ్లతో యుద్ధంచేసి గెలవగల శక్తి ఎవరికీ లేదు." హిందూ రాజ్యాన్ని పునఃస్థాపించడానికి బ్రిటిష్ రాజ్ చారిత్రక ప్రయోజనం గురించి ఆ సంతాన్ నాయకుడు గ్రహించినాక ఆ సంతాన్ తిరుగుబాటు దార్లంతా ప్రాపంచిక జంఝాటాలు వదిలి హిమాలయాలకు వెళ్లిపోయారు.

(ఆనందమఠ్ - ఇంగ్లీషు - పే. 191-194)

అయితే 1905లో కర్జన్ బెంగాల్‌ను విభజిస్తున్నట్లు ప్రకటించడంతో 'వందేమాతరం' బెంగాల్ విభజనను ప్రతిఘటించిన ప్రజలకు జాతీయ మంత్రమైంది. బ్రిటిష్ ప్రభుత్వం ఈ గీతాన్ని, 'వందేమాతరమ్' అని నినదించడాన్ని కూడ నిషేధించింది. 1906లో బారిసాల్‌లో బెంగాల్ కాంగ్రెస్ ప్రావిన్షియల్ సమావేశాన్ని రైతాంగ నాయకుడు అబ్దుల్ రసూల్ అధ్యక్షుడుగా నిర్వహిస్తుండగా వందేమాతరమ్ పాడినందుకు బ్రిటిష్ ఇండియా పోలీసులు వందలాదిమందిని లాఠీచార్జి చేసి తీవ్రంగా గాయపరిచారు. ఈ పాశవిక చర్య తో 'వందేమాతరమ్' తెల్లారేవరకు విస్తృత ప్రచారాన్ని పొందింది. 1906 మే 23న ఒక అపూర్వమైన ఊరేగింపు బారిసాల్‌లో సాగింది. జాతీయగీతాలు పాడుతూ, వందేమాతరమ్ - అల్లాహో అక్బర్ అని నినదిస్తూ, వందేమాతరమ్ జెండాలు పట్టుకుని హిందూ ముస్లింలు అందులో పాల్గొన్నారు.

ఆశ్చర్యకరమైన విషయమేమంటే బెంగాల్‌లో వందేమాతరమ్‌ను నిషేధించిన బ్రిటిష్ ప్రభుత్వం మొదటి ప్రపంచ యుద్ధంలో జర్మన్ శిబిరాలమీద బెంగాలీ రెజిమెంట్ 'వందేమాతరమ్' ఉచ్చరిస్తూ దాడులు చేయడాన్ని అనుమతించింది.

ఏమయినా 1905 బెంగాల్ విభజన కాలంనుంచి 1930 దాక 'వందేమాతరమ్' బెంగాల్‌లోనే కాదు, దేశమంతటా జాతీయోద్యమానికి ఒక ఉత్ప్రేరక గీతమైంది. ఎన్నో సభల్లో, సమావేశాల్లో, ఊరేగింపుల్లో ఆ గీతం ఒక సమీకరణ సాధనమైంది. బ్రిటిష్ పాలకుల కన్నెర్రకు, దాడికి ప్రతిఘటనా రూపమైంది.

ప్రతి కాంగ్రెస్ సమావేశం, సభ 'వందేమాతరమ్' గీతంతో ప్రారంభమయ్యేది. అది రవీంద్రుడు కట్టిన బాణీ కావడం ఒక కారణం.

నైజాం వ్యతిరేక పోరాటంలో 1938లో హైదరాబాదు రాష్ట్రంలో స్టేట్ కాంగ్రెస్ ఏర్పడినాక కాంగ్రెస్ వాదులు 'వందేమాతరమ్' ను ఒక ప్రతిఘటనా నినాదంగా ఎంచుకున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 'వందేమాతరమ్' పాడి, నినదించి బహిష్కృతులైన పి.వి. నరసింహారావు వంటి విద్యార్థి నాయకులు నాగపూర్ వెళ్లి చదువుకొని అక్కడ నైజాం వ్యతిరేక శిబిరాలను నిర్వహించిన విషయం ఇప్పుడు ప్రసిద్ధమైన చరిత్రలో భాగమే.

అయితే కాంగ్రెస్ పార్టీలోనే 1930 తర్వాత కొత్త వివాదం తలఎత్తింది. ముస్లింలు, బుద్ధిస్టులు, జైనులు, సిఖ్కులు, క్రైస్తవులు, దక్షిణ దేశస్తులు, లౌకికవాదులు, చివరకు ఆర్య సమాజ్ కూడ కాంగ్రెస్ పార్టీ దానిని 'జాతీయ గీతం' గా నిర్ణయించాలనుకున్నప్పుడు అభ్యంతర పెట్టారు. ఈ గీతం విగ్రహారాధనను, అందులోనూ హిందు శాక్తేయ దుర్గా పూజను ఎత్తిపడుతుందని. (ఒకడే దేవుడు రాముడు అనే వాళ్లకిందులో అతని ప్రస్తావన కనిపించదు) అది కూడ బెంగాలీ హిందువుల భావోద్రేకాలేనని అభ్యంతరాలు వచ్చాయి.

1937లో కాంగ్రెస్ కమిటీ ఈ వివాదం నేపథ్యంలో గీతాన్ని పరిశీలించడానికి జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్, సుభాష్‌చంద్రబోసు, ఆచార్య నరేంద్ర దేవ్‌లతో ఒక ఉపసంఘం వేసింది. జాతీయ గీతంగా వందేమాతరం పనికొస్తుందా రవీంద్రునితో సంప్రదించి సూచించమన్నది.

"అన్ని విషయాలను గణనలోకి తీసుకొని ఈ ఉపసంఘం వందేమాతరమ్ ఎప్పుడయినా జాతీయ సమావేశాల్లో పాడబడినప్పుడు,

మొదటి రెండు చరణాలు మాత్రమే పాడాల"ని సిఫారసు చేసింది. అంతేకాదు అటువంటి సమావేశాల "నిర్వాహకులకు అభ్యంతర పెట్టదగిన స్వభావంలేని ఇంకే గీతమైనా 'వందేమాతరం' తో పాటు గానీ, దానికి బదులుగా గానీ పాడుకునే పూర్తి స్వేచ్ఛ ఉంటుంది" అని మొత్తం గీతం పై తన విశ్లేషణను కూడ ఇచ్చింది. మొదటి రెండు చరణాలు మతపరమైన భావాలు లేకుండా, ప్రకృతి వర్ణనలుగా ఉన్నాయని, అవి కాలక్రమంలో బెంగాల్‌కే పరిమితం కాకుండా ఇతర ప్రాంతాలలో కూడ ప్రచారం పొంది కొంత జాతీయ ప్రాముఖ్యాన్ని పొందాయని భావించింది. బెంగాల్‌లో కూడ ఈ చరణాలు మాత్రమే సాధారణంగా పాడుకుంటారని, మిగతా చరణాలు చాల మందికి తెలియను కూడ తెలియవని అభిప్రాయపడింది. మిగతా రెండు చరణాల్లో మతపరమైన భావజాలం, భాష ఉందని – అది దేశంలో ఇతర మతాలకు అభ్యంతరకరం కావచ్చునని అభిప్రాయపడింది. "ఈ పాటలోని కొన్ని భాగాల పట్ల ముస్లిం మిత్రులు లేవనెత్తిన అభ్యంతరాలలోని సామంజస్యాన్ని" కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ గుర్తించింది. ఉపసంఘం సిఫారసులను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అమోదించింది.

గాంధీజీ 'వందేమాతరమ్' గీతాన్ని ఎంతో గొప్పగా ప్రశంసిస్తూ, దానిమీద మత భావనలు గల గీతమనే ఆరోపణల కన్నిటికీ సమాధానాలివ్వడానికి ప్రయత్నిస్తూనే, ఐనా ఇప్పుడున్న వాతావరణంలో ఈ గీతం ఏ కొందరి మనోభావాలనయినా గాయపరుస్తుందనుకుంటే దీనిని పాడడాన్ని ఆమోదించజాలనని రాసాడు.

1915లో 'వందేమాతరం'లోని గాఢమైన దేశభక్తితో ప్రభావితుడైన గాంధీ 1947లో అసాధారణ స్థాయిలో దేశంలో చెలరేగిన హిందూముస్లిం పరస్పర హత్యాకాండ తర్వాత గీతాన్ని మళ్లీ చదివాడు. ఇప్పుడు ఈ గీతానికి దుర్భరమైన సందర్భం ఏర్పడిందన్నాడు. "ఇప్పుడిది రాజకీయ నినాదం, ముస్లింలను అవమానపరచి గాయపరిచే సాధనంకాకూడదీ ప్రార్థన" అన్నాడు.

'వందేమాతరం' మతభావన గల దేశభక్తి గీతంగా భావించిన నెహ్రూ 'ఆనందమఠం' నవలలో భాగంగా చదివినప్పుడు ఆందోళన చెంది రవీంద్రున్ని అనువాదం సరిగానే ఉందా అని అడిగాడు. జవాబుగా రవీంద్రుడు "ఈ గీతంనేపథ్యం (నవలలో) ముస్లింలను తప్పకుండా గాయపరుస్తుంది" అని రాశాడు.

గాంధీజీ, నెహ్రూ, సుభాస్‌చంద్రబోసు, రాజేంద్రప్రసాద్‌ల మొగ్గు కూడ జాతీయగీతంగా అంగీకరించాల్సి వచ్చినప్పుడు 'జనగణమన' వైపే ఉన్నదన్నది చారిత్రక వాస్తవం. సుభాస్‌చంద్రబోస్ జనగణమన గీతాన్ని హిందుస్థానిలోని మార్చుకొని ఆజాద్ హింద్ ప్రభుత్వానికి జాతీయగీతంగా స్వీకరిస్తున్నట్టు ప్రకటించాడు.

గాంధీజీ సేవాశ్రమ్‌లో ప్రార్థన సమయంలో 'వైష్ణవజనతో' అనే గుజరాతీ గీతాన్ని, బిర్లామందిర్‌లో 'రఘుపతి రాఘవ రాజారామ్' అనే హిందుస్థాని గీతాన్ని ఆలపించేవాడు, పాడించేవాడు. 'రఘుపతి రాఘవ రాజారామ్'లో నయితే 'ఈశ్వర అల్లా తేరే నామ్, సబ్‌కో సన్మతి దే భగవాన్' అని 'హిందూ ముస్లిం సిక్కు ఈశాయి' అని అన్నిమతాల, దేవుళ్ల సమభావన తీసుకొచ్చే ప్రయత్నం చేశాడు.

అంటే భాషాపరంగా జాతీయ భాషలయిన గుజరాదీ, హిందీ, హిందుస్థానీలను ఆదరించి, తన ప్రార్థనా సమాజాల్లో ఆ భాషల్లోనే గీతాలు ఆలపించి, మతసామరస్యాన్ని ప్రబోధించాడు.

జవహర్‌లాల్ నెహ్రూ జాతీయ పతాకం మీదనైనా, జాతీయ చిహ్నంగానయినా అశోక చక్రాన్ని ప్రతిపాదించి లౌకిక ప్రజాస్వామ్యం ఆమోదించే బౌద్ధచిహ్నాన్ని గౌరవించాడు.

కాని ఈ ఇద్దరికీ, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి, చివరకు రాజ్యాంగ నిర్మాతలకు (రాజ్యాంగ సభ 1951లో జాతీయ గీతంపై నిర్ణయం తీసుకున్నది) జాతీయ గీతాలుగా జనగణమన, దాదాపు అదే స్థాయిలో వందేమాతరమ్ ఉండాలని నిర్ణయించినప్పుడు అవి రెండు కూడ దేశంలో అత్యధిక సంఖ్యాకులకు అర్థమయ్యే భాష(ల)లో లేవని స్ఫురించపోవడం చాల ఆశ్చర్యం. దక్షిణ దేశస్తులకు, ముఖ్యంగా తమిళులకు హిందీ, హిందుస్థానీలు అంటే ఇష్టముండదనుకుంటే సంస్కృతం, బెంగాలీలంటే ఇష్టం ఉంటుందని అర్థంకాదుగదా. సుభాస్‌చంద్రబోస్ ఆజాద్ హింద్ ప్రభుత్వానికి జాతీయ గీతంగా జనగణమనను నిర్ణయించి హిందుస్తానీకి అనువదింపచేసినప్పుడయినా భావం సంగతి అలా ఉంచి భాషా పరంగా దేశంలో అన్నీ భాషాభాషీయుల అంగీకారం గురించి రాజ్యాంగ నిర్మాతలు ఆలోచించి చర్చించి నిర్ణయం తీసుకొని ఉండాల్సింది.

ఇంతకు ఒక రాజ్యాంగం వలె, ఒక జాతీయ జెండావలె, జాతీయ గీతం గురించి 15 ఆగస్ట్ 1947 వరకు కూడ ఒక నిర్ణయం జరుగలేదు. రాజ్యాంగ రచన కోసం ఒక రాజ్యాంగ పరిషత్ ఏర్పడి సుదీర్ఘమైన చర్చలు జరిగి ఒక చరిత్రాత్మక ప్రామాణిక ఉద్గ్రంథం వెలువడింది. 'మేము, భారత ప్రజలము, మాకొరకు మేము రూపొందించుకున్నాం' అని ప్రకటించుకున్న అటువంటి విస్తృత చర్చిత రాజ్యాంగమే కాలానుగుణంగా ఇప్పటికెన్నో సవరణలకు గురయింది.

జాతీయ జెండాగా పింగళి వెంకయ్య రూపొందించిన త్రివర్ణ పతాకం జవహర్‌లాల్ నెహ్రూ సూచించిన అశోక చక్రంతో పాటు అమోదించబడింది. ప్రస్తుతం అందులోని రంగులగురించిన చర్చ అలా ఉంచుదాం.

జాతీయ గీతం విషయం వచ్చే వరకు ఐక్యరాజ్యసమితికి వెళ్లిన స్వతంత్ర భారత్ ప్రతినిధి బృందాన్ని సర్వసభ్య సమావేశంలో మీ జాతీయ గీతం వేయండి అని అడిగేదాకా దాని గురించిన "ఆ బృందం తమ దగ్గర ఉన్న జనగణమన పాట బాణీ సంగీతాన్ని రికార్డు వినిపించారు. చాలా దేశాల ప్రతినిధులు బాగుందన్నారు. సైన్యంలో, విదేశీ రాయబార కార్యాలయాలకు ప్రతినిధి బృందాలు వెళ్లినప్పుడు బ్యాండుమీద ఈ బాణీ వినిపించడం ఒక సంప్రదాయం అయింది. జనగణమనలోని మాటలు కొన్ని మార్చాల్సి ఉన్నది అందుకని దాని బాణీని బ్యాండు మేళాల్లో, ఆర్కెస్ట్రాలో వేయాలని, మాటలను కాదని ప్రభుత్వం సూచించింది. పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం తమ ప్రభుత్వం వందేమాతరాన్ని ఎంచుకున్నట్లు తెలియచేసింది" అని జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా ఆగస్ట్ 25, 1948 పార్లమెంట్‌లో ప్రకటించిన దానిని బట్టి జాతీయ గీతం నిర్ణయం ఎంత అపద్ధర్మంగా జరిగిందో ఉహించుకోవచ్చు.

ఇవ్వాళ 'వందేమాతరమ్' గీతం జాతీయ గీతాన్ని ప్రతి విద్యాలయంలో పూర్తిగా ఆలపించబడాలని, దానిని జాతీయగీతంగా ఆలపించని వారికి ఈ దేశంలో ఉండే అర్హత లేదని చెప్తున్న సంఘపరివార్ అయినా, బిజెపి అధికారంలో ఉన్న రాష్ట్రాలయినా కనీసం వాటి గత చరిత్రనయినా ఒకసారి చదువుకోవాలి. ఈ వాదన ఇవ్వాళ ఎందుకు తీస్తున్నారో అర్థమవుతుంది.

మొదటివిషయం 1905 నుంచి 47 దాకా కూడా 'వందేమాతరం' పాడుతూ, నినదిస్తూ, బెంగాల్ విభజన మొదలుకొని, జాతీయోద్యమంలో పాల్గొని లాఠీచార్జీలు, జైలుశిక్షలు అనుభవించిన శక్తులలోగాని, వ్యక్తులలో గాని ఆర్ఎస్ఎస్ లేదు బిజెపి లేదు. విశ్వహిందూ పరిషత్, భజరంగదళ్‌లు లేవు. ఇంక ఈ గీతం కోసం ప్రాణాలు బలి ఇచ్చిన వాళ్లలో సంఘ్‌పరివార్ శక్తులు,వ్యక్తులు ఉంటారనుకోవడం అచారిత్రకం. అప్పటికి వాళ్లు పుట్టలేదు.పుట్టినాకనయినా ఆర్ఎస్ఎస్ సాహిత్యంలోగానీ, డాక్యుమెంటులలో గానీ ఎక్కడా వందేమాతరం ప్రస్తావన లేదు. కె.బి. హెగ్డేవార్, ఎం.ఎస్. గోల్వాల్కర్‌ల రచనల్లో కూడ ఎక్కడా వందేమాతరం ప్రస్తావన లేదు. జాతీయగీతంగా కాదు, అసలు ఒక గీతంగా అది జాతీయోద్యమంలో నిర్వహించిన పాత్ర గురించిన ప్రస్తావనే లేదు. మరి ఇప్పుడెందుకు అది జాతీయగీతంగా నిర్బంధంగా అందరి చేత పాడించాలంటున్నారు?

అందరి చేత అంటే వాళ్ల మనసులో ఉన్న మాట హిందూయేతరుల చేత బలవంతంగా పాడించి వాళ్ల దేశభక్తిని పరీక్షించాలని.

ఇంక ప్రస్తుత చరిత్రలోకి వద్దాం...

ఉత్తరప్రదేశ్‌లో, మరికొన్ని రాష్ట్రాల్లో త్వరలో ఎన్నికలు జరగనున్నాయి. ఫిబ్రవరి 25, 2006న ఆగ్రాలో బిజెపి మైనారిటీ సెల్ మీటింగు జరిగింది. రానున్న ఎన్నికల కోసం ముస్లింలను సమీకరించడానికి ఉద్దేశించిన సభ. యాభైమంది ముస్లిం ఆహ్వానితుల ముందర, ఎజెండాలో లేకుండానే ముస్లింలతో వందేమాతరం పాడించారు. అట్లా వందేమాతరం పాడిన ముస్లింలందరూ మత విశ్వాసాలను ఉల్లంఘించి, అల్లాకు, ఖురాన్‌కు అపచారం చేసినందున వాళ్లు ముస్లింలు కాకుండా పోయారని స్థానిక ముస్లిం పెద్దలు 'ఫత్వా' జారీ చేసారు.

ఇట్లా 'వందేమాతరం' వివాదం మన దేశంలో ఎన్నికల సందర్భంలో కలిసిరావడం కొత్త కాదు. 'ఇస్ దేశమే రహనాహైతో వందేమాతరం కహనా హోగా' అన్నది హిందుత్వ వాదుల నినాదం.

దేశభక్తి, మాతృభక్తి పర్యాయపదాలు కావు. హిందువులు తప్ప అందరూ దేశాన్ని తల్లితో పోల్చరు. దేశాన్ని పితృభూమిగా భావించేవాళ్లూ ఉన్నారు. ముస్లింలయితే అల్లాను తప్ప ఎవరినీ పూజించరు. కులవ్యవస్థఉన్న హిందూ సమాజంలో కులదేవతలు మొదలుకొని భాషా, జాతిమాతలు, దేశమాత భావన ఉండవచ్చుగానీ (తెలుగువాళ్లకు కన్నతల్లి కాకుండా పోచమ్మతల్లి, మైసమ్మతల్లి, సీతమ్మతల్లి, తెలుగుతల్లి కూడ ఉన్నారు) హిందూయేతరులందరికీ అలా ఉండాలని ఆదేశించడం విశ్వాసాలను నియంత్రించడం అవుతుంది.

ఉత్తరప్రదేశ్ ఎన్నికలనే దృష్టిలో పెట్టుకొని మానవ వనరుల మంత్రి అర్జున్‌సింగ్ సెప్టెంబర్ 7న 'వందేమాతరం' విద్యాలయాల్లో ఆలపించాలని ఒక ఉత్తర్వు జారీ చేశాడు. అప్పటికి ఆ గీతాలాపన ప్రారంభమై వందేళ్లు అయ్యిందని అనుకున్నాడేమో. సుమిత్ సర్కార్‌గానీ, ఇతర చరిత్రకారులు గానీ రాసిన రచనల్లో అటువంటి ఆధారాలేమీ లేవు. మే 23, 1906న బారసాల్‌లో వందేమాతరం నినాదం, పాట ఒక ఊరేగింపులో ప్రేరణ అయ్యిందని పైన గమనించాం. చారిత్రకంగా కూడ ఆ రోజుకు ప్రాముఖ్యం లేదని తెలుసుకున్న సోనియాగాంధీ కాంగ్రెస్ పార్టీ ఆ గీతాలాపన కోసం ఏర్పాటు చేసిన సభకు రాలేదు. ప్రధాని కూడ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఈ గీతాన్ని జాతీయగీతంగా 1937లో గుర్తిస్తూనే, నిర్బంధంకాగూడదనీ చెప్పిన విషయం గుర్తుకువచ్చి వెనక్కి తగ్గాడు.

వందేమాతరం - జనగణమన స్థాయిలో జాతీయ గీతం అంటూనే అది అందరికీ నిర్బంధం కాదని, దానితోపాటు గానీ, దానికి బదులుగా గానీ ఆయా బృందాలు అందరికికీ అభ్యంతరంగాని గీతం ఏదైనా పాడవచ్చునని రాజ్యాంగ నిర్మాతలు, ప్రభుత్వాలు ఆయా కాలాల్లో స్పష్టంచేసిన విషయాన్ని మళ్లీ ఒకసారి మననం చేసుకుందాం.

మరొకవైపు బిజెపి ప్రభుత్వాలు గుజరాత్, ఛత్తీస్‌ఘడ్, జార్ఖండ్‌లలో 'వందేమాతరం' గీతాలాపనను నిర్బంధం చేశాయి. అంతేకాదు, మొదటి రెండు చరణాలే కాదు - అన్ని చరణాలూ పాడాలన్నాయి. ఆయా ప్రభుత్వ, ప్రైవేట్ విద్యాలయాల్లోనే కాదు, మదరసాలలో కూడా విధిగా ముస్లిం విద్యార్థులు కూడ పాడాలన్నాయి. గతంలో ఇటువంటి ఒక సందర్భంలో కేరళలో జాతీయగీతం ఆలపించడానికి నిరాకరించిన క్రైస్తవ విద్యార్థిని పాఠశాలనుంచి బహిష్కరిస్తే, కోర్టు అటువంటి బహిష్కరణ తప్పు అని - ఆలాపన ఐచ్ఛికం కావాలని, నిర్బంధం కావద్దని చెప్పింది.

ఆంధ్రప్రదేశ్‌లో పాఠశాల విద్యామంత్రి మొదట సెప్టెంబర్ 7న ప్రతి విద్యాలయంలో 'వందేమాతరం' ఆలపించాలని ఉత్తర్వు జారీచేసి, పెద్ద ఎత్తున నిరసన రావడంతో నిర్బంధం కాదని చెప్పినా ఆరోజు ప్రతి విద్యాలయంలో 'వందేమాతరం' ఆలపించారు. కాజీపేట (వరంగల్) లో ప్రతిష్ఠాత్మకమైన గేబ్రియల్ స్కూల్లో కూడా వందేమాతరం పూర్తి గీతాన్ని పాడించారంటే మైనారిటీ క్రైస్తవ పాఠశాల భయాందోళన ఇలా ఉంటే ముస్లిం మతసంస్థలు ఎంత అభద్రతా భావంతో ఉన్నాయో ఊహించవచ్చు.

జన్మనిచ్చే ప్రకృతిపరమైన ఒక ప్రత్యేక స్థితికన్నా మించి మాతృభావనను ఒక కాల్పనిక స్థాయికి తీసుకపోరాదనే జెండర్ అవగాహన కనీసం ఈ దేశంలో ఇరవై యేళ్లుగా బలపడుతున్నది. అది గౌరవించి చర్చించవలసిన ఒక అంశం.

బ్రిటిష్ వలసవాదానికి వ్యతిరేకంగా దేశంలో వచ్చిన పోరాటాలను మనం స్థూలంగా జాతీయోద్యమం అని పిలుస్తున్నప్పటికీ రాజ్యాంగ నిర్మాతలు ఈ దేశాన్ని జాతుల సమాఖ్యగానే గుర్తించి, గౌరవించి ఒక ఫెడరల్ రాజ్యాంగాన్నే రచించారు. కాని దేశాన్నే ఒక జాతి అనలేదు.

దేశాభిమానం, జాత్యాభిమానం చప్పన్నారు జాతులున్న దేశంలో యూరోప్ ఖండంలోని దేశాలలో వలే పర్యాయపదాలు కాజాలవు. భారతదేశ భావన భారతజాతి భావన అని అనుకున్నా, అది హిందూమతమే జాతి అనుకునే భావాన్ని ఆమోదించడంకాదు. భారతదేశంలో ఉన్నవాళ్లంతా భారతీయులే, కాని హిందువులుకారు. 1905లో బెంగాల్ విభజన సందర్భంగా ఉద్దీపనగా పనికివచ్చిన గీతం 1947 తర్వాత దేశానికంతా ఐక్యతా ప్రేరకమెట్లా అవుతుంది? మొదటి రెండు చరణాలు కూడ జలాలు, ఫలాలు, శీతలపవనాలు, శ్యామలసస్యాలు, వృక్షాలు - వంటి దేశంలోని ప్రకృతి గురించి ప్రశంసిస్తాయే తప్ప ఈ దేశంలో వైవిధ్యంగల జాతులు, వాళ్ల వేషభాషా సంస్కృతుల గురించి ఏమీ చెప్పవు. ఎక్కువలో ఎక్కువ సుహాసినీం, సుమధురభాషిణీం లలో ఈ దేశంలోని ప్రజలు మంచివాళ్లు, వాళ్లందరి భాషలు మధురమైనవని మనం ఊహించుకోవాల్సిందే. ఈ గీతంతో ఒక్కసారి 'సారా జహాం సే అచ్ఛా' పోల్చి చూడండి.

ప్రపంచ దేశాలన్నింట్లో మా హిందుస్తాన్ మంచిది
ఇది మాతోట మేమిందులో కోకిలలం
ఆకాశాన్ని చుంబిస్తున్న హిమాలయాలు మా రక్షకులు
దాని ఒడిలో వెయ్యి నదులు ఆడుకుంటున్నాయి
అందువల్ల స్వర్గానికి కూడా దానిపట్ల ఈర్ష్యగా ఉన్నది
మతం మమ్మల్ని ఒకర్నొకరు ద్వేషించుకొమ్మని చెప్పదు
మేమంతా భారతీయులం భారతదేశం మా స్వస్థలం

ఎక్బాల్ రాసిన ఈ గీతం జాతీయగీతంగా ప్రకటించబడకపోయినా ఈ జాతీయగీతాలతో పోలిస్తే తక్కువ ప్రసిద్ధమయిందేమీకాదు. కాని ఇందులో ఏ మతవాసన లేదు. (హిందుస్థాన్ అనే మాటలో ఉన్న హిందూ శబ్దాన్ని అభ్యంతరపెడ్తే తప్ప, కాని ఇండియాను సంస్కృతంలో భారతదేశం అన్నట్లుగా హిందీ, హిందుస్థానీ, ఉర్దూలలో, ఆ ప్రభావంలో ఉన్న భాషల్లో హిందుస్థాన్ అంటారని తెలిసినప్పుడు అది సమస్య కాదు). పాలకులకు ఎక్బాల్ విభజనానంతరం పాకిస్థాన్‌కు వెళ్లడం అభ్యంతరం అయ్యిందా? గీతం కలిసిఉన్నప్పుడు రాసిందే. నజ్రుల్ ఇస్లాం - బంగ్లాదేశ్‌లో స్థిరపడినంత మాత్రాన మన కవికూడ కాకుండా పోయాడా?

చెప్పవచ్చిందేమంటే మనకు దేశాభిమానాన్ని కలిగించే
'దేశమును ప్రేమించుమన్నా, మంచి యన్నది పెంచుమన్నా,
దేశమంటే మట్టి కాదోయి, దేశమంటే మనుషులోయి
దేశాభిమానం నాకుకద్దని, ఒట్టిమాటలు కట్టిపెట్టోయి
పూనుకొని ఏదయినా ఒక మేల్ చేసి జనులకు చూపవోయి"

వంటి ఉత్తేజకరమైన, దేశానికి, దేశంలోని ప్రజలందరికీ ఒక సందేశం ఇవ్వగల గీతం కావాలి. గురజాడ అప్పారావు రాసిన ఈ గీతం "అంతర్జాతీయ గీతం" కాదగింది అన్నాడు శ్రీశ్రీ. అది ఆంధ్రాభిమానం అనుకున్నా ఇటువంటి సందేశాత్మక ఉత్తేజగీతం దేశప్రజలందరికి అర్థమయ్యే భాషలో శ్రావ్యమైన బాణీలో ఉంటే ఇన్ని వివాదాలు వచ్చి వుండేవి కావు.

చివరకొక్క విషయం చెప్పాలి. ఎల్లకాలానికి ఒక్కటే శాశ్వత సత్యం ఉండకపోవచ్చు. 'వందేమాతరమ్' రాసిన 1875, 'ఆనంద్‌మఠ్' లో చేర్చిన 1882 సంతాన్‌లను ముస్లింల మీదికి రెచ్చగొట్టిన కాలం కావచ్చు. అదే గీతం 1905 బెంగాల్ విభజన కాలంలో అల్లాహో అక్బర్ తో పాటు వందేమాతరం నినాదంగా ముస్లింలు, హిందువులు కలిసి బ్రిటిష్ వలసవాదులను ప్రతిఘటించడానికి ప్రేరణ కావచ్చు. ఆ పాత్ర 1930 ల దాకా నిర్వహించవచ్చు. 1930ల నుంచి వివాదాస్పదం కావచ్చు. కాని సంఘపరివార్ శక్తులు ఉద్దేశపూర్వకంగా ముస్లింలకు వ్యతిరేకంగా హిందూ జాతీయ వాదాన్ని, శాక్తేయాన్ని రెచ్చగొట్టడానికి వాడుకుంటున్న మతగీతమైంది. ముఖ్యంగా బాబ్రీ మసీదు విధ్వంసం దగ్గర్నుంచి.

'ఇస్ దేశ్ మే రహనా హైతో వందేమాతరం కహనా హోగా' లో ఉన్న మతోన్మాద నిర్బంధ సారాంశమిదే.

దేశకాల పాత్రల సందర్భాల్లో ఎంత మార్పు వస్తుందంటే - తెలంగాణ సాయుధ పోరాట కాలంలో ప్రజా కవి యాదగిరి "బండెనకబండి గట్టి పదహారు బండ్లు గట్టి - ఏ బండ్లో పోతవ్ కొడుకో నైజాము సర్కరోడా" అని పాట రాశాడు. విపరీతమైన ప్రచారాన్ని పొందిన ఈ పాట - ఆయా తెలంగాణ ప్రాంతాల్లో ఆయా స్థానిక పెత్తందార్లకు వ్యతిరేక గీతంగా ఆలపించబడింది. ఉదాహరణకు వరంగల్ జిల్లాలో నైజాము సర్కరోడా అన్న చోట జన్నారెడ్డి ప్రతాపరెడ్డి పేరు పెట్టి పాడుకునేవాళ్లు. 1978లో 'మాభూమి' సినిమాలో సెన్సార్ నిబంధనల దృష్ట్యా 'నైజాము సర్కరోడా' మాటకే అనుమతి లభించింది. సినిమా పాటకూడ అయ్యింది కనుక, గద్దర్ ఆడిపాడాడు గనుక విస్తృత ప్రచారాన్ని పొందింది. 1980ల నుంచి విశ్వహిందు పరిషత్, ఆర్‌ఎస్‌ఎస్ హిందూత్వ శక్తుల ఆధ్వర్యంలోని గణేష్ ఉత్సవాల్లో హైదరాబాద్ పాతబస్తీలో ఈ పాట విన్నవాళ్లకెవరికైనా వెంటనే స్ఫురించేది నైజాం సర్కార్ ఫ్యూడల్ నిరంకుశ మధ్యయుగాలను తలపించే రాజనికాదు, ఒక ముస్లిం రాజని. కార్యనిర్వాహకులు ఈ పాట ప్రచారం చేయడంలో ఉన్న ప్రయోజనం కూడ ముస్లిం వ్యతిరేకతను రెచ్చగొట్టడమే. పోలీసుచర్య పేరుతో ఇండియన్ యూనియన్ మిలటరీ హైదరాబాదు రాష్ట్రంలో ప్రవేశించి రజాకార్లను అణచేసే నెపంతో రెండు లక్షల మంది ముస్లింలను చంపి 1948 సెప్టెంబర్ 13 నుంచి 17 లోపల సంస్థానాన్ని విలీనం చేసుకున్నది. ఇది విలీనం పేరుతో కమ్యూనిస్టులను అణచడం ప్రధాన ప్రయోజనంగా చేపట్టిన మిలిటరీ చర్య అని కమ్యూనిస్టు పార్టీ మరో ముదేళ్లపాటు 1951 నవంబర్ దాకా సాయుధ పోరాటం కొనసాగించింది. సెప్టెంబర్ 17ను విద్రోహ దినంగా ప్రకటించింది. సెప్టెంబర్ 17ను విమోచన దినంగా అధికార స్థాయిలో ఆగస్ట్ 15 వలె ప్రభుత్వమే నిర్వహించాలని 1998 నుంచి బిజెపి డిమాండ్ చేస్తున్నది. అప్పుడు కేంద్రంలో హోం మంత్రిగా ఉన్న ఎల్.కె. అద్వానీని హైదరాబాదు సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేసుకున్న సర్దార్ పటేల్‌తో పోల్చింది. అప్పటి నుంచి బిజెపి 17 సెప్టెంబర్‌ను 'తెలంగాణ విమోచన' దినంగా పాటిస్తోంది. తెలంగాణ ఐక్యకార్యాచరణ సమితి, తెలంగాణ విద్యార్థి సంఘం కూడ అదే రోజును 'తెలంగాణ విమోచన' దినంగా ప్రకటించి 'బండెనక బండికట్టి' పాటపాడి, తెలంగాణను ఏడువందల ఏళ్లు తురకలు పాలించారు, తెలంగాణ 1948-56 మధ్యన తప్ప ఎప్పుడూ స్వాతంత్ర్యమనుభవించలేదని చెప్తే ఎంత విషాదం. ఎంత అచారిత్రకం. ఫ్యూడల్ పాలన, వలసవాద పాలన చేసిన అణచివేత, దోపిడీలను, పాలకుల మతం కారణంగా ఒక జాతిపాలన వలన అనుభవించిన బానిసత్వం అనుకుంటే 'వందేమాతరం' గీతం వలెనే - ప్రజా ఉద్యమాల్లో అపూర్వమైన ప్రజా పోరాట పాత్ర నిర్వహించిన గీతాలు కూడ వ్యతిరేక ఫలితాలిస్తాయనడానికి ఈ విషయం ప్రస్తావించాను.

ఈ దేశంలో కర్షక కార్మిక రాజ్యం ఏర్పడాలని కలలు గని ఉజ్వలమైన సామ్రాజ్య వ్యతిరేక పోరాటం నిర్వహించి ఉరికంబం ఎక్కిన భగత్‌సింగ్ శతజయంతి జరుపుకుంటున్న సంవత్సరమిది. 'రంగ్‌దేబసంతి' అని తనకు ఇష్టమైన గీతం ఆలపిస్తూ 'లే మషాలే లేచలేంగే' అని ఉత్తేజపరుస్తూ 'సర్‌పే కఫన్ బాంధ్‌కే ఉతరే' అని త్యాగనిరతిని ఆచరించి మార్గదర్శకమైన భగతసింగ్ శతజయంతి సంవత్సరమే హిందుత్వవాదులు కుట్రపూరితంగానే 'వందేమాతరం' గీతాలాపన శతజయంతిని కల్పించారు. ప్రపంచవ్యాప్తంగాను, దేశంలోను సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నమ్మదగిన మిత్రులుగా ఉన్న ముస్లింల దేశాభిమానాన్ని పరీక్షించడానికి కుట్రపూరితంగా ఎంచుకున్న పథకం ఇది. లౌకిక ప్రజాస్వామిక శక్తులు ఈ దేశభక్తి గుత్తాధిపతులనుంచి బహుపరాకుగా ఉండాలి. ◆

# సింగరేణిలో సాంస్కృతిక అణచివేత

- పిట్టల రవీందర్

సింగరేణి బొగ్గు ఉత్పత్తిలో ముఖ్య భూమికను పోషించే గని కార్మికులందరూ తెలంగాణా పల్లె ప్రాంతాలకు చెందినవారు. వ్యవసాయిక కుటుంబాలకు చెందిన వీరందరూ సింగరేణిలో ఉపాధిని ఆశిస్తూ తరలివచ్చినప్పుడు తమతో పాటు తాము అనేక శతాబ్దాలుగా ఆచరిస్తున్న ఆచారాలను కూడా తమ సాంస్కృతిక వారసత్వంగా వెంట తెచ్చుకున్నారు. ఆ కాలంలో ప్రధానంగా మానవశ్రమ మీదనే ఆధారపడిన బొగ్గు ఉత్పత్తి ప్రక్రియలో కార్మికుడే అత్యంత కీలకమైన ఉత్పత్తి పనిముట్టు. అందువల్ల కంపెనీ అధికారులు కార్మికుల విశ్వాసాలకు అనుగుణంగా, వీరి ఆచార వ్యవహారాలకు తగినట్లుగా బొగ్గు గనులపై విధివిధానాలను ఆచరించారు. ఆ రోజుల్లో సింగరేణిలోని ఉన్నతాధికారులందరూ ఉత్తరాది రాష్ట్రాలకు చెందినవారే. బ్రిటిష్ పాలనా పద్ధతులను పుణికిపుచ్చుకున్న ఉత్తరాది రాష్ట్రాలకు చెందిన గని అధికారులు తమ వ్యక్తిగత ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా కార్మికుల విశ్వాసాలకు విలువనిచ్చేవారు. కార్మికులు పాటించిన సాంప్రదాయాలను కొనసాగనిచ్చారు.

తెలంగాణ గ్రామీణ ప్రాంతాలలో ప్రతి పని ప్రారంభానికి ముందుగా 'మైసమ్మ' దేవతను కొలిచినరీతిలోనే బొగ్గుగనులపై కూడా ప్రతి ప్రారంభానికి ముందుగా 'మైసమ్మ' దేవతను తెలంగాణా సాంప్రదాయరీతిలో కొలిచేవారు. ఇందుకోసం ప్రతి గనిపైనా 'మైసమ్మ' గుడులను యాజమాన్యమే స్వయంగా నిర్మించింది. ఈ గుడులలో కార్మికులే స్వయంగా పూజలను నిర్వహించుకునేవారు. ఇందుకు యాజమాన్యమే స్వయంగా ప్రోత్సహించేది. 'మైసమ్మ' పూజకు అవసరమైన ఏర్పాట్లు కూడా చేసేది. తెలంగాణ పల్లె ప్రజల సంస్కృతిలో భాగమైన 'మైసమ్మ' తెలంగాణ శ్రమశక్తితో ఉత్పత్తిని కొనసాగించిన సింగరేణి సంస్థలోనూ భాగమయ్యింది. గనులపై కొత్తగా యంత్రాలను ప్రవేశపెట్టినా, కొత్తగా గని తవ్వకాలను ప్రారంభించినా కార్మికులు స్వయంగా నిర్వహించే 'మైసమ్మ పూజతోనే ప్రారంభమయ్యేది. యాజమాన్యమే స్వయంగా జంతుబలులు కూడా నిర్వహించేది. సుమారు వంద సంవత్సరాలకు పైగా సింగరేణిలో ఈ ఆచారం కొనసాగింది. అయితే ఆధునిక తరంలో సింగరేణిలో యాజమాన్య బాధ్యతల్లోకి ఎదిగిన అగ్రవర్ణాలకు చెందిన వలసాధికారులు ఏకంగా 'మైసమ్మ'నే మింగేశారు. సనాతన సాంప్రదాయ 'మైసమ్మ'కు ఆధునిక ప్రతిరూపమే 'దుర్గాదేవి'గా ప్రచారం నిర్వహించారు. గని మైసమ్మ స్థానంలో 'దుర్గాదేవి'ని ప్రతిష్ఠించారు. కార్మికుల నుండి సేకరించిన విరాళాల సహాయంతో ప్రతి గనివద్ద దుర్గాలయాలను నిర్మించారు. గతంలో ఎప్పుడూ 'మైసమ్మ' గుడివైపునకు తొంగిచూడని అధికారులు, వారి కుటుంబ సభ్యులు పండగ, పబ్బాలకు బొగ్గుగనులమీద 'దుర్గాదేవి' ఆలయంలో ప్రత్యేక పూజలు నిర్వహించారు. కార్మికుల నుండి చందాలు పోగు చేసి దుర్గాదేవి నవరాత్రులు నిర్వహించారు. ఆంధ్రాప్రాంతం నుండి రప్పించిన కళాకారులతో హరికథలు, గీతాపారాయణాలు, కూచిపూడి, భరతనాట్యం లాంటి సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించారు. సింగరేణి ఉన్నతాధికారులు గనులను సందర్శించిన సందర్భాలలో 'దుర్గాదేవి'కి ప్రత్యేక పూజలు నిర్వహించారు. కుటుంబసభ్యులతో కలిసి యజ్ఞాలు, హోమాలు జరిపించారు. మొత్తంమీద ఉన్నతాధికార వర్గాలను అనుకరించడమే నిజమైన సంస్కృతిగా కార్మిక కుటుంబాలను నమ్మబలికి, లోబరుచుకున్నారు. గనిలో ఏ చిన్న ప్రమాదం జరిగినా, అవాంఛిత సంఘటన జరిగినా పీడనివారణార్థం గనిమీద దుర్గాదేవికి ప్రత్యేక పూజలు, సామూహిక వ్రతాలు జరిగిపోతున్నాయి. ఇందుకోసం ప్రతి గనిమీద వెలసిన దుర్గాదేవి ఆలయాల నిర్వహణకోసం ప్రత్యేకంగా 'అయ్యగార్లు' నియమితులయ్యారు. వారి జీతభత్యాలకు, అమ్మవారి రోజువారీ పూజలకు కార్మికుల నుండి చందాలు పోగుచేస్తున్నారు. సింగరేణి బొగ్గుగనులమీద వందేండ్లకు పైగా కార్మిక కుటుంబాల నుండి ముడుపులు అందుకున్న నిరాడంబరురాలైన 'మైసమ్మ'ను, స్వర్ణాభరణాలతో శోభాయమానమైన 'దుర్గాదేవి' దురాక్రమించింది.

సింగరేణిలో ఈ సాంస్కృతిక పరాయీకరణ, దురాక్రమణ అంతటితోనే ఆగిపోలేదు. తెలంగాణా నెత్తురులో ఇమిడి ఉన్న ప్రశ్నించే స్వభావం, ధిక్కారధోరణి, నిరాడంబరత, నిష్కల్మషం లాంటి ప్రత్యేకమైన సాంస్కృతిక విలువల విధ్వంసానికి ఈ పరిణామం శ్రీకారం చుట్టింది.

అండర్‌గ్రౌండ్ బొగ్గుగనుల్లో దుర్భరమైన పని పరిస్థితులు, పనిస్థలాలలో కనీస గాలి, త్రాగునీటి సరఫరా, ప్రాణరక్షణ, ఉద్యోగ భద్రత, సకాలంలో వేతన సవరణలు, నివాసయోగ్యమైన ఆవాసాలు, కార్మిక కుటుంబాలకు మెరుగైన విద్య, వైద్య సౌకర్యాలు సమకూర్చడంలాంటి మౌలిక సమస్యల ప్రస్తావన నుండి కార్మికుల ఆలోచనా సరళి హైజాక్‌కు గురయ్యింది. ప్రభుత్వాలు మన ప్రజలను తమ రోజువారీ సమస్యలనుండి వారి దృష్టిని మళ్లించేందుకు, ప్రచారపటాటోపంతో పథకాల ఊకదంపుడు నిర్వహిస్తున్న రీతిలోనే సింగరేణి యాజమాన్యం సైతం కార్మికుల, వారి కుటుంబాల దృష్టిని 'మీడియా' తదితర ప్రచార మాధ్యమాల ద్వారా దారిమళ్లించింది. ఇందుకోసం అనేక ఆసక్తికరమైన పద్ధతులను సంస్థ అనుసరిస్తున్నది. కార్మికులు తమ పోరాటాల ద్వారా, త్యాగాల ఫలితంగా సాధించుకున్న 'డిపెండెంట్ ఎంప్లాయ్‌మెంట్' హక్కును సింగరేణి యాజమాన్యం హరించివేసింది. కంపెనీలో సుదీర్ఘకాలం పాటు పనిచేసి, ఉద్యోగ విరమణ పొందిన కార్మికుని కుటుంబంలో ఒకరికి ఇదే కంపెనీలో ఉద్యోగ అవకాశం కల్పించే వెసులుబాటువల్ల కార్మిక కుటుంబాలు తమ భవిష్యత్తు విషయంలో ఎంతో ఊరట పొందాయి. ఈ అవకాశాన్ని రద్దు పరచిన సింగరేణి యాజమాన్యం కార్మికుల పిల్లలు సైన్యంలో చేరేందుకు నిర్వహించే ఎంపిక పరీక్షలకు హాజరయ్యేందుకు అవసరమైన శిక్షణనిచ్చే కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు.

తమకు పరిచయం ఉన్న, తాను పుట్టి పెరిగిన వాతావరణంలో గని కార్మికునిగా పనిచేయడానికి పనికిరాడన్న యువకులను, సైన్యంలో చేరి దేశరక్షణ నిర్వహించాలని కోరుకోవడం సింగరేణి అనుసరిస్తున్న కపట, ఉదార స్వభావానికి నిదర్శనం. సింగరేణి సంస్థకు అనుబంధంగా అవకాశాలున్న ఉద్యోగ, ఉపాధి అవకాశాలను పరిశీలించకుండా, ఆదిశలో కార్మికుల పిల్లలను తీర్చిదిద్దే ప్రయత్నం చేయకుండా... ఉంటే ఉద్యోగాలు డిమాండు చేస్తారనే దూరాలోచనతో, దుర్బుద్ధితో... వారిని శాశ్వతంగా వదిలించుకునేందుకే, సింగరేణి సేవా సమితి పేరిట పొంతనలేని కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

సాంప్రదాయబద్ధంగా కొనసాగిన బొగ్గుగనుల వాతావరణాన్ని కంపెనీ పూర్తిగా మార్చివేసింది. విధుల్లోకి చేరడానికి వచ్చిన కార్మికులు గనిలోకి దిగేముందు మంచీ చెడ్డలు మాట్లాడుకునేవాళ్లు. పనిస్థలాలలో నెలకొని ఉన్న పరిస్థితులను చర్చించుకునేవాళ్లు. కష్టసుఖాలను కలబోసుకునేవాళ్లు. అయితే... ఇట్లాంటి పరిస్థితులకు అవకాశం కలగని రీతిలో యాజమాన్యం సరికొత్త పద్ధతులను ప్రవేశపెట్టింది. విధులకు వచ్చిన కార్మికులు పరస్పరం మాట్లాడుకునేందుకు అవకాశం కలగని రీతిలో ... గనులమీద యోగాభ్యాసం తరగతులను ఏర్పాటు చేసింది. ధ్యానమందిరాలను నిర్మించింది. గనిలో, పనిలో కార్మికులు ఎదుర్కొంటున్న సకల సమస్యలకు యోగాభ్యాసం, ధ్యానముద్రలే పరిష్కారమార్గాలుగా సూచించింది. కార్మికులు అండర్‌గ్రౌండ్ పనిస్థలాలలో ఎదుర్కొంటున్న సమస్యలను కనీసం ప్రస్తావించేందుకు కూడా అవకాశం ఇవ్వకుండా విశ్వవ్యాపిత సార్వజనీన సమస్యలను తెరమీదికి తీసుకువచ్చింది. దుర్భరమైన పని పరిస్థితుల ఫలితంగా క్రమక్రమంగా కుటుంబ జీవనానికి, సంసారసుఖానికి దూరమవుతున్న గని కార్మికులకు 'ఎయిడ్స్' అవగాహన సదస్సులను నిర్వహించింది. కుటుంబసభ్యుల విద్యావకాశాలపట్ల కునారిల్లుతున్న కార్మికులకు గనులపై సంపూర్ణ అక్షరాస్యత ఆవశ్యకతను ప్రబోధించే కార్యక్రమాలను ఏర్పాటు చేసింది. ఈ పనులన్నింటినీ నిర్వహించడానికి ప్రాంతేతర ఏజెన్సీలకే అవకాశాలను కల్పించింది.

ఉత్పత్తి లక్ష్యాలను సాధించడం పేరిట అండర్‌గ్రౌండ్ బొగ్గుగనుల్లో కార్మికులపై విపరీతమైన పనిభారాన్ని మోపుతున్నారు. లక్ష్యాలకు అనుగుణంగా ఉత్పత్తి సాధించని కార్మికులకు ఛార్జిషీట్లు, డిస్మిస్ ఉత్తర్వులు అందుతున్నాయి. సంస్థలో 20, 30 యేండ్లు చెమటోడ్చి, ఎముకలు అరగదీసుకున్న కార్మికుల పట్ల అధికారులు అవహేళకరంగా, అవమానకరంగా ప్రవర్తిస్తున్నారు. మాట్లాడితే ఉద్యోగం పోతుందేమోననే భయం సింగరేణిలో పనిచేస్తున్న ప్రతి కార్మికున్నీ, ప్రతిక్షణం వెంటాడుతున్నది. ఫలితంగా సింగరేణి సంస్థలో ఉద్యోగంలో కొనసాగడం కంటే, ప్రాణాపాయ పరిస్థితుల్లోనూ బొగ్గును వెలికితీయడం కంటే ... ఉద్యోగ విరమణ చేయడమే అత్యంత ఉదాత్తమైనదిగా కంపెనీ యాజమాన్యం లోపాయికారీ పద్ధతుల్లో ప్రచారం నిర్వహించింది. ఇందుకోసం అనేక మార్గాల ద్వారా ప్రోత్సాహకాల ఆశ చూపింది. కంపెనీలో పదవీ విరమణ పొందిన వారికి, స్వచ్ఛంద పదవీ విరమణ పాటించిన వారికి గనులపై ఘనంగా సన్మానాలు నిర్వహించింది. దండలు వేసి శాలువాలతో సత్కరించింది. ఉద్యోగం నుండి వైదొలుగుతున్నందుకు గుర్తింపుగా బంగారు ఉంగరాలను బహూకరించింది. తనకున్న పలుకుబడిని ఉపయోగించి ఈ తతంగాన్నంతటినీ మీడియాలో పెద్దయెత్తున ప్రచారం నిర్వహించింది. సింగరేణి సంస్థ ఇప్పటివరకూ పన్నెండు విడతలుగా నిర్వహించిన 'గోల్డెన్ హ్యాండ్ షేక్' పథకం కింద సుమారు 22 వేల మంది గని కార్మికులు వచ్చిన తోవలోనే పల్లెబాట పట్టారు.

ఈ చర్యల పర్యవసానంగా సింగరేణి బొగ్గు ఉత్పత్తి సంస్థలో గని కార్మికుల మనుగడ ప్రశ్నార్థకంగా మారిపోతున్నది. తమ శ్రమశక్తిని ధారవోసి, భూమిగర్భంనుండి నల్లబంగారాన్ని వెలికితీసి ప్రపంచానికి వెలుతురులు పంచిన గని కార్మికుల భవిష్యత్తు గాలిలో దీపమయ్యింది. ఆ దీపాలు ఆరిపోకుండా మన చేతులు అడ్డుపెట్టాల్సిన అవసరం ఉన్నది. ◆

# అభివృద్ధి - భిన్నదృక్పథాలు

- డా. ముదునూరి భారతి

ఆంధ్రప్రదేశ్‌లో గత 25 సంవత్సరాలుగా సంస్కరణలలో భాగంగా నూతన ఆర్థిక విధానాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. దీని ముఖ్య ఉద్దేశ్యం భూమి ప్రాధాన్యంగా ఉండే ఆంధ్రప్రదేశ్‌లోని సంప్రదాయ సమాజాన్ని, పెట్టుబడి ప్రాధాన్య సమాజంగా మార్చటం, ఈ క్రమంలో మార్కెట్లకు ప్రముఖ పాత్ర ఉండే ఆధునిక సమాజాన్ని రూపుదిద్దటం అమెరికా లాంటి ఇప్పటికే అభివృద్ధి చెందిన దేశాలలో క్రోడీకరింపబడిన అభివృద్ధికి కావలసిన జ్ఞానం, దానితో పాటు సాంకేతిక పరిజ్ఞానం, దీనికి కావలిసిన పెట్టుబడి ప్రపంచబ్యాంకు రుణసహాయం ద్వారా పొంది అభివృద్ధి చెందవచ్చుననే భావజాలం దీనికి మూలం. ఈ భావజాలం వెనుక అభివృద్ధి అంటే పెట్టుబడి ప్రాధాన్య దేశంగా మారిపోవటమేనని, ఇది ఒక సాంకేతిక సమస్య మాత్రమేననీ, ఈ సమస్యకి సమాధానం ఇప్పటికే ప్రపంచ దేశాలలో, తమ ఆచరణ ద్వారా గుర్తించిన కారణంగా, లభ్యమౌతుందని నమ్మకం మనలాంటి దేశాలలో బలంగా ఉంటుంది. ఇటువంటి అభివృద్ధి క్రమం మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడి కాలంలో బాగా వేగాన్ని పుంజుకుంది. ఆయన హయాంలోనే, ఆంధ్రప్రదేశ్ కంటే అభివృద్ధి మార్గం, దీనికి అవసరమైన కార్యక్రమాల మీద అవగాహన ఎక్కువ ఉన్న విదేశీ నిపుణుల ఆధ్వర్యంలో విజన్ 2020 రూపొందింది. ప్రపంచంలో ఉన్న అభివృద్ధి అంతా మన రాష్ట్రానికే రావాలనే కోరికతో ఈ విజన్ 2020లో భాగంగా మనకు వెడల్పాటి రోడ్లు, ఫ్లై ఓవర్లు, విమానాశ్రయాల ఆధునికీకరణ, అంతర్జాతీయ విమానాశ్రయాలు ఒక పక్క ఇంకొక పక్క విద్య, ఆరోగ్య రంగాలలో ప్రభుత్వ పాత్ర గణనీయంగా తగ్గించి ప్రయివేటు రంగానికి ప్రాముఖ్యత పెంచే క్రమంలో విదేశాలతో ఒప్పందాలు, కార్పొరేట్ కాలేజీలు, కార్పొరేట్ ఆస్పత్రులు, కార్పొరేట్ వ్యవసాయం, వ్యాపార పంటల ప్రోత్సాహం, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బయోటెక్నాలజీలకు ప్రముఖ పాత్ర-ఇలా ఎన్నో మార్పులు ఆంధ్రప్రదేశ్‌లో చోటు చేసుకున్నాయి.

ప్రస్తుత ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డి కూడా అవే విధానాలు అనుసరిస్తున్నప్పటికీ, వ్యవసాయ రంగాన్ని ముందుకు తెచ్చి దీనికి అత్యవసరమైన సాగునీటి సరఫరా నిమిత్తం చైనాని ఆదర్శంగా తీసుకుని, త్రీ గోర్జెస్ లాంటి పెద్ద డ్యాంలే కాక జలయజ్ఞంలో భాగంగా చిన్న చిన్న డ్యాంలు నిర్మించే ప్రయత్నంలో ఉన్నాడు. ప్రతి రోజు పత్రికలలో ప్రముఖంగా వచ్చే వార్తలను చూస్తే - కార్లు, చెప్పులకు చెందిన అంతర్జాతీయ కంపెనీలతో ఒప్పందాలు కుదుర్చుకోవటం, సాఫ్ట్‌వేర్ కంపెనీలకు, ఫాబ్‌సిటీ, సైబర్‌సిటీ ఇలాంటి వాటికి ఎన్నో రాయితీలు ప్రకటించి రాష్ట్రానికి ఆహ్వానించటం లాంటివి - చేస్తూ ఇవన్నీ అభివృద్ధి పథకాలుగా అభివర్ణిస్తూ ప్రజలను సమీకరించి కూడగట్టుకునే ప్రయత్నాలు జరుగుతున్నాయి. వీటి వలన ఆర్థిక వ్యవస్థలో మార్కెట్టు పాత్ర పెరిగి, సరుకుల ఎగుమతుల ప్రాధాన్యత పెరిగి రాష్ట్రం అంతర్జాతీయ మార్కెట్టులో భాగమవుతుందని, అదే అభివృద్ధి అనే భావజాలం దీనికి మూలం.

ఆంధ్రప్రదేశ్‌లో ఇంకొక పార్శ్వం-మరొక అభివృద్ధి మార్గంగా ముందుకు వస్తున్న నక్సలైటు ఉద్యమం. మన రాష్ట్రంలోనే కాకుండా, దేశంలో ఏవో కొన్ని రాష్ట్రాలు మినహాయిస్తే మిగతా అన్నింటిలో ఈ ఉద్యమ ప్రభావం కనబడుతూనే ఉంటుంది. ప్రభుత్వం దృష్టిలో ఈ ఉద్యమం సమాజంలో జరుపుతున్న హింస - అది ప్రజాప్రతినిధులను, గిరిజనులను, అమాయకులను చంపటం, పోలీస్‌స్టేషన్‌లను పేల్చివేయటం, మైన్లు పెట్టడం, కిడ్నాపులు చేయటం, అత్యాధునిక ఆయుధాలను ఉపయోగించటం లాంటివి - ఈ హింసాత్మక చర్యల కారణంగా తాము ప్రతిష్ఠాత్మకంగా చేపడుతున్న అభివృద్ధి కార్యక్రమాలకు అడ్డు కలుగుతోందని భావిస్తోంది.

ఈ క్రమంలో సమాజపు అభివృద్ధికి ప్రయత్నిస్తున్న ప్రభుత్వానికి నక్సలైటు ఉద్యమం ఒక సమస్యగా మారింది. ఈ సమస్యని ఎదుర్కొని సమాధానం వెతికే ప్రయత్నంలో కొంతకాలం నక్సలైటు ఉద్యమాన్ని సమాజంలో శాంతిభద్రతల సమస్యగా గుర్తించి, దీనిని అదుపులో ఉంచగలిగే అనేక అణచివేత కార్యక్రమాలు చేపట్టింది. దీనికి పోలీసుశాఖ ముఖ్యపాత్ర వహించింది. గ్రేహౌండ్ దళాలను ప్రయోగించటం, ఎన్‌కౌంటర్లు, నక్సలైటు ప్రభావిత గ్రామాలలో పోలీసుల అణిచివేత, నక్సలైట్ల కుటుంబాల మీద ఒత్తిడి పెంచి హింసించటం, లొంగిపొమ్మని ప్రలోభాలు చూపించటం లాంటి వివిధ పద్ధతులు ఉపయోగించి నక్సలైటు సమస్యకి ఒక సమాధానం వెతికే ప్రయత్నం చేసింది.

మరి కొంతకాలం సమస్యని శాంతిభద్రతల సమస్యగా కాకుండా సాంఘిక, ఆర్థిక సమస్యగా గుర్తించి దీనికి ప్రతిగా భూసంస్కరణలు చేపట్టడం, పేదరిక నిర్మూలన పథకాలు, స్వయం సహాయక సంఘాలకు ధన సహాయం, గ్రామీణ ఉపాధి గ్యారంటీ పథకం లాంటి ఎన్నో రాయితీలు సమకూర్చింది. మరి కొంతకాలం దీనిని రాజకీయ సమస్యగా గుర్తించి నక్సలైటు ఉద్యమానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించే ప్రయత్నాలు చేసింది. వీటిలో భాగంగానే నక్సలైటు ఉద్యమానికి సమాజం గురించి ఉన్న దృక్పథం ఏమిటో తెలుసుకునే ప్రయత్నంలో ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వం వారితో శాంతి చర్చలు కూడా జరిపింది. ఇవి అర్థాంతరంగా ముగిసిపోయినప్పటికీ నక్సలైటు ఉద్యమానికి రాజకీయంగా ఒక గుర్తింపు తెచ్చింది.

ఇదే సమయంలో మన ప్రక్క దేశమైన నేపాల్‌లోని మావోయిస్టులు, మిగతా పార్టీలతో కలిసి రాజరికాన్ని తొలగించి నేపాల్ పునర్వ్యవస్థీకరణలో భాగం అవటం అనే ప్రక్రియ ఈ సమస్యని ఒక రాజకీయ సమస్యగా గుర్తించటం వలననే జరిగింది. ఈ పరిణామం కారణంగా ఇక్కడ కూడా నక్సలైటు ఉద్యమాన్ని రాజకీయ సమస్యగా గుర్తించాలి అనే వాదానికి బలం చేకూరింది.

ఒకసారి ఆంధ్రప్రదేశ్ సామాజిక పరిస్థితులను పరిశీలించితే ఇక్కడ అభివృద్ధి సాధించటానికి ప్రభుత్వం అధిక పెట్టుబడులు ద్వారా సమాధానం వెతికే ప్రయత్నాలు చేస్తుంటే, నక్సలైటు ఉద్యమం ఈ దృక్పథానికి వ్యతిరేకం అవడంతో ఒక సంక్షోభంలో పడి ఎటూపోలేని పరిస్థితులు ఏర్పడ్డాయి. ప్రభుత్వం అభివృద్ధి మార్గానికుండే అడ్డంకులకు సమాధానం ఎలా ఊహిస్తోందో చూద్దాం.

**2**

ప్రపంచబ్యాంకు నిర్దేశకత్వంలో అమలు చేసే అభివృద్ధి ప్రయత్నాలకు నక్సలైటు ఉద్యమం చాలా రాష్ట్రాలలో ఒక సమస్యగా మారింది అనే ఒక అభిప్రాయం బలపడటం, దీనితోపాటు ఆంధ్రప్రదేశ్‌లో ఈ సమస్య తీవ్రంగా ఉండటంతో, రాష్ట్ర ప్రభుత్వం దీని అణచివేతకి ఎలాంటి సమాధానం చూపెట్టగలదో అని కేంద్రంలో ఉండే నేతృత్వమే కాక, ప్రపంచమంతా కూడా ఆంధ్రప్రదేశ్ మీదే దృష్టి కేంద్రీకరించింది. ఈ ప్రయత్నాలకు కావలసిన మద్దతు, మిలిటరీ సహాయం ఇవ్వడం, అధికమొత్తంలో ధనసహాయం చెయ్యడం జరుగుతోంది. ఈ నేపథ్యంలో ప్లానింగ్ కమిషన్ డిప్యూటీ చైర్మన్ ఎం.ఎస్. అహ్లువాలియాతో మన ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డి జరిపిన సమావేశంలో, రాష్ట్రానికి 2006లో అందించే ధన సహాయాన్ని రు. 20,000 కోట్లకు (అంటే గత సంవత్సరం కంటే 28 శాతం ఎక్కువ, ఇది అన్ని రాష్ట్రాల కంటే ఎక్కువ) నిర్ధారించారు. అహ్లువాలియా ఈ పెంపుని సమర్థిస్తూ ఆంధ్రప్రదేశ్‌లో ఆశించినట్లుగా సంతృప్తికరమైన వృద్ధి సాధ్యమౌతోందని మెచ్చుకుని, ఇలాగే ముందుముందు కూడా జరగాలనే ఉద్దేశ్యంతో కేంద్రం ఇచ్చే ధన సహాయాన్ని పెంచినట్లు చెప్పారు. ఆయన నక్సలైటు సమస్యని గురించి మాట్లాడుతూ, కేంద్ర ప్రభుత్వం నక్సల్ ప్రభావిత ప్రాంతాలలో అభివృద్ధిని వేగవంతం చెయ్యడానికి అవసరమయ్యే ఎత్తుగడల మీద ఆసక్తి చూపుతోందనీ, దీనికి ఆంధ్రప్రదేశ్‌లో జరిగే ప్రయత్నాలే దారి చూపాలని చెప్పారు. దీనికి స్పందిస్తూ మన ముఖ్యమంత్రి రాష్ట్రంలో ప్రతి కుటుంబానికి కూడా వ్యవస్థమీద ప్రత్యేకమైన ఆసక్తి (వెస్టెడ్ ఇంట్రెస్ట్) ఉండేటట్లు చూడటమే తన ఆశయమనీ, దీని వలన వారు ఈ వ్యవస్థని తమదిగా భావించి కాపాడుకుంటారనీ చెబుతూ, నక్సల్ ప్రభావిత జిల్లాలలో నిరుద్యోగులైన యువకులను గుర్తించి వారికి తగిన శిక్షణనిచ్చి ప్రయివేటు సంస్థలలో ఉద్యోగాలు లభించేటట్లు చూడటం ఒక సమాధానంగా చెప్పారు.

నిరుద్యోగులైన యువకులే నక్సలైటు ఉద్యమ ప్రభావానికి లోనవుతున్నారనీ, వీరికి ఉద్యోగావకాశాలు కల్పించగలిగితే నక్సలైటు సమస్యకి పరిష్కారం దొరకటమే కాకుండా, వీరికి వ్యవస్థమీద అభిమానం కలిగి వారే వ్యవస్థని కాపాడుకుంటారనే ఆలోచన దీనికి మూలం. ఇది ఎత్తుగడలలో భాగమయినా కాకపోయినా, శాశ్వతమైన ఉద్యోగాలు ఇవ్వగలరా లేదా మొదలైన ప్రశ్నలు ప్రక్కన పెడితే ఈ వ్యవస్థ నాకోసమే, నా ప్రగతికే అనే ఒక ప్రత్యేకమైన ఆసక్తి (వెస్టెడ్ ఇంట్రెస్ట్) కలగడం ద్వారా ప్రభుత్వం అమలు చేస్తున్న వివిధ పథకాలను ప్రజలు తమకు చెందినవిగా, తమకు ఉపయోగ పడే కార్యక్రమాలుగా సొంతం చేసుకునే (ఓనర్‌షిప్) అవకాశం ఉంటుందని, దీని కారణంగా సమాజంలో అభివృద్ధి సాధ్యమవటమే కాక నక్సలైటు సమస్యకు సమాధానం దొరకగలదనీ అభిప్రాయం వ్యక్తపరిచారు. ఇదే భావం కేంద్ర పంచాయితీరాజ్ మంత్రి మణిశంకర్ అయ్యర్ కూడా చెప్పినట్లు, వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి నిమిత్తం ఇచ్చే ధనసహాయంలో ఆంధ్రప్రదేశ్‌కి భారీ మొత్తం కేటాయించామనీ, ఇది ముఖ్యంగా నక్సలైట్లను ఏరివేసే కార్యక్రమం కొరకు, నక్సల్ ప్రభావిత జిల్లాలకు ఖర్చు చేసే నిమిత్తం అందిస్తామనీ హైదరాబాద్ వచ్చినప్పుడు హామీ ఇచ్చారు. కేంద్రానికి కూడా ఇది సమస్యేనని, ఆంధ్రప్రదేశ్‌లో ఈ సమస్య తీవ్రంగా ఉందనీ, అందుచేత ఈ సమస్యకి పరిష్కార మార్గాలు వెతికే ప్రయత్నాలలో ఆంధ్రప్రదేశ్ ముందు నిలబడాలనీ, దానికి కావలసిన ధన సహాయం కేంద్రం ఎంతైనా అందించేందుకు తయారుగా ఉందని తెలిపారు.

అభివృద్ధి గురించి రాజశేఖరరెడ్డి అభిప్రాయంలో, ప్రజలకు సమాజంలో జరుగుతున్న మార్పులు తమకోసమే అనే ప్రత్యేకమైన ఆసక్తి కలగడం ద్వారా, ఆ కార్యక్రమాలు తమ సొంతం అనే భావన కలుగుతుందనీ, పర్యవసానంగా అభివృద్ధి పథకాల అమలులో అనుకున్న ఫలితాలు సాధించి అభివృద్ధి సాధ్యమౌతుందనే ఒక నమూనా కన్పిస్తుంది.

ప్రస్తుత సమాజంలో, ముఖ్యంగా మూడవ ప్రపంచ దేశాలలో, అభివృద్ధి సాధ్యపడటానికి 'ఓనర్‌షిప్' (నాది, నాకే చెందినది) అనే ఒక కొత్త భావనని బలంగా ముందుకు తెచ్చిన ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త డా. జోసెఫ్. ఇ. స్టిగ్‌లిట్జ్ సమాచారాన్ని ఒక సరుకుగా గుర్తించి, సరుకుల ప్రపంచంలో ఈ సమాచారానికుండే పాత్రని వివరిస్తూ, అసమాన సమాచార వ్యవస్థలో మార్కెట్ల పోకడలను గురించి ఆయన చేసిన విశ్లేషణ ప్రపంచ పోకడలను ప్రభావితం చేసే ఆవిష్కారంగా గుర్తింపబడిన కారణంగా 2001 సంవత్సరంలో నోబెల్ పురస్కారం పొందాడు. ఈయనకుండే కొన్ని ఇతర అధికార హోదాలు – ప్రపంచ బ్యాంకు సంస్థకి చీఫ్ ఎకానమిస్టు, అమెరికా ప్రెసిడెంట్ బిల్ క్లింటన్ హయాంలో ఆర్థిక నిపుణుల సలహా మండలికి చైర్మన్. ప్రపంచ సంక్షోభానికి, దానితో వచ్చిన విపరీత పరిణామాలకు ఈయన స్పందించి తన అవగాహన మెరుగు పరుచుకునే క్రమంలో అభివృద్ధి అంటే ఏమిటి? ఒక దేశంలో అభివృద్ధి పథకాలు విజయవంతం కావటానికి అవసరమయ్యే షరతులేమిటి? అనే ప్రశ్నలకు కొత్త ఆలోచనలు ప్రతిపాదించి వీటిని పునర్‌నిర్వచించే ప్రయత్నం చేసాడు. ఆ వివరాలు..

ప్రపంచ దేశాలలో కొన్ని మిగతా దేశాల కంటే ముందుగా అభివృద్ధి చెందినప్పుడు, ఆర్థర్ లూయిస్ లాంటి ఆర్థిక శాస్త్రవేత్తలు తమ నమూనాలో వీటిని సంప్రదాయ, ఆధునిక దేశాలుగా విభజించి, సాంప్రదాయ దేశాలు (వ్యవస్థ) ఆధునిక దేశాలుగా (వ్యవస్థగా) పరివర్తన చెందటమే 'అభివృద్ధి' అని ప్రతిపాదించారు. దీని వెనుక అభివృద్ధి అంటే డబ్బు కేంద్రంగా నిర్మాణమయ్యే పెట్టుబడిదారీ దేశంగా మారిపోవటం అనే భావన ఇమిడి ఉంది. దీనికి కారణం అభివృద్ధి చెందిన దేశాలలో అభివృద్ధికి సంబంధించిన పరిపూర్ణ జ్ఞానం, సాంకేతిక నైపుణ్యం వీటితో పాటు ఆర్థిక శక్తి కూడా సమకూరుతాయనీ, సాంప్రదాయ దేశాలకు వీటి కొరత ఉన్నకారణంగా అవి అభివృద్ధి చెందలేకపోతున్నాయనీ, తమ దగ్గర ఉండే ఈ వనరులను సాంప్రదాయ

దేశాలకు అందుబాటులో తేగలిగిన పక్షంలో అవి కూడా అభివృద్ధి చెందగలవనే భావన. ఈ నేపథ్యంలో ప్రపంచ దేశాలన్నిటికి ఒకే ఒక నిర్దిష్ట అభివృద్ధి మార్గం ఉంటుందనీ, అది పెట్టుబడిదారీ సమాజంగా పరివర్తన చెందటమేననీ నమ్మకం కలిగింది. కొన్ని దేశాలు అభివృద్ధి చెందిన తరువాత అభివృద్ధి అంటే ఒక సాంకేతిక సమస్య మాత్రమేననీ, దీనికి సమాధాన రూపంలో పరిష్కార మార్గాలు ఇప్పటికే తయారుగా ఉన్నాయనీ, సాంప్రదాయ దేశాలకు ఈ సాంకేతిక పరిజ్ఞానం, దీని అమలుకు కావలసిన మిగతా వనరులు అందించటం ద్వారా అభివృద్ధి సాధ్యమనీ ప్రపంచ ఆర్థిక నిపుణుల సంఘం (దీనిలో స్టిగ్‌లిట్జ్ సభ్యుడు) ఒక అంగీకారానికి వచ్చారు. దీనినే వాషింగ్‌టన్ కన్సెన్సస్ (1990) అనే పేరుతో పిలుస్తారు. ఇందులో ప్రతిపాదించిన విధానాలను ఆచరించటం ద్వారా అభివృద్ధి సాధ్యమనే నమ్మకం దీనికి ఆధారం. దీనిలో అభివృద్ధికి కొలమానం స్థూల జాతీయోత్పత్తి (జి.డి.పి) గా నిలిచింది. వీరు ప్రతిపాదించిన అభివృద్ధి మార్గాన్ని అనుసరించి కొన్ని దేశాలు అభివృద్ధి చెందాయి, కొన్ని అభివృద్ధి చెందలేకపోయాయి. ఈ మార్గాన్ని అనుసరించని మరి కొన్ని దేశాలు కూడా అభివృద్ధి చెందాయి. ఇలా ఆచరణలో వచ్చిన విరుద్ధ ఫలితాలు 'అభివృద్ధికి ఏకైక మార్గం ఉంటుంది' అనే ప్రతిపాదనకు సవాలుగా నిలిచాయి. ఇదే సమయంలో ప్రపంచం ఆర్థిక సంక్షోభానికి గురి అయింది. అంటే కొన్నిచోట్ల అభివృద్ధి కుంటుపడింది. ఇంకా కొన్ని దేశాలలో ఎన్నో కోట్ల మంది పేదరికం, ఆకలితో అలమటించిపోయారు. దీనితో అభివృద్ధి అంటే పెరుగుదలకి సంబంధించిన కొలమానం సరిపోదనీ, దీనితోపాటు మనిషికి ముఖ్యావసరాలైన విద్య, ఆరోగ్యం మొదలైన వాటిని కూడా గణనలోకి తీసుకోవాలనీ, వీటికి కావలసిన మరికొన్ని సూచికలు కలిసి అభివృద్ధికి మరొక కొత్త కొలమానం తయారయింది.

ఇలా వాషింగ్‌టన్ కన్సెన్సస్ ప్రతిపాదించిన అభివృద్ధికి చెందిన మౌలిక ప్రతిపాదన (ఫండమెంటల్ పారడైమ్) ఆచరణలో అనుకున్న ఫలితాలు సాధించలేకపోవడంతో స్టిగ్‌లిట్జ్ ఆర్థిక నిపుణుల కూటమి నుండి బయటికి వచ్చి 'అభివృద్ధి అంటే ఏమిటి? మిగతా దేశాలలో అభివృద్ధిని సాధ్యపరచే ప్రత్యామ్నాయ మౌలిక ప్రతిపాదన ఏమిటి?' అనే ప్రశ్నలకు కన్సెన్సస్ లో చెప్పిన వాటికంటే ముందు చూపు కావాలనే ఉద్దేశ్యంతో వాటికి కొత్త నిర్వచనాలు ఇచ్చారు.

సామ్రాజ్యవాదం విస్తరిస్తున్న నేపథ్యంలో వెనుకబాటుతనాన్ని సిద్ధాంతీకరించిన ఆర్థిక శాస్త్రవేత్తల ద్వయం సింగర్, ప్రెబిష్‌లు. ఈ రెండవ శాస్త్రవేత్త రావుల్‌ప్రెబిష్ గౌరవార్థం ఏర్పాటు చేసే ఉపన్యాసాలలో 9వ ఉపన్యాసం (1998లో) 'టువర్డ్స్ ఎ న్యూ పారడైమ్ ఫర్ డెవలప్‌మెంట్, స్ట్రాటజీస్, పాలసీస్ అండ్ ప్రాసెస్' లో వీటిని ప్రతిపాదించాడు. అభివృద్ధి అంటే సామాజిక మార్పులతో మాత్రమే సరిపోదని, సమాజంలో గుణాత్మకమైన మార్పులు (ట్రాన్స్‌ఫరమేషన్) రావాలనీ, దీనినే సామాజిక కట్టడిలో మార్పుగా వివరిస్తూ, సాంప్రదాయ సమాజంలో ఆలోచనలు, సమాజం ఎదుర్కొనే సమస్యల పరిష్కారాలు మూఢ నమ్మకాల పునాది మీద ఆధారపడతాయనీ, ఇటువంటి సమాజం నుండి ఆలోచనలు, సమస్య పరిష్కార మార్గాలు శాస్త్రీయ జ్ఞానం, సైన్సు పునాది మీద ఆధారపడే సమాజంగా మారటమే అభివృద్ధి అని నిర్వచించాడు. అంటే సమాజంలో గుణాత్మకమైన మార్పులతో పాటు, సమస్యకి సమాధానం అన్వేషించే మనిషి ఆలోచనా విధానం కూడా మారిపోవాలి అనేది ముఖ్యవిషయం. ఇక్కడ మార్పు ప్రధానమవుతుంది. ఈ కొత్త ప్రాతిపదికలో ఒక దేశానికి అభివృద్ధి అంటే పెట్టుబడిదారీ దేశంగా మారటం అనే గమ్యం మీద సందేహం లేకపోయినా, ప్రపంచ దేశాలన్నీ ఒకే మార్గంలో అభివృద్ధి చెందవలసిన అవసరం లేదనీ, ప్రతి దేశం తన అవసరాల కనుగుణంగా తన భౌతిక, మానవ వనరుల ఆధారంగా, తన సొంత పథకాలను ఎంచుకోవచ్చునని ప్రతిపాదించాడు.

ఈ కొత్త ప్రతిపాదనలో అభివృద్ధి అంటే సాంకేతిక పరిజ్ఞానం మొదలైన వనరులను అందించి ఉత్పత్తులలో వృద్ధి సాధించగలిగే సాంకేతిక ప్రక్రియగా కుదించకుండా, దీని పరిధిని విస్తృతం చేసి సమాజం మొత్తంగా పరివర్తన జరిగి కట్టడి మారిపోవాలనీ, అప్పుడే అభివృద్ధి నిరంతరంగా కొనసాగగలదనీ ప్రతిపాదించాడు. ఇటువంటి అభివృద్ధి తమతమ అవసరాల రీత్యా ఎటువంటి గుణాత్మకమైన మార్పులు కావాలి, దానికి సంబంధించిన ఒక భవిష్యత్ చిత్రపటం 'విజన్' రూపొందించాలనీ, దీనిలో పొందుపరిచిన పథకాల అమలు ద్వారా పాత సామాజిక సంబంధాల స్థానంలో కొత్తవి ఏర్పడగలవని ఒక అంచనా. ఇటువంటి అభివృద్ధి పథకాలు రూపొందే క్రమం పూర్తిగా పారదర్శకంగా ఉండాలనీ, అప్పుడే దీనికి సంబంధించిన అంశాలపై నిర్ణయాలు తీసుకోవటంలో ప్రజలు భాగస్తులవడం జరిగి వీటిని తమకు చెందిన పథకాలుగా భావించగలరనీ (ఇదే ఓనర్‌షిప్‌గా చలామణి అవుతుంది), అప్పుడే ఈ పథకాల అమలులో విజయవంతమయ్యే అవకాశం ఉంటుంది. ప్రజలు వీటిని తమకు చెందినవిగా, తామే నిర్ణయించుకున్నామని భావించకపోతే, వీటివలన సమాజంలో వృద్ధి రావచ్చునేమో కాని అభివృద్ధి జరగదని చెబుతూ, ఈ కారణంగానే స్టిగ్‌లిట్జ్ ప్రతి దేశమూ ఒకే అభివృద్ధి మార్గాన్నే అనుసరించినప్పటికీ ప్రతి దేశం తప్పక అభివృద్ధి చెందుతుందని చెప్పలేమనే ఒక అభ్యంతరకరమైన, తీవ్రమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేసాడు.

ఇటువంటి పథకాలు తన సమాజం యొక్క అంతర్గత అవసరాల నేపథ్యంలో గమనప్రాధాన్యంగా రూపొందిన పక్షంలో ప్రజలు వాటిని తమకు చెందినవిగా భావించటానికి అడ్డంకులు ఉండవు. అలా కాకుండా ఈ పథకాలను అభివృద్ధి చెందిన దేశాల అనుభవంతో గమ్య ప్రాధాన్యంగా రూపొందినవయితే – ఇటువంటి పథకాలు అభివృద్ధికి చెందినవే కావచ్చును – ప్రజలకు స్వభావసిద్ధంగానే మార్పుల మీద విముఖత ఉండటంతో ఇవి ఆచరణలో సఫలమయ్యే అవకాశాలు తక్కువగా ఉంటాయి. మనిషి అభివృద్ధి అంటే తన ఆలోచనా విధానాలు మారటం అని అనుకుంటే, ఈ పథకాలకు సంబంధించిన అవసరమైన సమాచారం అందించినంత మాత్రాన సరిపోదని, మనిషి ఆలోచనా విధానాన్ని బలవంతంగా మార్చుకోమని చెప్పలేం కాబట్టి వీటి అమలు ద్వారా కొన్నిసార్లు ఆశించిన మార్పులకు అడ్డంకులు కూడా వస్తాయి. ఈ అడ్డంకులను అధిగమించటానికి మరికొన్ని ప్రతిపాదనలు చేసాడు. మొదటిది పైన చెప్పిన 'తనది' అనే భావనను బలపరచటం, రెండవది ఈ అభివృద్ధి పథకాలు అమలు చేయబడే వివిధ రంగాలలోనే కాక ప్రయివేట్ – పబ్లిక్ రంగాల మధ్య ప్రయివేట్ రంగంలోనే వివిధ భాగాల

మధ్య సరియైన సమన్వయం. మార్కెట్లు చురుకుగా పని చేసే అభివృద్ధి చెందిన దేశాలలో వివిధ వ్యవస్థలను సమన్వయ పరిచే పని ధరలు చేస్తే, మార్కెట్లు సరిగా పని చెయ్యని సమాజంలో ఈ పనిని అభివృద్ధి పథకాలు చెయ్యవలసి వస్తుంది. దీని కొరకు ఆ అభివృద్ధి పథకాలు పారదర్శకంగా ఉండటమే కాకుండా అవి రూపొందే క్రమంలో అందరి సమ్మతి ఉంటే దీని ద్వారా తయారు చేయబడే పథకాలను ప్రజలు సొంతం చేసుకోగలరు. అంటే ఈ పథకాలు రూపొందే క్రమంలోనే ప్రజలు నిర్ణయాత్మక భాగం పంచుకుంటే, సివిల్ సమాజం ఆధ్వర్యంలో ఇవి జరిగితే, వీటిని గురించిన పూర్తి సమాచారం (సిద్ధాంత పరంగానూ, ఆచరణలోని ప్రత్యేక వివరాల ద్వారా) అందరికీ అందుబాటులో ఉండి అర్థమయ్యేలా ఉంటే, ఇవన్నీ మా సొంతం, మా అభివృద్ధి కొరకే, మేమే తయారు చేసుకున్నామనే భావన (ళిగిదీలిజీరీనీరిచీ) కలగుతుంది. ఈ పరిస్థితులలో ధన సహాయం అందించే ప్రపంచ బ్యాంకు లాంటి సంస్థలకు ఈ క్రమాన్ని వేగవంతం చేసే పాత్ర ఉంటుంది. ఈ భాగస్వామ్యం, తనది అనే భావం, సమన్వయం ఉన్నప్పుడు ఈ అభివృద్ధి పథకాలు అనుకున్న ఫలితాలు, అంటే సమాజంలో గుణాత్మకమైన మార్పులు వచ్చే అవకాశం ఉంది.

సమాజంలో ఎటువంటి మార్పులు కావాలి, ఎంత వేగంగా సమాజం మారటానికి సాధ్యం అవుతుంది, దీనికి ఎటువంటి అభివృద్ధి పథకాలు కావాలి. దానికుండే 'విజన్' ఏమిటి అనేది ఆ సమాజపు నేతృత్వానికి సంబంధించిన విషయం. ప్రజలకు దీనిమీద ఉన్న నమ్మకమే సమాజ చలనంలో ప్రముఖ పాత్ర వహిస్తుంది. దీనినే సోషల్ క్యాపిటల్ అని కూడా అనవచ్చును. ఈ నేతృత్వం వ్యక్తులమధ్య ఇచ్చి పుచ్చుకోవడాలు నియత్రించటం, ఘర్షణలు, స్పర్ధలను సమాధాన పరచటం ద్వారా ఒక మధ్యవర్తిత్వపు పాత్ర పోషిస్తుంది. అంతే కాకుండా కొత్తవ్యవస్థకు కావలసిన 'విజన్' రూపొందించి, దాని అమలుకు కావలసిన పరిస్థితులను తయారు చేస్తుంది. వీటి సఫలత సమాజంలోని వ్యక్తుల మీద ఆధారపడుతుంది.

స్టిగ్‌లిట్జ్ ప్రతిపాదనలను మరొక్కసారి చూస్తే, అభివృద్ధి అంటే సమాజపు అభివృద్ధి (సమాజం మొత్తంలో గుణాత్మకమైన మార్పులు) తో పాటు వ్యక్తి అభివృద్ధి (వ్యక్తి ఆలోచనా విధానంలో మార్పు) కూడా జరగాలి. సమాజపు అభివృద్ధి అంటే సంప్రదాయ సమాజాలు ఆధునిక సమాజాలుగా మారిపోవాలి. పెట్టుబడిదారీ దేశంగా మారటమే దీనికున్న ఏకైక మార్గం. అన్ని దేశాలు ఒకే రకమైన అభివృద్ధి పథకాలు ఎంచుకోవలసిన పని లేదు, ఏ దేశానికాదేశం తమ స్థానిక నేతృత్వం ఎంచుకున్న నమూనా లేక ఒక 'విజన్' ఆధారంగా అభివృద్ధి కార్యక్రమాలు రూపొందించుకోవాలి. వీరికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానం, ధన సహాయం ఆధునిక దేశాలు సమకూర్చగలగాలి. ఈ క్రమంలో ప్రజలకు భాగస్వామ్యం, నిర్ణాయకపాత్ర ఉన్నట్లయితే, అభివృద్ధి పథకాలను ప్రజలు తమ సొంతం చేసుకున్నప్పుడే ఇవి ఆచరణలో సఫలమయ్యే ఆస్కారం ఉంటుంది. మనిషి ఈ మార్పుని కోరి సొంతం చేసుకోవటం ద్వారా ఆలోచనా విధానం కూడా మారుతుంది. ఈ క్రమంలో ప్రయివేటు రంగానికి ప్రముఖపాత్ర ఇచ్చి, దీనికి మిగతా రంగాలకు సరియైన సమన్వయం ఉన్నపుడే అభివృద్ధి సాధ్యమౌతుంది.

ఈ స్థానిక నేతృత్వం సివిల్ సమాజంలో ఉండే మేధావులు, శాస్త్రజ్ఞులు, పారిశ్రామికులు, పరిశోధనా సంస్థలు, విశ్వవిద్యాలయాల అధ్యాపకులు మొదలైన వారంతా భాగస్తులే.

సమాజ చలనానికి రెండు ప్రత్యామ్నాయ మార్గాలు కనిపిస్తాయి. స్థానిక నేతృత్వం రూపొందించిన ఒక 'విజన్' లో ఒక 'గమ్యం' నిర్ధారించి దానిని చేరుకోవాలనే మార్పు ఒకటయితే, రెండవది సమాజంలో సహజసిద్ధమైన సందర్భానుకూలమైన 'గమనాన్ని' ప్రోత్సహించే మార్పు రెండవది. ఒక వ్యక్తి రెండు మార్గాలలో దేనిని ఎప్పుడు సొంతం చేసుకుంటాడు, ఏ పరిస్థితులలో అయినా ఈ రెండు ఒకటయి పోగలవా అనేవి మన ముందుకు వచ్చే ప్రశ్నలు.

## 3

ప్రకృతిలో ఎన్నో జాతులు, ప్రాణులు ఉన్నాయని, అందులో 'మనిషి' అనగానే మిగతా ప్రాణుల కంటే భిన్నమని, సమర్థవంతంగా పని చేసే మెదడు మనిషికే సొంతం అని, మిగతా ప్రాణులకు ఇది లేదని ఒక అభిప్రాయం ఉంది. మిగతా ప్రాణులు (పక్షులు, జంతువులు లాంటివి) పరిసరాల నుండి వచ్చే సంకేతాలను గ్రహించి తమ మెదడు సహాయంతో వాటిని సమీకరించుకొని, క్రోడీకరించుకొని ఒక ఆచరణకు వస్తాయి. పావ్‌లోవ్ అనే రష్యన్ శాస్త్రవేత్త ప్రయోగశాలలో దీనిని నిరూపించటం మూలాన వీటికి పావ్‌లోవియన్ ప్రయోగాలు అనే పేరు స్థిరపడింది. గోడకు బంతి కొడితే అది తిరిగి వచ్చినట్లు మిగతా ప్రాణుల ఆలోచన-ఆచరణ మధ్య ఒక పాక్షిక సమన్వయం ఉంటుంది. ఉదాహరణకు మనం బంతి విసిరితే కుక్క పరిగెట్టుకుని వెళ్లి తీసుకుని వస్తుంది. ఇది ఎన్నిసార్లయినా తిరిగి చేస్తుంది. ఇంట్లో ఉండే జామ చెట్టు కాయలు పండితే రేపు కోసుకుందాం అని అనుకుంటే అంతకంటే ముందురోజే ఉడత తినేస్తుంది. అంటే ఉడతకి కాయ ఎప్పుడు పండుతుంది, ఎప్పుడు తినాలి అనేది తెలుసు. చీమలకి తీపి వాసన బట్టి దూరాన్ని అంచనా వేసి ఆ స్థలానికి చేరుకుని పంచదార తినటమే కాకుండా ఈ సమాచారాన్ని మిగతా చీమలకి అందచేయడం కూడా తెలుసు. మనం వింతగా చూసే విదేశీ పక్షులకు ఎప్పుడు (సమయం) ఎక్కడికి (స్థలం) ఎలా (దిశ) వెళ్లాలో తెలియటమే కాకుండా ప్రతి సంవత్సరం ఇదే ఆచరణని తిరిగి చేస్తాయి. ఇలాంటి ఉదాహరణలు మన చుట్టూ ఎన్నో ఉంటాయి.

మరి మనిషికి మిగతా ప్రాణులకు తేడా ఏమిటి? పైన చెప్పిన కుక్కకి బంతి తానే మరొకచోటికి విసర వచ్చును అనేది తెలియదు. వలస పక్షులకు తమ స్థావరాలనే తమకు అనుగుణంగా మార్చుకోవటం తెలియదు. వీటి అర్థం తమకు ఉండే (ఆలోచన – ఆచరణ) ను అదే విధంగా తిరిగి మళ్లీ మళ్లీ చేస్తాయనీ, వీటి సమన్వయంలో ఆలోచనలో మార్పులు ఎలా వస్తాయి అని కాని, దాని వలన ఆచరణ ఎలా మారగలదు అని కాని తెలియదు. కాని మనిషి దీనికి భిన్నంగా ఆలోచన – ఆచరణ – కొత్త ఆలోచన – కొత్త ఆచరణ అనేక్రమంలో తన మేధాశక్తిని పెంచుకోవటమే కాకుండా ప్రకృతిని తమకనుగుణంగా మార్చుకోగలిగారు. ఈ క్రమంలోనే సైన్సు, టెక్నాలజీ అభివృద్ధి చెందాయి. ఉదాహరణగా ప్రకృతిలో ఉండే చెట్లకొమ్మలలో నివాసముండే మనిషి బహుళ అంతస్తుల భవనాలను కట్టడమే కాకుండా ఇంటిని

విడివిడి భాగాలుగా తయారు చేసి - అంటే చిన్న పిల్లలు బిల్డింగ్ బ్లాక్స్ తో ఇల్లు తయారు చేసినట్లు - అతి కొద్ది సమయంలో అనుకున్న స్థలంలో వీటిని కలిపి ఇల్లు తయారు చేయగలదు. ప్రస్తుతం హైదరాబాద్ లో పెద్ద పెద్ద ఫ్లై ఓవర్‌లు కూడా ఇదే పద్ధతిలో కడుతున్నారనే వార్తలు. ఇదీ మనిషికీ మిగతా ప్రాణులకు తేడా.

ఇదే విధానంలో ఆలోచిస్తే మిగతా ప్రాణులకు ఉండే మెదడు యాంత్రికంగానే పని చేస్తుందని, అంటే చుట్టూ ఉండే పరిసరాల నుండి వస్తున్న సంకేతాలు (అదే ఆలోచన - అదే ఆచరణ) గా పునరావృతం అవుతాయని తెలుస్తుంది. ఉదాహరణకి గూడు కట్టే సాలీడు కి, బట్టలు నేసే నేత పనివారికి ఉండే తేడా చూద్దాం. సాలీడు పదే పదే అన్ని కాలాలలో అన్ని సమయాలలో ఒకే రకంగా గూడు కట్టగలదు. ఎన్నిసార్లు తెగిపోయినా మళ్లీ అక్కడే అలాగే గూడు కడుతుంది. కానీ నేతపనివారు తాము నేయబోయే చీర / పంచె నమూనాని ముందుగానే మెదడులో రూపొందించుకుని, దాన్ని తమ మగ్గం మీద నేస్తారు అనే ఒక ఊహ ఉంది. దీన్ని ఇంకొంచెం విస్తృతం చేసి నేసే క్రమంలో ఎదురయ్యే సమస్యలను అవగాహన చేసుకొని తన నమూనాలో మార్పులు చెయ్యటం, దాని ద్వారా ఆచరణలో మార్పులు తేవటం, లేదా విపరీత పరిస్థితులలో నమూనానే మార్చివేయటం మనిషికుండే మేధాశక్తికి ఒక నిదర్శనం. ఇలా చూసినప్పుడు (ఆలోచన - ఆచరణ)కు పరస్పర సంబంధం ఉంటుంది.

కాలాన్ని కుదించి చూస్తే, మనిషి అంటే (ఆలోచన - ఆచరణ)ల పరిణామ క్రమం అనుకుంటే ఆలోచన - ఆచరణ - కొత్త ఆలోచన అనే త్రయం సైన్సు అభివృద్ధి అంటే ఉత్పత్తి శక్తుల పెరుగుదలకి సూచికగా గుర్తించవచ్చును. ప్రకృతికి సంబంధించిన ఆలోచనలు, ఫిజిక్సు, కెమిస్ట్రి, బయాలజీ, సమాజానికి సంబంధించి జ్ఞానం హిస్టరీ, ఎకనామిక్స్, పొలిటికల్ సైన్స్, సోషియాలజీ ఇదే క్రమంలో రూపు తీసుకున్నాయి. ఆచరణ - ఆలోచన - కొత్త ఆచరణ త్రయం సమాజంలో అందుబాటులో ఉండే వివిధ వనరుల వినియోగం, వాటి మధ్యన ఉండే సమన్వయం లోన వచ్చే మార్పులు సమాజపు రూపురేఖలను మారుస్తాయి. ఈ మార్పునే కొందరు సంప్రదాయ - ఆధునిక సమాజాల విభజనగా భావిస్తే, ఫ్యూడలిజం-కాపిటలిజం సోషలిజంగా కొందరు భావిస్తే, సైన్స్ ముందు - సైన్స్ తరువాత సమాజాలుగా మరి కొందరు భావిస్తే, నాలాంటి కొందరు వనరుల కొరత ఆధారంగా మానవ కొరత, భూమి కొరత, పెట్టుబడి కొరతగల సమాజాలుగా విభజించటం జరిగింది.

ఇలా ఎన్ని రకాల నమూనాలు తయారు చేసుకున్నా మనిషి అంటే శ్రమించే వాడు అనుకుంటే ఆలోచన ద్వారా మానసిక శ్రమని, ఆచరణ ద్వారా శారీరక శ్రమని చేస్తాడు కాబట్టి ఈ మానసిక శారీరక శ్రమ రెంటి కలయికే మనిషిగా ఊహించవచ్చును. ఈ రెండూ పరస్పరం ఒకదాని మీద ఒకటి ఆధారపడతాయి కాబట్టి, ఏ ఒక్కదాని ద్వారా మనిషిని పరిపూర్ణంగా అవగాహన చేసుకోలేం. పరిణామ క్రమాన్ని మరొకసారి పరిశీలిస్తే ముందు శారీరక శ్రమని తగ్గించే ప్రయత్నంలో భాగంగా యంత్రాలు, మానసిక శ్రమ తగ్గించే ప్రయత్నాలలో కంప్యూటర్లు వస్తున్నాయి.

ఇటువంటి నమూనాలో అంతర్లీనంగా కొన్ని ప్రతిపాదనలు చోటు చేసుకుంటాయి. ప్రకృతిలో కాని సమాజంలో కాని ఉండే పదార్థాలకు తనంతట తానే మారిపోయే గుణం స్వాభావికంగానే ఉంటుంది. ఏ కారణంగానైనా ఈ చలనానికి అడ్డంకులు వచ్చినప్పుడు వెలువడే సంకేతాలను దానిలో భాగమైన మనిషి తనకున్న జ్ఞానం ఆధారంగా పంచేంద్రియాల ద్వారా గ్రహించి మెదడు ద్వారా క్రోడీకరించి నమూనా తయారవుతుంది. దీని ఆధారంగా అడ్డంకులు తొలిగించటంలో, అంటే ఆలోచనలో మార్పు ద్వారా ఆచరణలో మార్పు సాధ్యమౌతుంది. ఇక్కడ మనిషి అంటే మారుతున్న ఆలోచన - ఆచరణల క్రమంగా చూస్తే, మనిషి సృజనాత్మక శక్తి ద్వారా బయట ప్రపంచంలో చలనానికి కారకుడవుతాడని. కాని ఈ సృజనాత్మక శక్తి బాహ్య ప్రపంచ నేపథ్యంలో చలనానికి ఉండే అడ్డంకులవటం మూలాన దీనికి కొంత పరిమితిని ఏర్పరుస్తుంది. ఇలా చూస్తే ఈ మార్పు లేవో ఒకదాని తరువాత ఒకటి అవే జరిగిపోతున్నట్లు అనిపిస్తుంది. కాని ఈ ఆలోచన అనేది మనిషి మెదడులో జరిగే మనకు తెలియని ప్రక్రియ ద్వారా సాధ్యమైతే, ఆ ఆలోచనలు మనిషి అంతరంగంలో రూపు తీసుకుంటాయి కాబట్టి, అవి ఆ మనిషికి పరిమితంగా ఉంటాయి. అదే ఆలోచన సమాజంలో కార్యరూపం దాల్చినప్పుడు ఆచరణగా మారిపోయి ఈ ఆలోచన జ్ఞానరూపంలో సమాజ పరం అవుతుంది.

మనిషి గురించిన ఇటువంటి సబ్జెక్ట్ - ఆబ్జెక్ట్ నమూనాలో సబ్జెక్ట్ అంటే మనిషి ఆలోచనా కేంద్రంగానూ - దీనిలోనే బయటి ప్రపంచపు నమూనా (మోడల్) తయారు చేయబడుతుంది - ఆబ్జెక్ట్ అంటే ఆచరణ కేంద్రంగానూ అంటే ఆలోచనలు అమలు చేయబడే బయటి ప్రపంచం గానూ ఊహించవచ్చును. ఇలా మనిషి అంటే ఈ ఆలోచన - ఆచరణ సంబంధం ద్వారా చూస్తే ఇక్కడ వచ్చే మొట్టమొదటి ప్రశ్న ఈ ఆలోచనలకు మూలం ఏది? ఎక్కడ నుంచి వస్తాయి అని. తనకు పరిచయమున్న సమాజ నేపథ్యంలో జరుగుతూ వచ్చిన, ఆచరణ, దానిలో వచ్చే సమస్యలకు సమాధానం వెతికే క్రమంలో ఆలోచనలో మార్పులు రావచ్చును. సమాజపు అంతర్గత కారణాల వలన వచ్చిన ఈ మారిన ఆలోచనలకు రెండవ మూలం వ్యక్తికి పరిచయం లేని బాహ్య ప్రపంచంలోని వ్యక్తుల ఆచరణ ద్వారా రూపొందిన ఆలోచనలు (సమాజ అంగీకారంతో ఇది జ్ఞానంగా వ్యవహరించ బడుతుంది) ఈ జ్ఞానం ఆధారంగా కూడా వ్యక్తి ఆలోచనలో మార్పులు రావచ్చును. బయటి సమాజంలో ఎటువంటి సమస్యలకు సమాధానంగా ఈ ఆలోచనలో మార్పువచ్చింది, ఏ క్రమంలో వచ్చింది, తన ప్రస్తుత సమస్యలకు కూడా అదే సమాధానం అవుతుందా, సమస్యలు ఒకటయినా సమాధానం మరొకటి రాకూడదా, అనే ప్రశ్నలకు సమాధానం దొరకదు. అంతే కాకుండా తన సమస్యలన్నిటికీ సమాధానం బయటి ప్రపంచంలో ఇప్పటికే తయారుగా ఉంటుందని, దాన్ని అందిపుచ్చుకోవటమే తప్ప తన ప్రమేయం అక్కర లేదనే భావన కలుగుతుంది. స్థలకాల పరిమితులతో సంబంధం లేకుండా ఒక సమస్యకి గతంలో సమాజం చూపిన పాత సమాధానాలతో, అంటే యథాతథంగా ఆదే సమస్య - అదే సమాధానం అనే నమ్మకంతో సరిపెట్టుకునే సమాజాన్ని సంప్రదాయ సమాజంగా గుర్తించవచ్చును. సమస్య ఒకటే అయినా మారిన

నేపథ్యంలో సైన్స్ ఆధారంగా కొత్త సమాధానాలు వెతకటం, ఇంకా కొత్త సమస్యలు రావచ్చునని ఊహించగలగటం ఆధునిక సమాజానికి గుర్తింపు. ఏ సమస్య తీసుకోవాలి, ఎలా పరిష్కరించుకోవాలి అనేవి అక్కడి నేతృత్వం మీద ఆధార పడుతుంది. ఆలోచనకీ ఆచరణకీ కూడా సమాజపు దశని బట్టి కొన్ని పరిధులు స్వతఃసిద్ధంగానే ఏర్పడుతాయి. నమ్మకాల మీద ఆధారపడే సంప్రదాయ సమాజం సైన్స్ ఆధారిత సమాజంగా మారే క్రమంలో ఈ ఆలోచనకి గానీ ఆచరణకి గానీ అవధులు లేవు అని ఊహించగలగటం ఆధునిక సమాజానికి గుర్తింపు. ఆచరణకూ ఆలోచనకీ అడ్డంకులను తొలగించి పరిధిని పెంచుకోవటం, సమాజ వనరుల సమీకరణ, వ్యక్తులకు వాటి అందుబాటు, దానికి కావలసిన జ్ఞానం మీద ఆధారపడతాయి. సమాజంలో మారుతున్న ఆలోచనలకు మారనున్న ఆచరణకి సమన్వయం ఉంటే, సమాజంలోని వ్యక్తులు మార్పులు తెచ్చే ఈ క్రమాన్ని సొంతం చేసుకోగలరు. ఇదే మనిషికి నిర్వచనం కూడా అవుతుంది.

### ముగింపు

స్టిగ్‌లిట్జ్ తదితర మేధావులు సమాజాన్ని రెండుగా, సంప్రదాయ, ఆధునిక సమాజాలుగా, విభజించారు. సంప్రదాయ సమాజాన్ని, అలాగే ఆధునిక సమాజాన్ని కూడా వ్యత్యాసాలు లేని ఒకే మూసగా గుర్తించటం, సంప్రదాయ సమాజం ఆధునిక సమాజంగా మార్పు చెందటమే అభివృద్ధి అని గుర్తించటం జరిగింది. కాని నిజ ప్రపంచంలో సంప్రదాయ సమాజంలోని రెండు విభిన్నమైన భాగాలు, ఒకటి శ్రమకేంద్రంగా సమీకరించబడే ఆదివాసీ సమాజం, రెండవది భూమి కేంద్రంగా సమీకరించబడే స్థిరవ్యవసాయ సమాజం. అలాగే ఆధునిక సమాజం కూడా పెట్టుబడి కేంద్రంగా, జ్ఞానం కేంద్రంగా సమీకరింపబడే రెండు ప్రత్యేకమైన సమాజాలుగా చూడవచ్చును. అప్పుడు అభివృద్ధి అంటే సంప్రదాయ సమాజం ఆధునిక సమాజంగా మారే ఒక నిర్దిష్ట దశ కాకుండా, ఒకటి కంటే ఎక్కువ అభివృద్ధి దశలు కన్పిస్తాయి. అప్పుడు అభివృద్ధి మీద, ఈ మార్పుకి కావలసిన అభివృద్ధి పథకాల మీద అవగాహన పెరుగుతుంది. మనిషి అంటే మారుతున్న ఆలోచన - ఆచరణ సంబంధంగా చూస్తే, అంటే ఆలోచనలో వచ్చిన మార్పులు ఆచరణలో మార్పులను ప్రభావితం చేయడం, ఆచరణలో వచ్చిన మార్పులు ఆలోచనలో మార్పులను ప్రేరేపించటం అనే పరస్పర సమన్వయంగా చూడవచ్చును. మనిషి తను ఆలోచించిన దాన్ని ఆచరణలో పెట్టగలడు, ఆచరణలో వచ్చిన సమస్యలను ఆలోచించి పరిష్కరించుకోగలడు అనే అర్థం వస్తుంది. ఈ సమన్వయం ఉన్నప్పుడే సమస్యనాది, సమాధానాలు నావి, పర్యవసానాలు నావి, ఈ అభివృద్ధి పథకాలు నా సొంతం అనే భావన కలుగుతుంది. దీని ద్వారా అభివృద్ధి సాధ్యమయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. ఆలోచనకూ, ఆచరణకీ ఉండే అడ్డంకులు తొలగించినప్పుడే వీటి పరిధి పెరగటమే కాకుండా, వీటికి అవధులు లేవు అని ఊహించగలిగే సంచలనాత్మక మార్పు సాధ్యపడుతుంది.

ఈ క్రమం సాధించటానికి నేతృత్వం గవర్నమెంటు అయినా, స్థానిక మేధావులయినా, ప్రతిపాదించే అభివృద్ధి పథకాలు సమాజపు అంచులలో ఉండే ప్రజలు సొంతం చేసుకున్నప్పుడే, అంటే వారికుండే అడ్డంకులు తొలగించి కొత్తగా వచ్చిన ఆలోచనలు ఆచరించగలగటం, ఆచరణ ద్వారా ఆలోచనని పెంచుకోవటం అనే దానికి అవకాశం ఉండే సమాజం అభివృద్ధి చెందుతుంది. అప్పుడు ఆ సమాజంలో ప్రజలు ఆ అభివృద్ధి పథకాలు తమ స్వంతం అనుకుంటారు. అలా కాని పక్షంలో అభివృద్ధి వృద్ధిగానే మిగిలిపోతుంది. అభివృద్ధి మీద చర్చ చర్విత చర్వణంగా జరుగుతూనే ఉంటుంది. ◆

# నేరాన్ని ద్వేషించు - నేరస్తుణ్ని కాదు

- విద్యాభూషణ్

పుట్టుకతో ఏ వ్యక్తీ నేరస్తుడు కాదు. నేరం చెయ్యడం అతని ప్రవృత్తి సైతం కానేరదు. వర్గ సమాజంలో భిన్న పరిస్థితుల్లో జీవనాన్ని నెట్టుకొస్తున్న వైనం, ఎన్నెన్నో ఒడిదుడుకులు, ఆటంకాలు ఎదురయ్యేలా చేస్తుంది. సామాన్యుడి చుట్టూ వున్న సమస్యల తోరణం, పరిష్కార పరిధిని దాటి తనలో అసహనాన్ని పెంచేందుకే దోహదపడుతుంది. ఈ అసహనం పరిస్థితుల ప్రభావానికి ప్రకోపించి తెలియని క్షణికావేశానికి దారితీస్తుంది. సాధారణంగా నేరస్తులంతా ఈ తెలియని క్షణికావేశానికి లోబడ్డవారే. ఈ తరహా కొంతమందయితే, మరికొంత మందిని అకారణంగా అంటే నిర్దోషుల్నే వివిధ కేసుల్లో ఇరికించి జైళ్లలో మగ్గేలా చేస్తున్నాయి వర్తమాన రాజకీయాలు. అసలు నేరస్తుల కంటే నేరాన్ని ఆపాదించబడి, తగు న్యాయ సహకారం అందుబాటులో లేక అశక్తులుగా జైళ్లలో మగ్గుతున్న వారే అత్యధికులని కొన్ని పరిశీలనలు వెల్లడిస్తున్నాయి. ఇక్కడ మనం నేరస్తుల్నే పరిగణనలోకి తీసుకుని పరిశీలిస్తే, జైలు శిక్ష ననుభవిస్తున్న వారిలో నిరుపేద కుటుంబాలకు చెందిన వారే అత్యధికులు. డబ్బున్న వారు ఎంతటి ఘోరమైన, హీనమైన నేరాలకు పాల్పడ్డా సునాయాసంగా బెయిలును పొంది బైటకు యధేచ్ఛగా రాగలిగిన అనుభవాలు నిత్యం చూస్తున్నే వున్నాం.

జైలు శిక్షకు గురైన వారిలో మెజార్టీ శాతం, వారి కుటుంబాలకు అసరా అయిన వారో, లేదంటే కుటుంబ ఆదాయ వనరుల్లో ఒకరిగానో వుండటం సర్వ సామాన్యం. మరి ఇలాంటి వ్యక్తులే జైలు పాలు కావడంతో వీరి కుటుంబాల జీవన గమనం ఒడిదుడుకులకు గురౌతుంది. అంటే అండగా నిలవాల్సిన వ్యక్తి జైలు పాలుకావడంతో, మొత్తం కుటుంబమే అభద్రతకు లోనవుతుంది. అంతిమంగా ఆ కుటుంబమే పరోక్షంగా శిక్షను అనుభవిస్తుందన్నమాట. చివరకు ఈ కుటుంబాలు వలస కార్మికులుగా అన్య ప్రాంతాలకు తరలి వెళ్లాల్సి వస్తుంది. తమ కుటుంబంలోని వ్యక్తి చేసిన నేరం - ఆ నేర ఫలితం సాంఘికంగా వారిని వెంటాడం సైతం ఈ వలస బతుకులకు దోహద పడుతుంది. ఇన్ని చేదు అనుభవాలు జైలులో శిక్షను అనుభవిస్తున్న వ్యక్తిని కదిలించకుండా వుంటాయా? ఎంతైనా మనుషులే కదా! తాము చేసిన నేరం దృష్ట్యా తమ కుటుంబ సభ్యులు ఎదుర్కొంటున్న దయనీయ పరిస్థితులు, శిక్షననుభవిస్తున్న వారి మానసిక పరివర్తనకు దోహదపడతాయన్నది వాస్తవం. 'పశ్చత్తాపం' తప్పక 'పరివర్తన' కు దోహద పడుతుంది.

ఈ మానసిక పరివర్తన రేపటి మీద ఆశను కల్పిస్తుంది. ఆ రేపటి వెలుగును సద్వినియోగం చేసుకుని, తనపై ఆపాదించబడ్డ నేర ముద్రను శాశ్వతంగా చెరిపేసుకుని, పదిమందిలోనూ తలెత్తుకుని నిజాయితీగా బతకాలన్న కాంక్షను కలిగిస్తుంది. అసలు మానవ మనుగడకు ఊపిరి కన్నా ముఖ్యమైంది రేపటి బతుకు మీద ఆశే కదా! ఈ ఆశ నేరస్తుడ్ని అనుక్షణం ఆలోచింపజేస్తుంది. ఇందుకు సజీవ తార్కాణమే క్షమాభిక్షను పొందిన ఏ ఒక్క జీవిత ఖైదీ తిరిగి నేరస్థుడుగా జైలుకు రావడం జరుగకపోవడం.

ఈ ఆశ కేంద్ర కారాగారాల్లో అందిస్తున్న చేతివృత్తుల్లో, ఆసక్తి వున్న రంగంలో నిపుణతను సాధించాలన్న కాంక్షను పెంచుతుంది. జీవనోపాధిని బాహ్య ప్రపంచంలో పొందగలమన్న భరోసాను ఈ శిక్షణే అందిస్తుంది. ఫలితంగా నేరస్తుల్లో మానసిక మార్పును పటిష్టం చేస్తుంది.

ఈ విశ్లేషణ నేపథ్యంలోనే ఓ ఐదు సంవత్సరాల శిక్షకాలం, జీవితఖైదీలో మార్పుకు హేతువవుతుందని ఆ పై శిక్షననుభవిస్తే సమాజానికి ఎందుకూ పనికిరాని వారుగా తయారు కాగలరని మహాత్మా గాంధీ అన్నారు. ఇదే వాస్తవాన్ని జస్టిస్ ముల్లా కమీషన్, జస్టిస్ పాండురంగారావు కమీషన్‌లు నాటి ప్రభుత్వాలకు నివేదించాయి.

ఈ ప్రాతిపదిక ఆధారంగానే జీవిత ఖైదీల్లో మార్పు రావాలని కాంక్షించి గత ప్రభుత్వాలు 12 దఫాలు క్షమాభిక్షను ప్రసాదించి విడుదల చేయడం సైతం జరిగింది. 1995 నుంచి 2000 వరకు 1098 మంది ఖైదీలను సత్ప్రవర్తన కింద విడుదల చేశారు.

రాష్ట్ర మానవ హక్కుల సంఘం (ఎచ్.ఆర్.ఎఫ్) వారి గణాంకాల ప్రకారం రాష్ట్రంలో 2,800 మంది ఖైదీలకు జీవిత ఖైదు అమలవుతోంది. 2004 ఆగస్ట్‌లో 1050 మందిని ప్రభుత్వం విడుదల చేస్తూ, మరో 285 మంది జీవిత ఖైదీలను, 2004 అక్టోబర్ 2 (గాంధీ జయంతి) సందర్భంగా విడుదల చేస్తున్నట్టు ప్రకటించినా విడుదల చేయలేదు. ఇంతకు ముందుగానే అంటే 2003, మార్చ్ 9న నాటి ప్రతిపక్ష నేత వై.ఎస్. రాజశేఖర రెడ్డి సత్ప్రవర్తన గలిగిన జీవితఖైదీల విడుదల విషయాన్ని శాసనసభలో ప్రస్తావించారు. ఇలా విడుదలైన ఖైదీలు మళ్లీ నేరాలకు పాల్పడినట్టయితే, పాతశిక్షకు అదనంగా జైలులో వుండేలా చూడాలన్న ప్రతిపాదన సైతం నాటి, ప్రత్యేక సమావేశంలో ప్రస్తావనకు తీసుకువచ్చారు. ఈ జీవిత ఖైదీల ముందస్తు విడుదల విషయ పరిశీలనకై హోంశాఖ ప్రధాన కార్యదర్శి అధ్యక్షతన, డిజిపి కన్వీనర్‌గా న్యాయ కార్యదర్శి, సిఐడి న్యాయ సలహాదారు, అదనపు డిఐజిలతో ఓ స్టాండింగ్ కమిటీని సైతం ఏర్పాటు చేయాలని ఆనాటి సమావేశంలో గత ప్రభుత్వం నిర్ణయించింది. కానీ ఆచరణలోకి రాలేదు. నాటి ప్రతిపాదనలను నేటికైనా ఆచరణలోకి తీసుకురావాల్సిన బాధ్యత ప్రస్తుత ప్రభుత్వంపై ఎంతైనా వుంది.

ఆంధ్రరాష్ట్ర అవతరణ రజతోత్సవ వేడుకల సందర్భంగా ఆనాటి ముఖ్యమంత్రి టి. అంజయ్య 20-10-1980న రెమిషన్‌తో కలిపి ఐదు సంవత్సరాల జైలుశిక్ష పూర్తి చేసిన జీవిత ఖైదీలకు క్షమాభిక్షను కల్పించారు. మరి ఈనాడు రాష్ట్రఅవతరణ స్వర్ణోత్సవాలను జరుపుకుంటున్నాం. ఈ సందర్భంగానైనా, ఒకనాటి తన ప్రతిపాదనలకు ఆచరణా క్రమాన్నిచ్చి, ఐదేళ్ల శిక్షను పూర్తి చేసుకున్న జీవితఖైదీలకు విముక్తిని కల్పించాల్సిన బాధ్యత రాష్ట్ర ముఖ్యమంత్రి పై వుంది. వారిలో వచ్చిన పరివర్తన సమాజానికి దోహద పడేలా చేసి, ఆయా ఖైదీల కుటుంబాల్లో నూతన వెలుగులను కల్పించడం పాలకుల కనీస కర్తవ్యం. ◆

# ప్రాంతీయ అసమానతలు - కొన్ని సైద్ధాంతిక సమస్యలు

- ఎన్. వేణుగోపాల్

భారత రాజకీయార్థిక అధ్యయనాలలో 'ప్రాంతీయ అసమానతలు' అనే మాట చాలకాలంగా వినబడుతున్నది. ఈ మాట వాడబడుతున్న సందర్భాల వైవిధ్యం పరిశీలిస్తే ఆ మాటకు నిర్దిష్టత గాని, వాడుతున్న రచయితలలో స్పష్టత గాని ఉండవలసినంత లేదనిపిస్తుంది. ఆ మాటకు సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక కోణాలలో సాపేక్షిక అభివృద్ధి – వెనుకబాటుతనం అనే అర్థంతో సహా అనేక అర్థాలు ఉన్నాయి. దేశంలో కొన్ని రాష్ట్రాలు అభివృద్ధి చెందాయని, మరికొన్ని రాష్ట్రాలు వెనుకబడి ఉన్నాయని అనడందగ్గర ప్రారంభించి, ఒకే రాష్ట్రంలోనూ, ఒకే జిల్లాలోనూ కూడ కొన్ని ప్రాంతాలు అభివృద్ధి చెంది, మరికొన్ని ప్రాంతాలు వెనుకబడి ఉన్నాయని అనడందాకా ఎన్నో స్థాయిలలో ఈ విశ్లేషణ సాగుతోంది. దేశంలోని చాలా రాష్ట్రాలలో అభివృద్ధి చెందిన ప్రాంతాలకూ, వెనుకబడిన ప్రాంతాలకూ మధ్య ఘర్షణ ఎంతోకాలంగా సాగుతున్నది. అది కొత్త రాష్ట్రాల ఏర్పాటు డిమాండ్ గానో, స్వతంత్ర, ప్రత్యేక ప్రతిపత్తి ఆకాంక్షగానో వ్యక్తమవుతున్నది.

నిజానికి మన సమాజంలో అసమానతలు ఎంత విస్తృతంగా ఉన్నాయంటే ఒక ప్రాంతం మొత్తంగా అభివృద్ధి చెందిందనో, వెనుకబడిందనో విశ్లేషించడం కూడ అసాధ్యమూ కష్టసాధ్యమూ అయ్యేంత సంక్లిష్టత నెలకొనిఉంది. ఆ ప్రాంతంలోని వర్గ, కుల, మత, స్త్రీ-పురుష, భాషా విభేదాలను పక్కనపెట్టి ప్రాంతం మాత్రమే ఏకైక ప్రమేయంగా చర్చించడం కొన్ని అపసవ్యతలకు దారి తీస్తుంది. అభివృద్ధి గురించిన చర్చ అంతిమంగా విలువలచర్చగా మారిపోయే అవకాశం ఉంది. ఇక వర్గవిభజన దృష్టితో చూస్తే అభివృద్ధి చెందిందని చెప్పబడే ప్రాంతంలో ఉత్పత్తి సాధనాల యాజమాన్యంలో లోతయిన అసమానతలు, పేదరికం, వెనుకబాటుతనం, కుల విభజన దృష్టితో చూస్తే అభివృద్ధి చెందిన ప్రాంతాలలో వెనుకబడిన సామాజిక వివక్షాధోరణులు కనబడతాయి. వెనుకబడిన ప్రాంతంగా చెప్పబడే చోట కొద్దిమందికైనా విపరీతమైన సంపద ఉండడం, అత్యాధునిక సౌకర్యాలు అందుబాటులో ఉండడం కనబడతాయి.

ఈ నేపథ్యంలో ప్రాంతీయ అసమానత అనే భావన సులభంగా, సరళరేఖలా వివరించగలిగేది కాదు. అది కేవలం భావోద్వేగపూరితమైన రాజకీయ నినాదం కాదు. అది జాతీయోత్పత్తి, పెరుగుదల రేటు వంటి అంకెలగారడీ కూడ కాదు. అది ప్రజల నిత్యజీవిత అనుభవంలోని ఒక కఠోరవాస్తవం. దాన్ని ప్రజలు తాము కోల్పోయిన విద్యా, ఉద్యోగ, నిధుల, అభివృద్ధి అవకాశాల పూర్వరంగంలో ప్రతిక్షణమూ గుర్తించగలుగుతారు. ఆ వాస్తవానికి ఎన్ని ముఖాలు, ఎన్ని కోణాలు ఉన్నాయో అర్థం చేసుకోకుండా దాన్ని వాడడం తాత్కాలిక ఉద్రేకాలు రెచ్చగొట్టడానికో, ఒక వాస్తవాన్ని మరుగుపర్చడానికో పనికి రావచ్చుగాని సామాజిక విశ్లేషణకూ, సామాజిక అభివృద్ధికీ, సామాజిక ఉద్యమ నిర్మాణానికీ ఉపయోగపడదు.

ప్రాంతీయ అనమానతలు అనే మాటకన్న ముందు చర్చించవలసినవి అభివృద్ధి, వెనుకబాటుతనం లేదా అభివృద్ధి రాహిత్యం (ఎక్కువ మంది సామాజిక శాస్త్రవేత్తలు దీన్ని అల్పాభివృద్ధి అని కూడ అంటున్నారు) మొదలయిన భావనలు.

అభివృద్ధిని ఏవో కొన్ని ప్రమాణాలతో కొలవడం, ఆ ప్రమాణాల ప్రాతిపదిక మీద ఒక దేశాన్ని గాని, ఒక ప్రాంతాన్ని గాని, సమూహాన్ని గాని, కుటుంబాన్ని గాని, మనిషినిగాని అభివృద్ధికి అటో ఇటో తేల్చివేయడం ఆనవాయితీగా వస్తున్నది. తలసరి ఆదాయం అనే ప్రమాణం చాలాకాలం అటువంటి ప్రమాణంగా రాజ్యం చేసింది. మొత్తం ఆదాయాన్ని మొత్తం జనాభాతో విభజించి సగటు తలసరి ఆదాయాన్ని కనిపెట్టి దాన్ని బట్టి అభివృద్ధి స్థాయిని నిర్ణయించడంలో చాలా సమస్యలున్నాయి. ఆ ప్రమాణం కేవలం సగటు కాబట్టి తీవ్రమయిన అసమానతలు అందులో పరిగణనలోకి రావు. అందువల్ల అతికొద్దిమంది ఎక్కడో శిఖరంపైన ఉండి, చాలమంది అట్టడుగున లోయలో ఉన్నప్పటికీ సగటు అంకె ప్రశంసనీయంగానే కనబడుతుంది. ఈ తలసరి ఆదాయభావనకే కొనసాగింపుగా తలసరి ఖర్చు, తలసరి వినియోగం, తలసరి సంపద వగైరా భావనలుకూడ వచ్చాయిగాని వాటి విశ్వసనీయత కూడ అంతంతమాత్రమే.

అందువల్ల తలసరి ఆదాయం/జాతీయోత్పత్తి భావన స్థానంలో దారిద్ర్యరేఖ భావన వచ్చి, దారిద్ర్యరేఖను గుర్తించడానికి ప్రమాణాలు ఏమిటనే విషయంలో చాల చర్చ జరిగింది. దారిద్ర్యాన్ని సాపేక్షికంగా గుర్తించాలా, అలా గుర్తించినప్పుడు ఒక ప్రమాణానికి ప్రాతిపదికలేమిటి, లేక దారిద్ర్యాన్ని ఏ పోలికలూ లేకుండా పరమంగా గుర్తించాలా అని చర్చ జరిగింది. ఆ క్రమంలో మానవాభివృద్ధి సూచిక అనే భావనను యుఎన్‌డిపి ముందుకు తెచ్చింది. ఆయుప్రమాణం, విద్యావకాశాలు, తలసరి జాతీయోత్పత్తి అనే మూడు రంగాల సూచికల ఆధారంగా వేరువేరు జీవనప్రమాణాలను కలిపి మానవాభివృద్ధి సూచిక తయారయింది. అమర్త్య సేన్ ఈ భావనను ఇంకా విస్తరించి, అసలు అభివృద్ధిని సాపేక్షికంగా చూడకూడదని, మానవులందరికీ సమానంగా వర్తించే కనీస "సామర్థ్యాలు" కొన్ని ఉన్నాయని. ఆ "సామర్థ్యాలు" సంపాదించడానికి కొన్ని "అత్యవసరమయిన హక్కులు" ఉంటాయని అవి ఉన్నాయా లేదా అనేదాన్ని బట్టి, అభివృద్ధి – వెనుకబాటుతనంలను గుర్తించాలని అన్నారు.

ఒక దేశంగాని, ప్రాంతంగాని, సమూహంగాని, కుటుంబంగాని, వ్యక్తిగాని అభివృద్ధి చెందారనో, వెనుకబడి ఉన్నారనో అనేటప్పుడు ఈ సంక్లిష్టతనంతా పరిగణనలోకి తీసుకోవాలి. అభివృద్ధి–వెనుకబాటుతనం భావనల గురించి స్పష్టత ఉండాలి. అసమానత గురించి, అభివృద్ధి గురించి, అభివృద్ధి రాహిత్యం గురించి మాట్లాడేటప్పుడు దానిలో కొంత సాపేక్షికతా ఉంటుంది. కొంత నిరపేక్షతా ఉంటుంది. మరొక

ప్రాంతంతో, సమూహంతో, కుటుంబంతో, వ్యక్తితో పోల్చిచూసి, వారికి ఉన్నవేవో వీరికి లేవు అనడం సాపేక్షిక ఆలోచన. ఇక్కడ కూడ మళ్లీ ఒక సమస్య ఉంది. వారికి ఉన్నవి అభివృద్ధి సూచికలుగా ఎవరు నిర్వచించారు? అభివృద్ధి అంటే ఏమిటి? మానవానుభవంలో ఎక్కువ వస్తువులుండడమే అభివృద్ధి అవుతుందా వంటి అనేక మౌలిక ప్రశ్నలు తలెత్తుతాయి. ఉదాహరణకు, మనుగడ సాగించడానికి రెండుపూటలా తిండి, ప్రకృతి వైపరీత్యాలనుంచి రక్షించుకోవడానికి వంటినిండా బట్ట, ఆశ్రయానికి తగిన గృహవసతి, సృజనాత్మకవికాసం కొరకు చదువు, ఊహలను సాకారంచేసే శ్రమ అవకాశాలు, మానవ సంబంధాలను ఆహ్లాదకరం చేసే వినోద విజ్ఞాన అవసరాలు తీరే అవకాశాలు ఉంటే అభివృద్ధి సాధించినట్టేనని కొందరు అనుకోవచ్చు. విద్యుత్తు, సొంత కారు, టెలిఫోను, బంగళా, ఆడంబరమయిన దుస్తులు, విలాసవంతమయిన జీవనశైలి లాంటివే అభివృద్ధి అని కొందరు అనుకోవచ్చు. ఇవి దృక్పథానికి సంబంధించిన ప్రశ్నలు. వీటిలోకి పోతే, ఇప్పుడు అభివృద్ధి అనుకుంటున్నదాన్ని అసలు అభివృద్ధి అనవచ్చునా, దాన్ని కేవలం పోలికలతో, తులనాత్మకంగా కొలవవచ్చునా అనే మౌలిక ప్రశ్నలు వస్తాయి.

అలాకాక, మనిషి మనిషిగా బతకడానికి, సమాజం సమాజంగా మనగలగడానికి అవసరమయిన భౌతిక, మానసిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక వ్యక్తిత్వం సృజనాత్మకంగా పరిఢవిల్లడానికి అందవలసినవన్నీ అందుతున్నాయా అనే ప్రశ్న అభివృద్ధిని పరమంగా, నిరపేక్షంగా నిర్వచిస్తుంది.

ఈ చర్చను నిర్దిష్ట స్థల కాలాలలోకి తెస్తే, ఒకే పాలనా ప్రాంతంలో అభివృద్ధి స్థాయిలలో కొట్టవచ్చినట్టు కనబడే తేడాలున్నప్పుడు, అవి తీవ్రమైన అసమానతలుగా వ్యక్తమవుతున్నప్పుడు, అవి ఘర్షణలకు కూడ కారణమవుతునప్పుడు, వాటిని ఎట్లా అర్థం చేసుకోవాలి అనేది ఒక సామాజిక, రాజకీయార్థిక, సాంస్కృతిక, తాత్విక ప్రశ్న. అది కేవలం అంకెలతో తేల్చగలిగినది కాదు. ఇప్పటివరకూ జరిగిన చర్చలో, చాలావరకు అసమానత ఉందనేవాళ్లు, లేదనేవాళ్లు కూడ ఈ అంకెలగారడీలో పడి అంతకన్న ముఖ్యమయిన విషయాలను విస్మరిస్తున్నారు. పోలికలు, కొలతలు వచ్చినప్పుడు అంకెలు తప్పవనేమాట నిజమేగాని, అంకెలద్వారా మాత్రమే జీవన వాస్తవికతను సమగ్రంగా పట్టుకోవడం సాధ్యంకాదు. కనుక అభివృద్ధి గురించి జరిగిన చర్చ ఎట్లా క్రమక్రమంగా పరిమాణాత్మక కొలతలతోపాటు, గుణాత్మక ప్రాతిపదికలను తనలో భాగం చేసుకుందో, ప్రాంతీయ అసమానత, వెనుకబాటుతనం, అభివృద్ధి రాహిత్యం భావనలు కూడ జీవనప్రమాణ గణాంకాలతోపాటు, చరిత్ర, బాధితుల అభిప్రాయలు, సామాజిక స్థాయి, సాంస్కృతిక కోణాలు, పాలనా నిర్ణయాలు వంటి సులభంగా అంకెలలోకి కుదించలేని గుణాత్మక ప్రాతిపదికలను కూడ పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది.

ప్రాంతీయ అసమానతల గురించి చర్చ వచ్చినప్పుడల్లా, నైసర్గిక అంశాల గురించి, ప్రకృతి సహజమైన అంశాల గురించి ప్రస్తావించడం ఒక ఆనవాయితీ అయింది. అభివృద్ధి చెందిన ప్రాంతాలలో ప్రకృతి వనరులు ఎక్కువగా ఉన్నట్టు, వెనుకబడిన ప్రాంతాలలో కేవలం వనరుల లేమి వల్లనే వెనుకబాటుతనం ఉన్నట్టు వాదించడం జరుగుతోంది. కాని వాస్తవంగా ఇది ఒక పచ్చి అబద్ధం. ఇప్పుడు వెనుకబడిన ప్రాంతాలుగా గుర్తించబడుతున్న ఏ ప్రాంతంలోనయినా భూసారం, వ్యవసాయయోగ్యమయిన భూవిస్తీర్ణం, వర్షపాతం, జలవనరులు, అటవీ విస్తీర్ణం, లభ్యమయే ఖనిజ సంపద, మానవ వనరులు వంటి ఏ సూచిక తీసుకున్నా, ఆ ప్రాంతం వెనుకబాటుతనానికి కారణం కనిపించదు. వీటిలో ఏదో ఒక సూచికలో ఆ ప్రాంతం వెనుకబడి ఉన్నట్టు కనిపించినా, ఇతర సూచికలన్నీ అభివృద్ధికి అనుకూలంగానే ఉంటాయి. కనుక వెనుకబాటుతనానికి సహజ, నైసర్గిక కారణాలుంటాయనే వాదనలో కొంత వాస్తవంతోపాటు కొంత కుతర్కం కూడ ఉంది. గత మూడు శతాబ్దాలలో పశ్చిమ యూరప్ దేశాలు, గత శతాబ్దంగా అమెరికా అభివృద్ధి చెందడానికిగాని, అనేక లాటిన్ అమెరికన్, ఆఫ్రికన్, ఆసియన్ దేశాలు వెనుకబడిపోవడానికి గాని సహజ, నైసర్గిక కారణాలు ఎంతమాత్రమూ లేవు. అట్లాగే ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ లో వెనుకబాటుతనానికి గురవుతున్న తెలంగాణ, రాయలసీమ, పల్నాడు, కళింగాంధ్ర ప్రాంతాలలో ఈ సూచికలన్నీ, కోస్తాంధ్ర ప్రాంతంకన్న మెరుగుగానే ఉంటాయి. ఒక్క వర్షపాతం విషయంలో రాయలసీమ వెనుకబడి ఉందిగాని, మిగిలిన కారణాలరీత్యా మొత్తం వెనుకబాటుకు అవకాశం లేదు.

వెనుకబాటుతనం చర్చలో చారిత్రక కారణాలకు కొంత పాత్ర ఉంటుంది. చారిత్రకంగా ఒక ప్రాంతంలో అభివృద్ధి కార్యక్రమాలు ముందే మొదలయినందువల్ల, ఆ ప్రాంతానికి ఎల్లప్పుడూ కొంత పైచేయి ఉంటుంది. మిగిలిన ప్రాంతాలు ఆ ప్రాంతాన్ని అందుకోవడానికి ప్రత్యేక శ్రద్ధ, కృషి అవసరమవుతాయి. ప్రపంచ ప్రఖ్యాత ఆర్థికవేత్త, నోబెల్ బహుమతి గ్రహీత గున్నార్ మిర్డాల్ ఈ విషయంలో చాలా చర్చ చేశారు. అయితే ఈ వాదనకు కూడ పరిమితులున్నాయి. అభివృద్ధినీ, వెనుకబాటుతనాన్నీ కేవలం చారిత్రక కారణాలతోనే వివరించడం అన్ని సమయాల్లోనూ సాధ్యం కాదు. తెలంగాణ విషయంలో ఈ చారిత్రక కారణాల వాదనలో కొంత నిజం ఉండవచ్చుగాని, బ్రిటిష్ పాలన కిందికి 1766లో చేరిన కళింగాంధ్ర, ఉత్తర సర్కారులకూ, 1787లో చేరిన గుంటూరు సర్కారుకూ, 1799లో చేరిన రాయలసీమకూ అభివృద్ధిలో ఇంతగా అసమానతలు ఎందుకు ఉన్నాయో ఈ చారిత్రక కారణాల వాదన వివరించజాలదు.

కాకపోతే, ఈ చారిత్రక కారణాలవల్ల, ఒక ప్రాంతంలో ఇతర ప్రాంతాలకన్న కొంత ముందుగా నీటి పారుదల సౌకర్యాలు, పాలనా కేంద్రాలుగా, వ్యాపార కేంద్రాలుగా పట్టణీకరణ, పారిశ్రామికీకరణ, విద్యా, వైద్య, రవాణా సౌకర్యాలు ఏర్పడే అవకాశం ఉంటుంది. వ్యక్తుల జీవనశైలిలోనూ, మొత్తంగా సామాజిక జీవితంలోనూ కొత్త గాలులువీచి కొత్త అవకాశాలు ఏర్పడతాయి. ఆ కొత్త అవకాశాలలో కొన్ని అభివృద్ధికరమయినవి కావచ్చు. కొన్ని సామాజికంగా హానికరమయినవీ కావచ్చు.

ఆధునిక కాలంలో వెనుకబాటుతనంలో కొంత ఎక్కువ పాత్ర వహించేవి పాలనా పరమైన, విధానపరమైన నిర్ణయాలు. ఒకే పాలనా ప్రాంతంలో ఒక భాగానికి ఆధునిక సౌకర్యాలు అందడానికీ, మరొక

భాగానికి అవి అందకపోవడానికి ఈ పాలనాపరమైన నిర్ణయాలే కారణమవుతాయి. ముందుగా అదనపు సౌకర్యాలు, ముఖ్యంగా విద్యావకాశాలు, అదనపు రాబడికి దారితీసే వ్యవసాయ, పారిశ్రామిక అవకాశాలు పొందిన ప్రాంతాలనుంచి కొత్త విద్యాధిక, ప్రాబల్య వర్గాలు పుట్టుకొస్తాయి. ఆ ప్రాంతాలమీద లాంఛనంగా ఎవరి అధికారం ఉన్నప్పటికీ, ఈ వర్గాల మాట చెల్లుబాటు అయ్యే పరిస్థితి ఉంటుంది. పాలనా నిర్ణయాలమీద ఈ వర్గాలకు అదుపు ఉంటుంది. ప్రపంచ చరిత్రలో ఈ విషయం అనేకసార్లు రుజువు అయింది. ఆ ప్రాబల్యవర్గాలు పాలనా నిర్ణయాలలో జోక్యంచేసుకుంటూ, నిధులకేటాయింపులలో, పథకాల రూపకల్పనలో, అమలులో, ఉద్యోగకల్పనలో, అభివృద్ధి ప్రణాళికల తయారీలో తమ ప్రాంతానికి ఎక్కువ వాటా అందేటట్టు చూస్తారు. అప్పటికే చారిత్రక కారణాలవల్ల ఏర్పడిన అసమానతలు ఈ పాలనాపరమయిన నిర్ణయాలవల్ల మరింత తీవ్రంగా మారిపోతాయి.

అయితే ఇక్కడ గుర్తించవలసిన విషయమేమంటే పాలకవర్గాలలోని ఒక ప్రాబల్యవర్గం చేసే ఈ పని వల్ల ఆ ప్రాంతం మొత్తానికీ ఏదో గొప్ప మేలు జరిగిపోతుందనుకుంటే పొరపాటు. ఈ విధాన నిర్ణయలన్నీ కూడ ఒక ఆశ్రిత వర్గానికి ప్రత్యక్షంగా మేలుచేసేవే తప్ప, ఆ ప్రాంతంలోని ప్రజలందరికీ మేలుచేసేవి కానక్కరలేదు. ఆ ప్రాంతంలోకి నిధులు, పెట్టుబడులు, అవకాశాలు ప్రవహించినందువల్ల పరోక్షంగా ప్రజలకు కూడ కొంత మేలు జరగపచ్చు. సామ్రాజ్యవాదం దేశాలలోని పేదవర్గాలకూ, కార్మికవర్గాలకూ కూడ వలసదోపిడీ ఫలితంలో కొంత అందిన అనుభవంతో దీన్ని పోల్చవచ్చు. ఆంధ్రప్రదేశ్ చరిత్రలో కూడ ఇటువంటి విధాన నిర్ణయాలున్నాయి. ప్రభుత్వాధికారంలో ఏ ప్రాంతంవారున్నారనేదానితో సంబంధం లేకుండా ఈ రకమైన పాలనావిధానాలు కొనసాగాయి. కొనసాగుతున్నాయి.

ప్రాంతీయ అసమానతలకు మూలంలోనూ, వాటి విస్తృతిలోనూ కొన్ని సాంఘిక కారణాలు కూడ ఉండే అవకాశం ఉంది. సంక్లిష్ట చారిత్రక, సామాజిక కారణాలవల్ల, సమాజంలో కొన్నికొన్ని వర్గాలకు, కులాలకు ఆధిపత్య స్వభావం, వ్యాపార స్వభావం, విస్తరణ స్వభావం అలవడగా, మరి కొన్ని వర్గాలకు, కులాలకు అధీన స్వభావం, సహజమానవ సంబంధాలను గౌరవించే వ్యాపారేతర స్వభావం, ఉన్నచోటనే ఉండిపోయే ముడుచుకుపోయే స్వభావం ఏర్పడి ఉన్నాయి. ఆ విభిన్న స్వభావాలకూ ప్రాంతీయతకూ మధ్య ఒక్కొక్కసారి సమాంతరత కూడ ఉండవచ్చు. ఆ నేపథ్యంలో ఆ కులాలకు కొత్తగా అవకాశాలో, అవకాశాల నిరాకరణో జరిగితే అవి ప్రాంతీయ అసమానతలను, వాటికి సమాంతరంగా సామాజిక అసమానతలను పెంచుతాయి.

ప్రాంతీయ అసమానతలకు సాంస్కృతిక కారణాలు, కోణాలు కూడ ఉంటాయి. ఒకే పాలనా ప్రాంతంలో, ముఖ్యంగా ఆ పాలనా ప్రాంతం ప్రజాభిప్రాయంతో సంబంధం లేకుండా ఏర్పడినప్పుడు భిన్న భాషల, సంస్కృతుల, జీవన విధానాల సమూహాలు సహజీవనం చేయవలసివస్తుంది. తమ సాంస్కృతిక అస్తిత్వాల భిన్నత్వం వల్ల ఆ సమూహాలు అసమానంగా ఉన్నామని, తమకు న్యాయంగా దక్కవలసిన వాటా దక్కడంలేదని భావిస్తాయి. ఒక సమూహం ఆధిపత్యం చలాయిస్తుండగా, మరొక సమూహం తిరగబడడానికి ప్రయత్నిస్తుంది. ఇంగ్లండ్ – ఐర్లాండ్, పశ్చిమ పాకిస్తాన్ – తూర్పు పాకిస్తాన్ ల నుంచి, బీహార్ – జార్ఖండ్ దాకా ప్రపంచంలో ఎన్నోచోట్ల ఘర్షణ రూపం ధరించిన ఈ సాంస్కృతిక అసమానత ఆంధ్రప్రదేశ్ లో కూడ గణనీయంగా ఉంది. ఒక ప్రాంతపు ఆభిజాత్యంగా, దురహంకారంగా, మరొక ప్రాంతపు అవమానంగా, ధిక్కారంగా కూడ అది వ్యక్తమవుతున్నది.

వీటన్నిటికితోడు, పెట్టుబడిదారీ అభివృద్ధికి అసమాభివృద్ధి ఒక నియమంగా ఉంటుది. పెట్టుబడిదారీ అభివృద్ధి దానిలో పాల్గొంటున్న అన్ని ప్రాంతాల, అన్ని రంగాల, అందరు వ్యక్తుల సమానాభివృద్ధికీ, అందరికీ వారివారి కృషికి తగిన ఫలితం ఇవ్వడానికీ అనుకూలంగా ఉండదు. ఈ పెట్టుబడిదారీ అసమానాభివృద్ధి గురించి ఒక శతాబ్దానికి పైగా జరిగిన విస్తృతమైన చర్చను ఇక్కడ పునరుక్తం చేయనక్కరలేదు. కాని ఆంధ్రప్రదేశ్ లాంటి అర్థభూస్వామ్య, అర్థవలస సమాజంలో ఈ అసమాభివృద్ధి జరిగిందని చెప్పడానికీ, భూస్వామ్య, కుల అంతరాల సమాజం వల్ల ఆ అసమాభివృద్ధి మరింత వికృతంగా ఉందని చెప్పడానికీ చాల ఆధారాలున్నాయి. భూస్వామ్య గతం కొన్ని రంగాల అభివృద్ధికి ఆటంకంగా నిలవడం ఒక ఎత్తయితే, 1956 తర్వాత జరిగిన మార్పులలో, భూస్వామ్యానికి, అర్థవలస పాలక విధానాలకూ కుదిరిన మిలాఖత్తు అసమానాభివృద్ధి అఖాతాన్ని ఇంకా పెంచింది. గత రెండు దశాబ్దాలుగా ఆంధ్రప్రదేశ్ ఆర్థికవ్యవస్థకూ, అంతర్జాతీయ ద్రవ్య, వాణిజ్య సంస్థలకూ, బహుళజాతి సంస్థలకూ పెరుగుతున్న అనుబంధంవల్ల ఈ అసమాభివృద్ధి ఇంకా వైరుధ్యస్వభావాన్ని సంతరించుకుంది.

ఈ అసమానతల వాదనలు ఇంకా జటిలంచేసినవి గత యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ చరిత్రలో అమలుకాని అనేక హామీలు, పాలక విధానాలలో స్పష్టంగా కొన్ని ప్రాంతాల పట్ల వ్యక్తమైన ఆదరణ, మరికొన్ని ప్రాంతాలపట్ల వ్యక్తమైన నిరాదరణ, నిధుల కెటాయింపులో, విద్యా, ఉద్యోగ, నీటిపారుదల రంగాలలో వ్యక్తమైన వివక్ష – తత్ఫలితంగా కొన్ని ప్రాంతాల ప్రజలలో కలిగిన దోపిడీ, పీడన భావనలు. శ్రీబాగ్ ఒడంబడిక (1937) నాటినుంచీ వ్యక్తమైన రాయలసీమ ఆకాంక్షలను తీర్చడం, అనుమానాలను నివృత్తి చేయడం జరగలేదు. రాయలసీమ ఇప్పటికీ కరవుసీమగానే ఉండిపోయింది. తెలంగాణ విషయంలో ఫజల్ అలీ కమిషన్ (1955), పెద్దమనుషుల ఒప్పందం (1956), ఆరు సూత్రాల పథకం (1973), రాష్ట్రపతి ఉత్తర్వులు (1975), జి.వో. 610 (1985) మొదలైన ఎన్నో రక్షణలను అమలు చేయకపోవడంతో ప్రత్యేక రాష్ట్రం మాత్రమే పరిష్కారమనే స్థితి తలెత్తింది. కళింగాంధ్రలో, పల్నాడులో జలవనరులకూ, అటవీ సంపదకూ, ఖనిజవనరులకూ కొదవ లేనప్పటికీ తగిన అభివృద్ధి జరగలేదు.

ఈ నేపథ్యంలో మొత్తంగా ప్రాంతీయ అసమానత అనే భావన గురించి, ప్రత్యేకంగా ఆంధ్రప్రదేశ్‌లో అమలయిన అసమానతల గురించి, ఇంకా నిర్దిష్టంగా తెలంగాణ, రాయలసీమ, కళింగాంధ్ర, పల్నాడు ప్రాంతాల గురించి లోతయిన, చరిత్రతో, గణాంకాలతో అనుసంధానం చేసిన, సోదాహరణ పూర్వకమైన చర్చ జరగవలసి ఉంది. ◆

# వెనుకబాటుతనం ప్రజల పాపం కానే కాదు..

- దుప్పల రవికుమార్

ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం మరోసారి బలంగా వచ్చిన సందర్భంలో రాష్ట్ర ప్రజలందరూ తమ తమ ప్రాంతాలు అభివృద్ధి క్రమంలో ఎక్కడ ఉన్నాయో బేరీజు వేసుకోవడం చాలా సహజమైన విషయం. ఆంధ్రప్రదేశ్‌లో భౌగోళికంగా నాలుగు ప్రాంతాలను స్పష్టంగా గుర్తించుకుంటే అందులో ఉత్తరాన కొసకు ఉన్నది ఉత్తరాంధ్ర. చరిత్ర, రాజకీయ, భూగోళ శాస్త్రాలపై అవగాహన లేకుండా ఉత్తరాంధ్రను కోస్తా ప్రాంతంగా ముడిపెట్టి పిలవడం అనాదిగా వస్తోంది. అసలు ఆ మాటకొస్తే ఇక్కడి ప్రజలకు ఉత్తరాంధ్ర అని పిలిపించుకోవడమే ఇష్టం లేదు. తమను తాము కళింగాంధ్రులమని పిలుచుకోవడానికే వారు ఎక్కువ మక్కువ చూపిస్తారు. మరి ఈ ప్రాంతం ఎలా వుండేది. ఇప్పుడెలా వున్నదీ, ఎందుకిలా వుందీ, మరెలా వుండాలి, దానికోసం ఏం చేస్తే బాగుంటుంది అన్న విషయాలను చర్చించడం ఈ వ్యాసం ఉద్దేశం.

తూర్పున బంగాళాఖాతం, దానికి కొంచెం ఇవతల కొలువుతీరిన తూర్పు కనుమల పర్వత శ్రేణి, దానికటువాలి దట్టంగా వున్న అటవీ ప్రాంతం దోసిట పట్టినట్టుగా వుంటుంది. సాగరానికి పర్వత శ్రేణికీ నడుమ అరచేతి మాదిరిగా మైదాన ప్రాంతంలో అలరారే ఉత్తరాంధ్ర అనబడే కళింగాంధ్ర చరిత్ర సమస్తమూ నిత్య పోరాటమే. నిరంతర సంఘర్షణమే.

ఇటు మహానది నుంచి అటు గోదావరి నది వరకూ నడుమ కళింగ రాజ్యంగా ఎప్పుడూ కయ్యాలకు ఎదురునిలిచి తన ఉనికిని, సంస్కృతిని చెక్కు చెదరనీయకుండా కాపాడుకుంటూ నిలిచిన నేల. ఆర్యుల దాడులకు పూర్వమే చక్కటి గణ వ్యవస్థను ఏర్పాటు చేసుకుని వారిని పాదమైనా మోపకుండా నిలువరించి వారి సుప్రసిద్ధమైన మనుస్మృతిలో స్థానం సంపాదించుకోలేక పోయిన గడ్డ. పురాణాలలో తప్ప ప్రాచీన భారత చరిత్రలో తన 'తలపొగరు' వల్ల రికార్డులకు ఎక్కలేకపోయిన భూమి. అశోకుడి దాడికి ముందే ప్రపంచ దేశాలకు నాగరికత నేర్పడానికి బయలుదేరిన గొప్ప స్వాప్నికులు, సాహసికులున్న చోటు. క్రీస్తు పూర్వం 261లో అశోకుడు కళింగాన్ని ఎలాగైన దోచుకోవాలని తలచి, తెగబడి పెద్ద ఎత్తున సైన్యంతో దాడిచేసి కళింగ యుద్ధంలో లక్షన్నర మంది ప్రజలను కిరాతకంగా పొట్టన పెట్టుకోవడమే కాకుండా, మరో లక్షన్నర మంది జనాలను బానిసలుగా మగధ రాజ్యానికి పట్టుకుపోతే ఏమి చేయలేక నిస్సహాయంగా మిగిలిన కళింగాంధ్ర.

అక్కడ నుంచి మొదలయిన దాడుల పరంపరలో తన ఉనికిని, చరిత్రను, సంస్కృతిని, సర్వస్వాన్ని కోల్పోయి క్షతగాత్ర గానం ఆలపిస్తున్న నేల. జమీందారులు, ఇనాందారులు, ముస్లింలు, గజపతి దొరలు, బ్రిటీషు దొరలు ఇలా ఒకరి తరువాత ఒకరు ఈ నేలను, నీటిని, సహజ వనరులను, ధనాన్ని, ధాన్యాన్ని, జనాన్ని, జనస్వామ్యాన్ని హీనంగా దోచుకున్నారు. పెనుగులాడి, పోరాడి, సంఘర్షించి, సమరశంఖం పూరించి, ప్రతిఘటించి, ప్రతీఘాత శక్తులతో కలబడి, తనను తాను ఎప్పటికప్పుడు పునరుత్తేజితం చేసుకుంటూ ముందుకు సాగిన విప్లవ శక్తి. స్వతంత్ర భారతంలో సైతం తన చరిత్రా సంస్కృతుల పట్ల ప్రేమ అవగాహన లేని బడుద్దాయ రాజకీయ వినాయకుల పాలనలో నానా ఆగచాట్లు పడుతున్న బేల. స్వార్థమే తప్ప విశాల, సుదీర్ఘ ప్రయోజనాలను వూహించను కూడా వూహించలేని దివాంధుల వల్ల వెనుకబాటు మాత్రమే కాక నిర్లక్ష్యానికి మోడుబారడానికి గురైన బీడు భూమి (వేస్ట్ లాండ్).

ఉత్తరాంధ్ర ప్రజలు తమ రాష్ట్రంలోనే, తమ దేశంలోనే, తమ ప్రపంచంలోనే కాందిశీకులుగా బతకవలసిన దుస్థితికి కారణమెవరని నిందించాలి?

ఉత్తరాంధ్రకున్న ప్రత్యేక భౌగోళిక పరిస్థితుల దృష్ట్యా (అంటే మూడొంతులలో ఒక వంతు సాగరతీరం, ఒక వంతు మైదాన ప్రాంతం, ఒక వంతు ఏజెన్సీ ప్రాంతం వుండడం) ప్రత్యేక రాష్ట్రం హోదా కోరుకోవడానికి అంత బాగుండదని కొందరంటారు. వారెందుకలా అన్నా ఇక్కడి ప్రజలు మాత్రం ప్రత్యేక హోదా కోరుకోవట్లేదు. వారికిప్పుడు పోరాడడానికి బలం లేదు, సత్తువ లేదు. ఆలోచన పంచడానికి, పెంచడానికి తగిన మానసిక స్థితి లేదు. వారి ప్రధాన సమస్య ఈ పూట గడవడమెలా అనేది? 'ఆరొందల పది' కాదు అందులో కనీసం సగం అంటే మూడొందలైదైనా రాజ్యం నుంచో రాజ్యాంగం నుంచో పెద్దపెద్ద మనుషుల నుంచో సహకారమూ లేదు. ఉన్న రాజకీయ నాయకులంతా పిగ్మీల కంటే కురచనైపోయాక వారికిప్పుడు మరి అడియాసలు, అత్యాశలే కాదు అసలు ఆశలే లేక - మీరే ప్రాంతానికి వెళ్లి చూడండి - విజయవాడ, గుంటూరు, హైదరాబాద్, సూరత్, లక్నో, ముంబాయి, ఢిల్లి, అండమాన్... ఎక్కడికైనా సరే... ఉత్తరాంధ్రుడు గోనె సంచీలో తన సమస్తాన్ని... అంటే ఆకలిని, ఆలుబిడ్డలను, ఆత్మగౌరవాన్ని అన్నింటిని... చుట్టి - పొట్ట చేతపట్టుకుని కనిపిస్తాడు.

కళింగాంధ్రను ఖారవేలుడు, కనిష్కులు, మౌర్యులు, తూర్పుగాంగులు, గజపతులు, కుతుబ్‌షాహీలు పాలించిన తరువాతే బ్రిటిష్ పాలకులు పాలించారు. బ్రిటిష్ పాలకుల పాలన చాలా ఘోరమనుకుంటే అంతకంటే నీచమైన ఎత్తుగడలతో అణిచివేసింది గజపతులే. ఒకడి మీదకి మరొకడిని ఎగదీసి చివరికి ఇద్దరినీ మింగేసే నీచపు ఎత్తుగడలను చరిత్రలో ఆదినుంచి ఎదిరిస్తూ నిలిజిన ఈ ఉజ్వల ఉద్యమ సీమ తరువాత అదే ఎత్తుగడకు (గజపతుల స్వార్థం వల్ల) చిత్తయి, తుదకు 'బ్రిటిష్ సూర్యుడి' చీకటి పాలన కిందకు పోయింది. స్వయంపోషక గ్రామీణ వ్యవస్థ విధ్వంసమై, అన్ని చేతి వృత్తుల పరిశ్రమలు కుప్పకూలిపోయి, వలస కార్మికులుగా మారి చెల్లాచెదురై పోవలసిన దుస్థితికి దిగజారింది. (గజపతుల అజ్ఞానం ఇప్పటికీ ఎంతలా కొనసాగుతుందంటే ఆ వంశపు ప్రస్తుత అవశేషాలు కూడా తాము ప్రజా ప్రతినిధులమని మరిచిపోయి, ప్రజల సంగతి ఆ కుటుంబ కుల దేవతలెరుగు, వారి మాతృ భాష కూడా వారికి ఒంటపట్టని దుస్థితిలోనే

కునారిల్లుతున్నారు.) 1822లోనే బొబ్బిలిలో తొలి జమీందారీ వ్యతిరేక రైతాంగ పోరాటం జరిగింది. దానిని ఉక్కుపాదంతో అణిచివేశారు. సరే ఇదంతా గతమనుకున్నా, మా మూతులు వాసన చూడమనడం భావ్యం కాదనుకున్నా, స్వతంత్ర భారతంలో ఈ ప్రాంత పరిస్థితి మరింత దిగజారింది. శ్రీబాగ్ ఒప్పందం, పెద్ద మనుషుల ఒప్పందం, ఆంధ్రప్రదేశ్ అవతరణ ఒకటొకటిగా జరిగిపోయాయి. అందులో ఉత్తరాంధ్ర ఊసే కాదు, ప్రమేయమూ లేదు. అక్కడక్కడా గొంతు లచ్చన్న వున్నా లేనట్టే అయింది. భాషను బట్టి కళింగాంధ్రను కోత కోసినప్పుడు ఒరిస్సాకు పోయింది పోగా, ఇప్పుడున్న శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం మిగిలాయి. దానిని మరో పేరుతో పిలవకుండా కోస్తాలో కలిపేశారు. ఉత్తరాంధ్ర ప్రాంతంగా ఆంధ్రప్రదేశ్ పరిపాలకుల దృష్టిలో వున్న ఈ మూడు జిల్లాలు ఎలా చూసినా కోస్తా జిల్లాల్లో భాగం కాలేవు.

ఉత్తరాంధ్రకు ఏం తక్కువ? నిజమే! అత్యద్భుత ప్రకృతి అమరిక - సముద్ర తీర ప్రాంతం, మైదాన ప్రాంతం. అటవీ ప్రాంతాల కలగలుపైన త్రివేణీ సంగమం. ఎంతమందికి దక్కెను అంత అదృష్టం! సహజ వనరుల మాటో - ప్రపంచంలో చాలా దేశాల వారి కన్నుకుట్టేసేటట్టు అలరారే సహజ సంపద ఉత్తరాంధ్ర సొంతం. ఖనిజాలు, ధాతువులు మాత్రమే కాక సారవంతమైన మట్టి, వీటన్నింటికి మించి భారతదేశంలోనే ఎవరికీ లేనన్ని పదిహేనుకు మించి నదులు ఈ ఉత్తరాంధ్ర గుండా ప్రవహిస్తుంటాయి. కానీ కరువు కరాళనృత్యం చేస్తూనే వుంది. అసలు పంట పండించకుండానే ప్రకృతి మీద ఆధారపడి బతకగలిగినంత అటవీ సంపద, మత్స్య సంపద. కానీ ప్రతి ఏడూ లక్షలాది మంది రైతాంగం తల్లులను, పిల్లలను తమతమ పల్లెల్లో విడిచి పెట్టేసి జానెడు పొట్ట నింపుకోవడం కోసం బతకడం తెలీని దద్దమ్మాల్లా వలసలు పోతున్నారు. ఉత్తరాంధ్ర బంగారంతో సమానమైన ఆంధ్రప్రదేశ్‌లో భాగమైనా, సంపన్న కోస్తాలో భాగమైన సమాంతర అభివృద్ధి నోచుకోకపోవడం ప్రపంచంలో ఎనిమిదో వింత. ఎందుకంటారు?

వంశధార, నాగావళి, శారద, చంపావతి, జంఝావతి, తాండవ, బహుదా, గోస్తనీ, సువర్ణముఖి, గోముఖీ, మాచ్‌ఖండ్, వరహా, మహేంద్రతనయ, బొడ్డేరు, మేఘాద్రిగెడ్డ, కుంభకోటగెడ్డ, సరుగుడుగెడ్డ, రైవాడ... ఇందులో కొన్ని పూర్తి స్థాయి నదులు కాకపోవచ్చు. చాలా చిన్న ప్రాంతంమేర పారే నదీ పాయలు కావచ్చు. కానీ నీటిని తిన్నగా తీసుకుపోయి దగ్గరలోని మరో నదిలోనో, సముద్రంలోనో కలుపుతున్నాయే. నీటిని మోసుకుపోతున్నాయే. ఏడాదిలో కొంత కాలమైన నీటిని తెచ్చి ఈ నేలను సస్యశ్యామలం చేయగల సమర్థత గలవే అయినా ఎందుకో ఇక్కడ ఇన్ని కరువులు కాటకాలు. భారతదేశంలో ప్రధాన వృత్తి వ్యవసాయమైనట్లే ఇక్కడ ఉత్తరాంధ్రలోను వ్యవసాయమే ప్రజల ప్రధాన వృత్తి. అయితే ఎవరికీ లేనన్ని నదులున్నా వీరికి నది నీరు ప్రధాన ఆధారం కాదు. చెరువులు, కుంటలు ఆధారంగా వ్యవసాయం చేయడానికి అలవాటు పడ్డారు. ఎక్కడిలాగే ఇక్కడ కూడా మెట్ట భూములు వర్షం ఆధారంగా సాగుబడి అవుతాయి. పల్లపు భూమి ప్రభుత్వం సరఫరా చేసిన వంశధార, జంఝావతి, నాగవళి తదితర నదులపాయలు కాలువలు ద్వారా వచ్చిన సాగునీటి ఆధారంగా సాగుబడి అవుతోంది. ఆధునిక సాంకేతిక విప్లవం వల్ల వ్యవసాయ రంగంలో వచ్చిన అన్ని మార్పుల్లో ఏ చిన్న మార్పు కూడా ఇక్కడి రైతుకు అంట(ద)నంత అజ్ఞానం అనే వ్యాధి నిరోధక శక్తి ప్రబలంగా వుంది. ఆ అజ్ఞానం చదువు లేకపోవడం వల్ల వచ్చింది. చదువుకునే స్థోమత లేకపోవడం వల్ల ఏర్పడింది. నా చిన్ని బొజ్జకు శ్రీరామరక్ష అనుకుంటూ ఎవరికి వారు చిన్న చిన్న కమతాల్లో వ్యవసాయం చెయ్యడం వల్ల వచ్చిన చిక్కు అది. ఎక్కడి రైతు అక్కడే రైతు కూలీగా మారడం వల్ల వచ్చిన అవస్థ ఇది. ప్రతి యేడు నీరులేక పంటలు గిట్టుబాటవ్వని ప్రాంతాలకు, మెట్ట ప్రాంతాల్లో నీటి పారుదల సదుపాయాలకు స్వతంత్రం వచ్చి ఆరు దశాబ్దాలు గడిచినా ప్రభుత్వ పాలకుల వద్ద ఎటువంటి నిర్దిష్టమైన పథకాలు లేకపోవడం విషాద భారతపు వాస్తవం. ఇన్నాళ్లూ పంటలు పండకపోవడమే కరువని అనుకునే వాళ్లకు అమర్త్య సేన్ మాటలు కళ్లు తెరిపిస్తాయి. పంటలు నిండా పండిన దశలో, ప్రభుత్వ గోదాములు నిండి వున్న దశలో కూడా రైతులకు, ప్రజలకు కొనుగోలు చేసే శక్తి లేకపోతే గనక వారు కరువు కోరల్లో చిక్కుకున్నట్టే. "పంటలు లేకపోయినా, పండకపోయినా ప్రజల ఉత్పత్తి శక్తిని, కొనుగోలు శక్తిని పెంచే విధానాలు వుంటే కరువుకు పరిష్కారం దొరుకుతుంది. అందుకే కరువు వచ్చినప్పుడే తాత్కాలిక ఉపశమనం కోసం పెనుగులాడకుండా శాశ్వత నివారణోపాయాల కోసం సమగ్రమైన విధానాన్ని ప్రభుత్వం రూపొందించాలి" అని అమర్త్య సేన్ జాన్ దెరెజ్ తో కలిసి నచ్చచెప్పినది. కానీ ఇవ్వాళ పాలకులకు కరువు ఒక చోటినుంచి మరో చోటికి వలస కూలీలను చవగ్గా సరఫరా చేసే సాధనమైనంది. తక్కువ ఖర్చుతో ఎక్కువ అభివృద్ధి సాధించే మార్గమైంది. అందుకే మన పాలగుమ్మి సాయినాథ్ 'మంచి కరువును అంతా ప్రేమిస్తార'ని అంటారు.

కనీసం కొంత వరకైనా రైతులకు సాగునీటికి, తాగునీటికి అక్కరకొస్తాయకున్న వంశధార, జంఝావతి తదితర ప్రాజెక్టులకు పట్టిన గ్రహణాలు విడిచేది లేదు. విడిపించేది లేదు. ఒరిస్సా పాలకులు పాకిస్తాన్ వారేమి కాదు కదా! మన ఏలికలకు చిత్తశుద్ధి లేనప్పుడు ఎంతటి ప్రాజెక్టులైనా ఇలానే దొంగ నిద్ర పోతాయి. అదేమి చిత్రమో ప్రాజెక్టుల కథలన్నీ దేశం మొత్తం మీద ఇంచిమించుగా ఒక్కలాగే వుంటాయి. మన ప్రభువులకు, మన ప్రభువులు చేస్తున్న అభివృద్ధి ఇంతింత కళ్లేసుకు చూస్తూ లొట్టలేస్తున్న కోర్టులకు నిర్వాసితుల పునరావాసం, బాధితుల నష్టపరిహారం అన్న మామూలు మాటలు కూడా అర్థం కావడం లేదంటే ఏమనుకోవాలో తెలియదు. పంటలు పండక, పండే పంటకు గిట్టుబాటు దొరకక, వ్యవసాయం చేయడం, బతుకు బతకడం కన్నా కష్టమైన పరిస్థితుల్లో 'కయ్యానికి కాలుదువ్వివ' రైతు ఎందుకో ఆత్మహత్యలు పూనుకోకుండా వలసలకు పాల్పడుతున్నారు. బతుకు నావ ఈద్చాలనే మొండి ధైర్యం ఎక్కడనుంచి వస్తోందో! దీనిని సామాజిక, ఆర్థికవేత్తల కన్నా చరిత్రకారులే చక్కగా విశ్లేషించగలరేమో. కోస్తా ప్రాంతం నుంచి దిగబడుతున్న రైతులు కూడా ఉత్తరాంధ్ర రైతుల పాలిట సైమన్లు, గజపతులు, అశోకులే అవుతున్నారు. విచిత్రమైన వడ్డీ లెక్కలకు కళ్లు బైర్లుకమ్మి ఏమి చేయలేక తన పొలాన్ని అప్పు ఇచ్చినవాడికే అమ్ముకుని అక్కడే రైతుకూలీగా మారుతున్న ఉత్తరాంధ్ర రైతన్న వెతలను వర్ణించడం ఎవరి తరం? దీనికితోడు ఆ పంట పొలంలోనైన రియల్ ఎస్టేట్ పేరుతో

ఆ కూలీలను వ్యవసాయం కూడా చేయనివ్వకపోతే గతి ఏమిటి? తనకు కొన్ని వేల రూపాయలు అప్పిచ్చి కారుచవకగా దొబ్బిన పోలమే రియల్ ఎస్టేట్‌గా మారి గోదావరి జిల్లా రైతుకు కొన్ని లక్షల రూపాయలు అర్జించి పెడుతుంటే ఆక్రోశించని రైతుంటాడా? ఆక్రోశం సంగతి సరే, రైతుకు పనేది? తిండేది? వలసే మిగిలేది.

రాష్ట్రంలో అత్యధిక వర్షపాతం నమోదయ్యేది ఉత్తరాంధ్రలోనే, కాగా అందులో విజయనగరం మరీ టాప్. దేశంలో మొదటి మాంగనీస్ నిల్వలు కనుగొన్నది శ్రీకాకుళం జిల్లాలోనే. మొదటి అప్‌టైట్ ఖనిజం కనిపించింది విశాఖపట్నం జిల్లా కాశీపట్టణం లోనే... ఇలాంటి 'మొదటి' పిచ్చిని మేం సాధారణంగా 'చంద్రబాబు పిచ్చి' అని పిలుస్తాం. ఇది కూడా డబ్బు పిచ్చి, పుస్తకాల పిచ్చిలాంటిదే. (అంకెలు గారిడీ చేస్తాయని తెలిసి కూడా ఇదే గారడిని నమ్ముతూ, నమ్మిస్తూ చంద్రబాబు తెలుగు ప్రజలకు చేసిన ద్రోహమేమిటంటే ఈ నెంబర్ల రేసులో పడి విద్యార్థుల జీవితాలతో చెలగాటమాడి తద్వారా దేశ మానవ వనరులను నిర్వీర్యం చేయడమే. ఫలితాల శాతాలు గొప్పగా వుండాలని చెప్పి పదో తరగతిలోనూ, ఇంటర్‌లోనూ వేలంవెర్రిగా, రకరకాల దారుల్లో, ఉత్తీర్ణులైన విద్యార్థులతో పడుతున్న అవస్థ ఎలాంటిదో మీకు తెలిసిన ఎవరైనా డిగ్రీ లేదా ఇంజనీరింగ్ కాలేజీ లెక్చరర్లను అడగండి. కన్నీరు మున్నీరువుతూ ఎలాంటి పిల్లకాయులు బదులనుంచి బయటపటుతున్నారో ఏకరువు పెడతారు. ఈ నెంబర్ల రంధి అనే చంద్ర పిచ్చి పక్కనపెడితే వజ్రాలతో సమానమైన రంగురాళ్లు, గ్రాఫైట్, సూన్నపురాయి, బాక్సైట్, గ్రానైట్, అభ్రకం, క్వార్ట్జ్, తదితర లోహ ధాతువులు పుష్కలంగా ఉత్తరాంధ్రలో లభిస్తున్నాయి. కానీ అవేవి అటు ప్రభుత్వానికి గాని, ఇటు ఉత్తరాంధ్ర వాసులకు గానీ ఎలాంటి లాభాన్నీ ఈయడం లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే దోపిడీకి గురవుతున్నాయి. ఖనిజ సంపదంతా గుత్తసొత్తుగా ఇటు కోస్తా జిల్లా ప్రజలు, అటు ఇతర రాష్ట్రాల ప్రజలు దోచుకుంటున్నారు.

తీరప్రాంత విషయానికొస్తే రాష్ట్రానికున్న మొత్తం తీర ప్రాంతంలో దగ్గరదగ్గర తీరప్రాంత సౌకర్య వుండి కూడా ప్రయోజనం లేకపోతోంది. తీర ప్రాంతంలో రెండు రకాలుగా జీవనాధారం సాగుతుంది. సాగర జీవుల వేట ద్వారానూ తీర ప్రాంతంలో పండే కొబ్బరి, అల్లం తదితర పంటల ద్వారానూ జీవిక పొందవచ్చు. ప్రభుత్వం పూనుకోకపోవడం వల్ల ఇరవై ఒకటో శతాబ్దంలో కూడా మత్స్యకారుడు తన పురాతన పద్ధతిలోనే ప్రాణాలకు తెగించి మరీ కడలి తరగల నడుమనున్న అపార జీవరాశిని అందుకోలేక, మానుకోలేక అవస్థలు పెడుతున్నాడు. తీరా కష్టపడి తెచ్చే జీవజాలం తీరానికి చేర్చేసరికి సౌకర్యాల లేమివల్ల, దళారీల చేతిలో పడి చివరికి చిరిగిపోయిన వలే మిగులుతోంది. పేదరికం - అవిద్య - అజ్ఞానం - అనారోగ్యం - అప్పుల విషవలయంలో పడి నలిగిపోతున్నాడు. ఫిషింగ్ హార్బర్లు, షిపింగ్ హార్బర్లు, మర బోట్లు మొదలైన పదాలు ఎన్నికల ముందు రాజకీయ నాయకుల వాగ్దానాలే తప్పితే ఉత్తరాంధ్ర తీరవాసులకు ఒరిగిందేమి లేదు. పంజాబ్‌లో రైతులు దళారీల ప్రమేయం లేకుండా ఇంటర్‌నెట్‌లో చూసుకుని తమ పంటల అమ్మకాలు సాగిస్తారట. ఎంత మంచి సంగతి! విశాఖపట్నానికి ఆనుకునివున్న భీమునిపట్నం తీరప్రాంతంలో అసంఖ్యాకంగా వున్న ఫిషరీస్, ఆక్వా సంస్థలన్నీ కోస్తా ప్రాంత వాసులవే. అందులో ఉత్తరాంధ్రులకు వాటా లేదు. శ్రమ స్థానికులది. లాభాలు స్థానికేతరులవి. ఆ మాటకొస్తే విశాఖపట్నంలో వున్న అన్ని మధ్యతరహా, భారీ పరిశ్రమల యాజమానులు స్థానికేతరులే. పైగా ఇతర రాష్ట్రాలవారే. విశాఖలో ఏ పరిశ్రమలో కూడా స్థానికులు యాజమాన్యంలో లేరు. కనీసం మిడిల్ మేనేజ్‌మెంట్‌లో కూడా స్థానికులకు భాగస్వామ్యం లేదు. ఆ వాటాను ఆంధ్ర రాష్ట్రంలో ఈ మూడు మినహా మిగిలిన జిల్లాల వారు దక్కించుకున్నారు. ఆ కంపెనీలలో లేబర్ మాత్రం ఉత్తరాంధ్ర వాసులే. మత్స్యకారులకు తగినంత శాస్త్రీయ పరిజ్ఞానం కల్పించకపోతే వారి అజ్ఞానం పోదు. అజ్ఞానం పోకపోతే నాగరికత అబ్బదు: నాగరికత అబ్బనిదే దోపిడీని ఎదుర్కోలేరు. దోపిడీని ఎదుర్కోనిదే వారి బతుకులు బాగుపడడం కల్ల.

మొత్తం రాష్ట్రంలో వున్న 42 లక్షల మంది ఆదివాసులలో ఉత్తరాంధ్ర మూడు జిల్లాలలోనూ భాగమైన ఏజన్సీ ప్రాంతంలో నాలుగోవంతు నివాసముంటున్నారు. ఇక్కడి ప్రజల జీవనాధారం అటవీ ఫలసాయంతో పాటు పోడు వ్యవసాయం. హైమన్‌డార్ఫ్ ఒప్పుకుంటాడో లేదో తెలియదు గాని ఈ దేశంలో నిజమైన భారతీయులు ఎవరైనా వుంటే స్వతంత్రానికి పూర్వం వరకు వున్న ఆదివాసులే. స్వచ్ఛత, సంస్కారానికి మారుపేరైన గిరిజనులను సంస్కరించడానికి బయలుదేరిన స్వాతంత్ర్యానంతర ప్రభువులు వారిని ఎన్ని అగచాట్లకు గురి చేస్తున్నారో ఎవరికెరుక? మైదాన ప్రాంతాలలో దోపిడీ క్రీడలో విఫలమైన(!) కొందరు ఏజెన్సీ ప్రాంతానికి చేరారు. వీరిని నిలువరించడానికే బ్రిటిష్ పాలకులు 1916లో ఒక శాసనం చేశారు. 1958లో అదే ఆంధ్రప్రదేశ్ ఏజెన్సీ అంతటికీ వర్తించే చట్టం అయింది. 1970లో అదే చట్టాన్ని రేగ్యూలేషన్ 1/70 ద్వారా సవరించి మరింత పటిష్టం చేశారు. దీని ప్రకారం ఏజెన్సీ ప్రాంతపు భూమి గిరిజేనతరులు ఎవరూ కొనడానికి, వాడుకోవడానికి వీల్లేదు. అక్కడి భూమి, ఫలసాయం, ఖనిజ నిధులు అన్నీ పూర్తిగా గిరిజనుల సొంతం. ఈ స్ఫూర్తికి తూట్లు పొడుస్తూ వారిని కొల్లగొడుతున్నది, వారి సంపదను దోచుకుంటున్నది మైదాన వాసులే. వారికి సంపూర్ణ సహకారం అందిస్తున్నది రాజ్యం. దీనిని వ్యతిరేకిస్తూ 1958 నుంచి సుమారు దశాబ్దమున్నర కాలంపాటు వీరోచితంగా సాగిన గిరిజన రైతాంగ సాయుధ పోరాటం మరొక్కమారు క్రీస్తు పూర్వం కళింగాంధ్ర వాసుల పోరాట స్ఫూర్తిని గుర్తుకు తెస్తుంది. వందలాది మంది యువకులు అమరులై, వేలాది కుటుంబాలు తమ సర్వస్వాన్ని కోల్పోయి, లక్షలాది రూపాయల విలువ చేసే ఆస్తులు, సంపద బూడిదయ్యాక 'ఐటిడిఏ' అన్న అందమైన అబద్ధం వెలిసింది.

అయినా దోపిడీ యథాతథంగా కొనసాగుతోంది. అటవీ ప్రాంతపు సహజ సంపదను ప్రభుత్వం వెలికితీసి దాని ద్వారా వచ్చిన సొమ్మును గిరిజనాభివృద్ధికి వినియోగించడం సహజ న్యాయం. దురదృష్టవశాత్తూ దోపిడీదారులతో ప్రభుత్వం కుమ్మక్కై దోపిడీ యథాతథంగా కొనసాగుతోంది. మూడు చట్టాల ద్వారా గిరిజనుల సహజ హక్కుల్ని, వనరులను సంరక్షించడానికి రాజ్యాంగం ప్రయత్నిస్తోంది. మొదటిది ఎల్‌టిఆర్ చట్టం. దీనిని వన్ ఆఫ్ సెవంటీ అంటారు. ఇది ఏ రూపంలోనూ భూమి బదలాయింపును జరగకుండా అడ్డుతుంది.

రెండవది గనులు, ఖనిజాలు (నియంత్రణ, అభివృద్ధి) చట్టం (ఎంఎంఆర్‌డి చట్టం). స్థానికేతరులు కాకుండా ప్రభుత్వం మాత్రం కొన్ని అభివృద్ధి పనులు చేయడానికి అవకాశం ఇస్తుంది. మూడవది అటవీ (సంరక్షణ) చట్టం. కేంద్ర ప్రభుత్వ సాయంతో కొన్ని రక్షణలు పొందడానికి వీలుంది. గానీ రాష్ట్ర ప్రభుత్వాలు తమ స్వార్థానికి, స్వప్రయోజనాలకు తక్కువ లాభాలకే అటవీ సంపదను ప్రైవేట్ సంస్థలకు ధారాదత్తం చేయాలని ఎప్పుడూ 1/70 చట్టం పై రగడ చేస్తూనే వున్నాయి. ఇందుకు తాజా ఉదాహరణ విశాఖ ఏజెన్సీలో బాక్సైట్ నిక్షేపాలను వెలికితీసే పని ప్రైవేట్ రంగానికి అప్పజెప్పాలనుకోవడం. నిరంతర నిఘాతో, ప్రజా చైతన్యంతో మాత్రమే ఇంతవరకూ ఈ కుటిల యత్నాలన్నింటిని తిప్పి కొట్టగలుగుతున్నాం. ఒక్క ఏజెన్సీ ప్రాంతమనే కాదు కృష్ణా, గోదావరి జిల్లాల రైతులనుంచి మైక్రో ఫైనాన్స్ ఉచ్చుల్లో చిక్కుకుని మైదాన ప్రాంత వాసుల పొలాలకు కూడా తీవ్ర ప్రమాదం వాటిల్లుతున్నోందున ఈ వన్ ఆఫ్ సెవెంటీ చట్టాన్ని ఉత్తరాంధ్ర ప్రాంతమంతా అమలు చేయడమే సబబు.

ఉత్తరాంధ్రలో ఈ మూడు ప్రత్యేక భౌగోళిక ప్రాంతాల సహజ వనరులతో పాటు కుటీర పరిశ్రమలు కూడా దేశమంతా ఎంతో ప్రసిద్ధి పొందాయి. పొందూరు ఖద్దరు, విజయనగరం మగ్గం శరవేగంతో దూసుకొచ్చిన 'అభివృద్ధి' ధాటికి తట్టుకోలేక, కుప్పకూలిపోయాయి. తమిళనాడులో కో-ఆప్టెక్స్ పట్టు చీరల నేతగాళ్లు ఆది ఆంధ్ర మగ్గపు పనివారనబడే ఉత్తరాంధ్రులే. జనుము కర్రమీద ఉండే గోధుమ వర్ణపు నూగు జనపనారతో ఇక్కడి చేనేత కార్మికులు చేయని వస్తువేదైనా ఉందా అంటే అది అన్నమే. అన్నం తప్ప అన్ని రకాల జనపనార, గోగునార వస్తువులను సృష్టించారు. ఆకలి మిగుల్చుకున్నారు. దీనంతటికీ కారణం ఇక్కడి రాజకీయ నాయకత్వమే. తమ ప్రాంత ప్రయోజనాల కోసం వారు ఒక ప్రజాస్వామిక లాబీగా ఏర్పడి ప్రభుత్వాలపై వత్తిడి తెచ్చి పనులు చేయించుకునేంత తెలివి కొరవడడమే. తమ తమ నియోజకవర్గాల్లో పిల్ల పట్టేంత బస్ షెల్టర్లు కట్టి (అవీ ప్రజల సొమ్ముతోనే) తాటికాయంత అక్షరాలతో తమ పేర్లు రాయించుకుంటే తాము చిరస్థాయిగా వుండిపోతామనే భ్రమల్లో బతికే రాజకీయ నాయకులు ఉత్తరాంధ్రకే సొంతం. ఒక తెగ ప్రజల మీద క్రైమ్ ట్రైబ్ చట్టం ఉంటే నెహ్రూకు చెప్పి అది ఎత్తివేయించి, మద్రాసు ప్రభుత్వంతో పోరాడి ఆంధ్ర విశ్వ కళాపరిషత్తును తెప్పించిన అన్నెపు పరశురాం పాత్రో, వంశధారకు, ఆముదాలవలస సుగర్స్‌కు కృషి చేసిన బొడ్డేపల్లి రాజగోపాల రావు వంటి ప్రముఖులను ఉత్తరాంధ్ర అనుక్షణం స్మరిస్తుంది.

ఉత్తరాంధ్రలో పల్లెలు నిర్మానుష్యంగా తయారవుతున్నాయి. ఈ రాష్ట్రంలో, ఈ దేశంలో ఎక్కడ చూసినా రిక్షా కార్మికులుగా, భవన నిర్మాణ కార్మికులుగా, క్వారీ కార్మికులుగా, రోడ్డుపని కార్మికులుగా కాందిశీకుల తరహా జీవనం సాగిస్తున్న ఉత్తరాంధ్ర ప్రజానీకపు దుస్థితికి సరైన రాజకీయ నాయకత్వం, దిశా నిర్దేశం కొరవడడమే కారణం. యావద్భారతాన్ని ఆలోచనలో పడేసిన ఉద్యమ నాయకులు అల్లూరి, వెంపటాపు, ఆదిభట్ల, మార్పు ఇంకా అలాంటి వందలాది దేశభక్తులు మళ్లీ పునరుద్భవించడానికి వీలు లేని సామాజిక పరిస్థితుల్లో వున్నాం. సమాజం మొత్తం ఎందుకు పరిగెడుతుందో, ఎటు పరిగెడుతుందో తెలీనితనంతో చాలా వేగంగా పరిగెడుతోంది. నిలకడగా ఆగి వెనక్కి తిరిగి చూసుకుంటేనే భవిష్యత్ కార్యాచరణ ప్రణాళిక దొరికేది. అభివృద్ధి క్రమంపైన ఆధిపత్యం సంపాదించుకున్న కొన్ని శక్తులు లేదా వర్గాలు ఇతర ప్రాంతలపైన రాజకీయంగా, సామాజికంగా, సాంస్కృతికంగా ఆధిపత్యం చెలాయిస్తున్నాయి. ఆ ప్రాంతాలన్నీ వెనకబాటుతనంలో కునారిల్లుతున్నాయి. దీంతో ఆ ప్రాంతాల ప్రజలు జీవితంలోని అన్ని రంగాల్లోనూ తనుకున్న హక్కులను అనుభవించలేక పోతున్నారు. ఆ దోపిడీ మరింత విశృంఖలమై ప్రజల జీవితాలలో ఆశాజ్యోతి కృష్ణ వస్తువైనప్పుడు, తమ మనుగడ ప్రశ్నార్థకంగా మారినప్పుడు, తమ ఉనికిని కాపాడుకుని, అస్తిత్వాన్ని నిలబెట్టుకోవలనే తపనతో, దోపిడీదారుల కబంధ హస్తాలనుంచి రక్షణ పొందే కాంక్ష అత్యంత తీవ్రంగా ఉద్యమరూపంలో బయటపడుతుంది. అంతదాకా వేచి చూడాల్సిందే మరి! ◆

# అభివృద్ధికి నోచుకోని పౌరుషాల పలనాడు

- సి.ఎచ్.ఎల్.ఎన్. మూర్తి

చందోలు మహారాజు తన కుమార్తె విద్యాలదేవికి పసుపు కుంకుమల కింద పలనాటి సీమను యిచ్చి అనుగురాజుతో వివాహం జరిపించాడు. అనుగురాజు మరణానంతరం కుమారులైన మలిదేవరాజులు, నలగామరాజులు మధ్య రాజ్య విభజన జరిగి మాచర్ల రాజధానిగా మలిదేవులు, గురజాల రాజధానిగా నలగామరాజు పరిపాలన సాగించారు. భారతంలోని అక్షలేఖనం, జూదం వలెనే కోడి పందాల పోరులో నలగాముని మంత్రిణి నాయకి నాగమ్మ కుయుక్తులతో రాజ్యాన్ని పోగొట్టుకొని మలిదేవులు మంత్రి బ్రహ్మనాయునితో మేడపి ప్రాంతంలో 7 సంవత్సరాలు అరణ్యవాసం చేసారు. అరణ్యవాసం ముగిసిన పిమ్మట తమరాజ్యం తమకు అప్పగించమని నలగామునికి రాయబారాలు పంపి విఫలమైనారు. ఇరు రాజుల మధ్య పలనాటి యుద్ధం అనివార్యమైంది. క్రి.శ. 1176-82ల మధ్య జరిగిన ఈ యుద్ధానికి దక్షిణ భారతదేశంలోని రాజులందరూ ఏదో ఒక పక్షం వహించారు. కాకతీయ రాజు ప్రతాపరుద్రుడు నలగామునికి రెండువేల గుర్రాలను సహాయంగా పంపాడంటే ఈ యుద్ధం తీవ్రతను మనం అర్థం చేసుకోవచ్చు. కారంపూడి రణస్థలంగా జరిగిన ఈ యుద్ధంలో రక్తం ఏరులై పారింది. విజేతగా నిల్చిన బ్రహ్మనాయుడు రక్తపాత యుద్ధానికి చలించి రాజ్యాన్ని నాగమ్మకే వదిలివేసి, తపోదీక్షకు గుత్తికొండ బిలం చేరాడు. క్రమేణా పలనాడు రాజ్యం అంతరించింది. నలగామరాజుకు సన్నిహితుడైన కాకతీయ ప్రతాపరుద్రుడు పల్నాడును తన రాజ్యంలో కల్పుకున్నాడు. భారతానికి ఈ యుద్ధానికీ పోలికలుండటం వల్ల పలనాటి భారతంగా యిది ప్రాచుర్యం పొందింది.

మాచర్లకు దక్షిణంగా మార్కాపురం, శ్రీశైల పర్వాతాల వరకూ, గురజాలకు తూర్పున అమరావతి, బెల్లంకొండల వరకు, ఆగ్నేయంగా నర్సరావుపేట, నకరికల్లు హద్దులుగా కల్గిన ఆనాటి సువిశాల పలనాటి రాజ్యానికి, ఈనాటి పలనాడుకూ సంబంధమేలేదు. 1904లో బ్రిటీష్ వారి రాకతో పలనాడుకు ప్రాధాన్యత తగ్గటం ఆరంభమై నాటినుండి డెల్టా, మైదన ప్రాంతాల అభివృద్ధికి ప్రాధాన్యమిస్తూ వస్తున్నారు. గురజాల కేంద్రంగా పలనాడు తాలూకాగా మొదట గుర్తింపు లభించింది. తిరిగి 1956 భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు సందర్భంగా గురజాలతో పాటు మాచర్ల కూడా అసెంబ్లీ నియోజకవర్గంగా ఏర్పడింది. వీటితోపాటు ఇతర ప్రాంతాలైన వినుకొండ, దర్శి, మార్కాపురం, నర్సరాపు పేట నియోజక వర్గాలు. నర్సరావుపేట పార్లమెంటరీ డివిజన్ కింద ఉన్నాయి. నేటికీ నర్సరావుపేట రెవెన్యు డివిజన్ పల్నాడు డివిజన్‌గా పేర్కొంటున్నారు. ఈ డివిజన్ కింద ఉన్న ప్రాంతమంతా పాత పల్నాడు రాజ్యం కిందికే వస్తుంది. ఈ ప్రాంతంపై రాజకీయ ఆధిపత్యం కూడా నర్సరావుపేట కేంద్రంగానే కొనసాగుతున్నది. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని ప్రజల మన్నలను పొందిన కమ్యూనిస్టు నాయకులైన కోలాసుబ్బారెడ్డి (దాచేపల్లి), పులుపుల వెంకటశివయ్య (వినుకొండ), పూలసుబ్బయ్య (మార్కాపురం) 1951, 52 సాధారణ ఎన్నికల్లో శాసనసభకు తొలి ప్రజాప్రతినిధులుగా ఎన్నికయ్యారు. జిల్లాల పునర్విభజన సందర్భంగా అప్పటి నెల్లూరు జిల్లాలో ఉన్న కొంత భాగాన్ని, కర్నూలు, గుంటూరు జిల్లాల్లోని మరికొన్ని ప్రాంతాలను నేటి పల్నాడుతో కల్పి గుండ్లకమ్మ జిల్లాగా ఏర్పాటు చేయమని డిమాండ్ చేశారు. ఆనాటి కాంగ్రెస్ తరం, మైదాన ప్రాంత వత్తిడులకు తలఒగ్గి జాతీయ రహదారిలో ఉన్న ఒంగోలును జిల్లాగా ఏర్పాటు చేశారు. ఫలితంగా అనేక శతాబ్దాలు కొద్దిపాటి తేడాలతో ఒకే ఏలుబడిలో ఉంటూవస్తున్న, పల్నాడు ప్రాంతాలు ముక్కలై రెండు జిల్లాల పరిధిలోకి వెళ్లాయి. అటు ఒంగోలు కానీ ఇటు గుంటూరు కానీ ఈ ప్రాంతాలకు అందుబాటులో వుండదు. కొండలు, గుట్టలతో అటవీ ప్రాంతాలతో ఒకే యాస, భాష, సంబంధ బాంధవ్యాలు ఆహారపు అలవాట్లు వ్యవసాయ పద్ధతులు కల్గినట్టి ఈ ప్రాంతాన్ని మైదాన ప్రాంతాల వాళ్లు అన్ని రంగాలలో నిర్లక్ష్యం చేస్తూ వస్తున్నారు. జిల్లాలకు వచ్చే కేటాయింపులూ, నిధులూ, పరిశ్రమల అభివృద్ధీ, విద్యా వైద్య రంగాల సౌకర్యాలు అన్నీ గుంటూరు ఒంగోలు పట్టణాల చుట్టూ, డెల్టా ప్రాంతాల ప్రయోజనాల చుట్టూ తిరుగుతూ, రాజకీయ కుట్రల ఫలితంగా వెనుకబాటు తనంలోకి నెట్టిన ఈ ప్రాంతాన్ని వెక్కిరిస్తూ ఉన్నాయి. గుంటూరు ఒంగోలు పట్టణాల్లో వుండి పాలన సాగించే కలెక్టర్లకూ అధికారులకూ ఈ ప్రాంతాలను అవగాహన చేసుకోవటం సాధ్యంకాదు. ఈ ప్రాంతలన్నీ అధికారులకు పనిష్మెంట్ ఏరియాలుగా వ్యవరించబడ్తున్నాయి. పనిష్మెంట్పు క్రింద ఇక్కడికి వచ్చిన రెవెన్యు, పోలీస్ అధికారుల్లో చాలా మంది ఇక్కడి వెనుకబాటు తనాన్ని ఆసరా చేసుకొని నీతివంతమైన ప్రజాపాలనను అందించకుండా, స్వార్థ, లంచగొండి తనంతో ప్రజాధనాన్ని కొల్లగొట్టి కారుచౌకగా బినామీ పేర్లతో ఇక్కడి భూములనుకొని, పండ్లతోటలు, ఏస్టేట్లు నిర్మించుకొని వెళ్తున్నారు. కచ్చితమైన నిర్ధారణ చేస్తే ఎవరెవరి కింద ఎంత భూములు ఉన్నాయో బండారం బయటపడుతుంది. ఒకే ప్రాంతంగా వుంచి ప్రత్యేక జిల్లాగా ఏర్పాటు చేసినట్లయితే పాలనా సౌలభ్యం కలిగి ఈ ప్రాంతం ఎంతో కొంత అభివృద్ధి జరిగి వుండేది.

శ్రీనాథుడు తన చివరి ఘడియల్లో పలనాడులోనే జీవించాడు. ఈ సీమను గురించి తన చాటు పద్యాల్లో

చిన్న చిన్న రాళ్లు చిల్ల దేవుళ్లు
సజ్జజొన్న కూళ్లు సర్పంబులను తేళ్లు
నాగులేటి నీళ్లు నాపరాళ్లు
పలనాటి సీమ పల్లెటూళ్లు అని

ఆనాటి పలనాటి ముఖ చిత్రాన్ని అవిష్కరించాడు. నేటికీ ఈ ప్రాంతాల్లో సన్నబియ్యాన్ని పండుగకో పబ్బానికో వండుకోనే గ్రామాలు, తండాలు అనేకం ఉన్నాయి. జొన్నరొట్టెలూ, జొన్న కూళ్లే రోజువారీ ఆహారంగా భుజించే జీవితాలకు కొదువలేదు. అడవుల్లో సర్పాలు, తేళ్లు

మనుషులతో సహజీవనం చేస్తాయి. ఆకులు, చెట్ల బెరడ్లే మందు మాకుగా జీవితాలు వెళ్లదీసే వారి సంఖ్య చాలా ఎక్కువే వుంది. మూడు సిమెంట్ పరిశ్రమలు, మాచర్ల కేంద్రంగా సాధారణ ప్రజలు వాడే నాపరాళ్లు, పిడుగురాళ్ల కేంద్రంగా చిన్న తరహా సున్నం పరిశ్రమలూ, దాచేపల్లి పరిసరాల్లో ముగ్గు గనులు, బొల్లాపల్లి, మార్కాపురం కేంద్రాలుగా పలకల పరిశ్రమలూ 20 వేల మందికి జీవనోపాధిని కల్పిస్తున్నాయి. ఇవి తప్ప చెప్పుకోదగిన పరిశ్రమల అభివృద్ధి ఏమీ జరుగలేదు. అరకొర వసతులు కల్గిన వానాకాలపు విద్యాలయాలు, ఓపి సౌకర్యం తప్ప పడకలున్నా మందులూ, డాక్టర్లు, పరికరాలు లేని ఆసుపత్రులూ, దక్షిణ కాశీగా పేరుగల్గి శిధిలావస్థలో ఉన్న చేజెర్ల దేవాలయం, గుత్తికొండ బిలం పర్యాటకులకు వసతులు ఏమాత్రం లేని ఎత్తిపోతల జలపాతం. ఆధునిక దేవాలయంగా పేర్కొంటున్న సాగర్ ఆనకట్ట, ఎలాంటి అభివృద్ధికి నోచుకోక నేటి పల్నాటి ముఖచిత్రంగా మనకు దర్శనమిస్తాయి. కోట్ల రూపాయలు వెచ్చించి కోటప్పకొండను ఆధునీకరించారు గానీ యివేవీ పట్టించుకోలేదు.

**పలనాటి నీటి సౌకర్యాలు - భూగర్భజలాలు, వ్యవసాయం, భూమిసమస్య**

నందికొండ నాగార్జునసాగర్ వస్తుందంటే మొదటగా సంతోషించిన వాళ్లు పలనాటి వాసులే. కానీ వారి ఆశలు అడియాసలయ్యాయి. సాగర్ కుడి కాలువ నిర్మాణంలోనే కుట్ర జరిగి పాత పల్నాడులోని సగభాగం నీటి పారుదలకు అవకాశాలే లేకుండా పోయాయి. ఇక సాగర్ కుడి కాలువను రెండు జోన్లుగా విభజించారు. బెల్లంకొండ గుంటూరు బ్రాంచి కెనాల్స్‌ను అభివృద్ధి చెందిన గుంటూరు, నరసరావుపేట సత్తెనపల్లి ప్రాంతాలకు మొదటి జోన్‌గానూ, అద్దంకి, దర్శి, ఒంగోలు బ్రాంచి కెనాల్స్‌ను వెనుకబడిన ప్రాంతాలకు రెండవ జోన్‌గానూ విభజించారు. ఇవికాక కృష్ణాడెల్టా అయిన గుంటూరు, రేపల్లె, తెనాలి, బాపట్ల ప్రాంతాలకు ప్రకాశం బ్యారేజి నుండి కాలువల సదుపాయం వుంది. జిల్లాకు న్యాయంగా రావల్సిన వాటా 150 టిఎంసి లు కాగా 170 టిఎంసిల నీరు విడుదల అవుతున్నది. అందులో పల్నాడు ప్రాంతానికి కేటాయింపు కేవలం 20 టిఎంసిలు మాత్రమే. ఈ నీరు కూడా వర్షాలు బాగా కురిసి, సాగర్ జలాశయం నిండి వరద లొచ్చినప్పుడే సకాలంలో దక్కుతాయి. వర్షాభావ పరిస్థితుల్లో ముందుగా ప్రకాశం బ్యారేజి నుండి కృష్ణాడెల్టాకు, తరువాత జూన్ మాసంలోనే కుడికాలువ మొదటి జోన్ కింద అభివృద్ధి చెందిన ప్రాంతాలయిన గుంటూరు, నరసరావుపేట, సత్తెనపల్లి ప్రాంతాలకు వదిలిన తరువాత, సాగర్‌లో డెడ్ లెవల్ స్టోరేజ్‌కి మించి నిల్వలు ఉంటే రెండవ జోన్ కింద వున్న వెనుకబడ్డ ప్రాంతాలకు ఆగస్టు మాసంలో ఆందోళన చేస్తేగానీ నీరు వదలటం లేదు. వెనుకబడ్డ ప్రాంతాలైన కనిగిరి, పొదిలి, కందుకూరు, నెల్లూరు జిల్లా ఉదయగిరి ఏరియాల గుండా సోమశిల ప్రాజెక్ట్ వరకూ, కుడికాలువను పొడిగించడం ద్వారాను, గుండ్లకమ్మ రిజర్వాయర్ ఏర్పాటు ద్వారా గిద్దలూరు ప్రాంతాలకు, నీటిని సరఫరా చేయాలని, న్యాయమైన వాటాలు అందించాలని రూపకల్పన చేసినప్పటికీ ఆ దిశగా అభివృద్ధి జరగలేదు. కురిచేడు వద్ద కుడికాలువ 126 మైలు వరకు కూడ నీరు అందక ఈ ప్రాంతంలో నీటి యుద్ధాలు జరుగుతున్నాయి. ప్రభుత్వాలు ప్రతేయేటా ఆరుతడి పంటలు వేసుకోమని ఉచిత సలహాలు ఇస్తున్నాయి. ఇప్పుడే పరిస్థితి ఈ విధంగా ఉంటే ఇక పులిచింతల కట్టిన తర్వాత ఈ ప్రాంతమంతా ఎడారిగా మారిపోవడం ఖాయం. సాగర్ దిగువన నదిలోకి వచ్చి చేరే నీటి నిల్వలతో పులిచింతల నింపుతామని చెప్తున్నారు. కానీ దొడ్డిదోవన సాగర్ కుడి ఎడుమ ఆయకట్టు దారుల నోట్లో మట్టిగొట్టి, సాగర్ నిల్వలే పులిచింతలకు తీసుకొని పోదల్చుకున్నారనేది బహిరంగ రహస్యం. దిగువ నిల్వలు మాత్రమే రిజర్వ్ చేస్తామని చేప్పేవాళ్లు, మున్నేరు, పాలేరు నదులు వచ్చికల్సే విధంగా ప్రాజెక్టను రూపొందించాలిగానీ, వాటికి ఎగువభాగాన మొండిగా ఎందుకు నిర్మిస్తున్నట్టు? సాగర్ దిగువ నీళ్లే వాడుకుంటామని అంటున్నవాళ్లు పోతిరెడ్డిపాడు నీటి మళ్లింపు పథకం గురించి ఆందోళన చెందాల్సిన అవసరం ఏముంది? ఎటొచ్చీ అటు పోతిరెడ్డిపాడు పథకం వల్లగానీ, ఇటు పులిచింత వల్లగానీ తీవ్రంగా నష్టపోబోతున్నది నల్గొండ జిల్లా వాసులు, పలనాటి వాసులు, ఒంగోలు రైతులు. పులిచింతల వల్ల బేసిన్‌లో ఉన్న గ్రామాలతో పాటు సున్నపురాయి నిక్షేపాలు ముంపుకు గురి కాబడి తద్వారా పిడుగురాళ్ల సున్న పరిశ్రమ చతికలబడ్తుంది. సాగర్ కుడికాలువ రెండోజోన్ ఎండిపోతుంది. ఆయకట్టు పంటలకు అలవాటు పడ్డ భూములు, మెట్ట పంటలు కూడ పండక దుర్భర దారిద్ర్యం అనుభవించాల్సి వస్తుంది.

ఇక నీటి సౌకర్యాలు లేని ప్రాంతాల్లో వర్షాధారం మీదే ఆధారపడి వ్యవసాయం జరుగుతున్నది. ఈ మధ్య కాలంలో సాగర్ జలాశయం ఎండిపోవటంతో భూగర్భ జలాలు అడుగంటాయి. బోర్లు 400 అడుగులు దించినా నీరు పడటంలేదు. పైగా సాగర్ జలవిద్యుత్ కేంద్రం నెత్తిపైన వున్నా విద్యుత్ కోత సర్వసాధారణంగా మారింది. లోవోల్టేజీవల్ల మోటర్లు కాలిపోయి, అనేక అవస్థలుపడి చివరకు చేతికి దక్కిన పత్తి, మిర్చి, కంది వంటి పంటలు కోల్డ్ స్టోరేజ్ వంటి సౌకర్యాలు, మార్కెట్ సౌకర్యాలు ఈ ప్రాంతంలో లేక గుంటూరుకో, ఒంగోలుకో ఎత్తుకొని పోయి దళారుల చేతుల్లో పెట్టి, ముక్కిపోయిందనో, తడుపు తగిలిందనో, రంగు తగ్గిందనో వంకలు పెట్టి వాళ్లు నిర్ణయించిన గిట్టుబాటుకాని రేట్లకు అమ్ముకొని రైతులు అప్పుల పాలుకావలసి వస్తున్నది. అవమాన భారంతో ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. తెలుగుదేశం పాలనలో మే 2004 వరకూ జిల్లాలో 56 మంది ఆత్మహత్య చేసుకోగా, వైఎస్ పాలనలో ఇప్పటి వరకు 165 మంది చనిపోయారు. రెంటచింతలలో అప్పుల బాధలు తాళలేక కిడ్నీలు అమ్ముకున్నటువంటి రైతుల దయనీయగాథలు పలనాడులో మనకు కన్పిస్తాయి. కాలువ నీటి సౌకర్యాలు లేని మెట్ట రైతాంగం అనేక ఎత్తిపోతల పథకాల కోసం ఎన్నో ఏళ్ల తరబడి డిమాండ్ చేస్తున్నా వాటిని పట్టించుకున్న నాథుడే లేడు.

**దమ్మర్లగొంది, అనుపు, నాగులేరు, గొట్టిపాళ్ల, ఎత్తిపోతల పథకాలకై ప్రజల ఆందోళన**

దిగువ పల్నాడులోని మాచర్ల, వెల్దుర్తి, సిరిగిరిపాడు, బొల్లాపల్లి, పుల్లల చెరువు, దుర్గి మండలాల సాగునీటి కోసం నందికొండ ప్రాజెక్ట్ ప్రతిపాదన కన్నా ముందు దమ్మర్లగొంది, (వరకపూడిసెల) ప్రాజెక్టను ఖోస్లాకమిటీ సిఫారసు చేసింది. బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పటినుండి ప్రతి ఎన్నికల్లో రాజకీయ పార్టీలు వాగ్దానాలు చేసి

ఓట్లు దండుకొని పోవటమేగానీ, రెండు లక్షల ఎకరాల సాగుకు లాయకమైన ఈ ప్రాజెక్ట్‌ను ఎవరూ పట్టించుకోలేదు. 1995 ప్రాంతంలో వేల సంఖ్యలో రైతాంగం కదిలి పలనాటి కరువు వ్యతిరేక కమిటీ ఆధ్వర్యంలో పై ప్రాజెక్టుల కోసం ఆందోళనలు నిర్వహించారు. ఫలితంగా అప్పటి టిడిపి ఎంపి కోట సైదయ్య హయాంలో వజ్రాలపాడు తండా వద్ద ఒకలక్ష ఎకరాలకు ఉద్దేశించి దమ్మర్లగొంది ప్రాజెక్ట్‌కు శంఖుస్థాపన రాయి వేశారు. తర్వాత కాలంలో అటవీ శాఖ అనుమతులు లభించవని, జంతువులు, పిట్టలూ నీళ్లు తాగే జెర్రివాగు పథకం కింద 500 ఎకరాల సాగునీరందించేందుకు దాన్ని మార్చి వేశారు. అది కూడా అతీగతీ లేకుండా పోయింది. 2004 ఎన్నికలకు ముందు వైఎస్ ఈ ప్రాజెక్ట్ నిర్మించి తీరతానని తన జైత్రయాత్రలో మాచర్ల, వినుకొండలో పేర్కొన్నారు. ఎన్నికల అనంతరం స్థానికులు ఆందోళన చేస్తే మంత్రి కన్నా లక్ష్మీనారాయణ ఇంజనీర్లను వెంటబెట్టుకొని వరికపూడి సేల సందర్శించి 70 వేల ఎకరాలకు నీటిని అందిస్తామని ప్రకటించారు. పులిచింతల శంఖుస్థాపనకొచ్చి, తెనాలి బహిరంగసభలో ముఖ్యమంత్రి వైఎస్ పలనాటి వాసులను శాంతింప చేయటానికి 40వేల ఎకరాలకు ఈ ప్రాజెక్ట్‌ను రూపకల్పన చేస్తున్నామని చెప్పాడు. అధికారులు దాన్ని కూడా కుదించి 25వేల ఎకరాలకు మాత్రమే సాధ్యమని తేల్చి, చివరకు ఇప్పుడు ప్రాజెక్ట్ గురించే ఎవరూ మాట్లాడటంలేదు. అనుపు ఎత్తిపోతల పథకాన్ని 5000 ఎకరాల సాగుకు ఉద్దేశించి ప్రారంభోత్సవ రాయివేశారే గానీ పూర్తి చేస్తారనే నమ్మకం కుదరటంలేదు. గొట్టిపాళ్ల, నాగులేటి ఎత్తిపోతల పథకాలు చర్చల్లోనే లేవు. పులిచింతల ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా వచ్చే నిరసనలను చల్లార్చటానికే పలనాడులో ప్రారంభోత్సవ రాళ్లు వేశారుకానీ పలనాటి అభివృద్ధి పట్ల పాలకులకు చిత్తశుద్ధి లేదని అనుభవంలో తేలిపోయింది.

**భూమిసమస్య**

దున్నుకోవటానికి భూవసతి వుంటే తర్వాత నీటి గురించి ఆలోచించవచ్చు. ఈ ప్రాంతంలో అడవి, రెవెన్యు బంజర్లతోపాటు వ్యవసాయ యోగ్యమైన వేల ఎకరాల దేవాలయ భూములున్నాయి. అయితే ఇవన్నీ కూడా ఫ్యాక్షన్ నాయకుల చేతుల్లోనే ఉన్నాయి. బినామీ పేర్లతో లెక్క చూపించని మిగులు భూములు తేల్చిన వాళ్లేలేరు. 1985 నుండి క్రమంగా పలనాడులో వేళ్లూనుకున్న విప్లవోద్యమం ఈ పరిస్థితిలో కొంత మార్పులు తీసుకొచ్చింది. గుత్తికొండ, అడిగొప్పుల, జూలకల్లు, బెల్లంకొండ, మాచవరం, బొల్లాపల్లి, గుడిపాటి చెరువు వంటి ప్రాంతాల్లో వందల ఎకరాల భూమిని ఎర్రజెండాలు పాతి విప్లవ పార్టీల అండతో నిరుపేదలు స్వాధీనం చేసుకున్నారు. ప్రభుత్వం,పెత్తందార్ల నిర్లక్ష్యానికి గురైన పలనాటి ప్రాంతం, విప్లవోద్యమాలకు పెట్టని కోటగా మారటానికి ప్రధానంగా భూ అసమానతలు సాంఘిక వివక్ష, పెత్తందారి పోకడలు, ముఠా సంస్కృతి ప్రధాన కారణాలుగా చెప్పుకోవచ్చు. 2002 నుండి 2004 మధ్య తీవ్రమైన వర్షాభావం వల్ల పలనాట కరువు విలయతాండవం చేసింది. ప్రజల కోసం దిగుమతి అయిన పనికి ఆహారం పథకం - బియ్యం పక్కదారి పట్టాయి. అప్పటి పీపుల్స్ వార్ పార్టీ పిలుపుతో ఎక్కడికక్కడ వందల సంఖ్యలో గ్రామాలకు గ్రామాలు పాల్గొని దళారులు, కాంట్రాక్టర్లు పెత్తందార్లు దాచివుంచిన బియ్యం స్టాకులపై కరువు దాడులు జరిపి నిల్వలను స్వాధీనపరచుకొని ఆకలి తీర్చుకున్నారు. పథకాలను పక్కదారి పట్టించి దొంగలెక్కలతో నిల్వలు దాచేసిన ఘరానా కాంట్రాక్టర్లపై అప్పటి ప్రభుత్వం ఏరకమైన చర్యలు తీసుకోకుండా పలనాడు ప్రాంతమంతా అనేక వందలమందిపై కేసులు బనాయించి ఇప్పటికీ కోర్టుల చుట్టూ తిప్పుతున్నది. అభివృద్ధి చెందిన గుంటూరు జిల్లాలో కరువు దాడులేమిటనీ? అందరినీ ఆశ్చర్యపరుస్తూ ఆనాటి సంఘటనలు చర్చనీయాంశమైనవి. తద్వారా పలనాటి రైతు కూలీల దరిద్రం కరువు ప్రపంచానికి బహిర్గతమైనది.

**ఫ్యాక్షన్ సంస్కృతి**

పలనాటి యుద్ధకాలం నుండీ వారసత్వంగా సంక్రమించిన కక్షలూ కార్పణ్యాలూ ముఠాతగాదాలతో పలనాడు రక్తసిక్తమైన ఫ్యాక్షన్‌జోన్‌గా పేరుగాంచింది. ఫ్యాక్షన్ సంస్కృతి వున్నచోట ఏరకమైన హక్కులూ వుండవనేది అందరికీ తెల్సిందే. ఈ ప్రాంత రాజకీయాలను శాసిస్తున్న రాజకీయ పెత్తందార్లు, పలనాటి అభివృద్ధి గురించి ఏనాడు పట్టించుకొనక పోగా, "మేం పలనాటి పులులమంటే" "మేం పలనాటి పులులమని" పౌరుషాల పల్నాటి వాసులను రెచ్చగొట్టి, ఓట్లు దండుకొంటూ, గ్రామాలకు గ్రామాలను ఆరని చిచ్చులాగా రగిల్చి ముఠాకక్షలకు ఆలవాలం చేశారు. ఫ్యాక్షన్ సంస్కృతిని పెంచి పోషించారు. 1990 వరకు పేట్రెగి పోయిన ముఠాకక్షలు, విప్లవోద్యమాలు బలపడే క్రమంలో పూర్తిగా కనుమరుగై పోయాయి. పలనాటి నెత్తుటి చరిత్రలో ఈ మార్పు చెప్పుకోదగిన మార్పు. శాంతి భద్రతలు పరిరక్షించాల్సిన ప్రభుత్వం, పోలీసులూ చేష్టలుడిగి కూర్చొన్న సమయంలో పలనాటి సీమలోకి విప్లవ రాజకీయాలు అడుగుపెట్టాయి. వాటిరాకతో సాంఘిక వివక్ష, పెత్తందారీతనం, ఫ్యాక్షన్ సంస్కృతి, విధిలేని పరిస్థితిలో విప్లవోద్యమానికి దారి సుగమం చేసి వెళ్లిపోయాయి. భూసంబంధాల్లో మార్పులు చోటు చేసుకున్నాయి. అటవీ ప్రాంత గ్రామాల్లో అడవుల్లో ప్రజలపై పెత్తనం చెలాయించి డబ్బు గుంజే అటవీశాఖ దౌర్జన్యాలకు బ్రేక్ పడింది. సహజంగానే విప్లవోద్యమానికి పలనాడులో ఆదరణ పెరిగింది. 35 ఏళ్ల కిందట చారుమజుందార్ గుత్తికొండ బిలంలో రహస్య సమావేశం నిర్వహించి వెళ్లినా, గడిచిన పదిహేనేళ్లు గానే పలనాడులోనూ, పాత పలనాడులోనూ నల్లమల పరిసరాల్లోనూ విప్లవోద్యమం బలపడింది. విప్లవకారులతో చర్చల సందర్భంగా, గుత్తికొండలో జరిగిన భారీ బహిరంగ సభ ద్వారా పాత పలనాడు యుద్ధానికి మించి పలనాడుకు ప్రాచుర్యం లభించింది. పౌరుషాలూ, రోషాలు కల్గిన పలనాటి యువతీ, యువకులు ఈ ఉద్యమాల్లో భాగస్వాములై అనేకమంది బూటకపు ఎదురుకాల్పుల్లో చనిపోయారు. తమ రక్తాన్ని పలనాడుకు రంగరించి ఫ్యాక్షన్ పెత్తందారీ పోకడలతో నడుస్తున్న పలనాటి చరిత్రను దారిమళ్లించారు. కన్నెగంటి హనుమంతుకు కొనసాగింపుగా కొత్త చరిత్రను సృష్టించారనేది వాస్తవం.

**ప్రస్తుత పరిస్థితి**

శతాబ్దాల వెనుకబాటు తనాన్ని పట్టించుకోని ప్రభుత్వాలు, పాలకులు, ప్రస్తుత పలనాడుపై కన్నెర్రచేస్తున్నారు. విప్లవోద్యమాలకు చోదకశక్తిగా మారుతున్న పలనాడును, పలనాటి పోరాటాలను, పోలీసు

(మిగతా 58వ పేజీలో)

# చారిత్రకంగా, రాజకీయంగా మోసపోతున్న రాయలసీమ

– ప్రొ. ఎస్. శేషయ్య

ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఊపందుకొని రాష్ట్ర రాజకీయాలను ప్రభావితం చేసినప్పుడల్లా రాయలసీమ వెనుకబాటుతనం గురించి రాజకీయ నాయకులకు గుర్తొస్తోంది. ప్రధానంగా ప్రతిపక్ష రాజకీయ నాయకులు, రాజకీయ నిరుద్యోగులు ఈ ప్రాంతానికి జరిగిన అన్యాయం గురించి, ప్రభుత్వం చూపిస్తున్న నిర్లక్ష్యం, వివక్షత గురించి వేదికలను ఏర్పాటు చేసి ఆందోళన వ్యక్తం చేస్తారు. గత అయిదు దశాబ్దాలుగా ఈ ప్రాంతం నదీజలాలు పంపిణీ విషయంలోనూ, పారిశ్రామిక అభివృద్ధిలోనూ, శాశ్వత కరువు నివారణ చర్యలు చేపట్టడంలోనూ ప్రభుత్వ నిర్లక్ష్యం కొనసాగుతున్న విషయం తెలిసినా తమకు జరిగిన, జరుగుతున్న అన్యాయాన్ని చెప్పుకోవడంలో కూడా వెనుకబడిపోవడం చాలా బాధాకరం. రాయలసీమ ప్రాంతం నుండి ముఖ్యమంత్రులు, మంత్రులుగా అధికారం వెలగబెట్టిన వారుకూడా అధికారం పోయినప్పుడు రాయలసీమ వెనుకబాటుతనం, కరువును తమ రాజకీయ వ్యాపారానికి ముడిసరుకుగానే ఉపయోగించుకుంటున్నారు. మూఠా రాజకీయాలకు నిలయమయిన రాయలసీమ ప్రాంత నాయకులు ఈ ప్రాంతాన్ని వల్లకాడుగా మార్చారు.

ఆంధ్రరాష్ట్రంలోని కోస్తా ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలకంటే రాయలసీమ చాలా వెనుకబడి ఉంది. ప్రత్యేక తెలంగాణవాదులు రాష్ట్రప్రభుత్వం ప్రకటించే అంకెలను, లెక్కలను బట్టి తమకంటే రాయలసీమ అభివృద్ధి చెందిందని భావిస్తున్నారు. వాస్తవానికి రైతుల ఆత్మహత్యలను పరిశీలించినా, వర్షాలు రాక వ్యవసాయం కుంటుపడి వలసలు పోతున్న జనాభా, గతంలో ఉన్న ఫ్యాక్టరీలన్నీ మూతపడి కార్మికులు నిరుద్యోగులుగా మారిన పరిస్థితిని గమనించినా తెలంగాణని లాగే రాయలసీమ కూడా వెనుకబడిపోయింది. ఎటువంటి అభివృద్ధికి నోచుకోలేదు. రాయలసీమ ప్రాంతంలో విశ్వవిద్యాలయాలు ఎక్కువగా ఉన్నాయనీ, విద్యాపరంగా అభివృద్ధి చెందిందని చెప్పడం కూడా సరయింది కాదు. ఈ విశ్వవిద్యాలయాల్లోనూ, మెడికల్, ఇంజనీరింగ్ కళాశాలల్లో గతంలో సర్కారు, నెల్లూరు జిల్లాల వారే లాభం పొందారు. ప్రస్తుతం ప్రాంతీయంగా కళాశాలలు పెరిగినా వాటిల్లో చదివే శక్తి రాయలసీమలో సాధారణ, మధ్యతరగతి ప్రజలకు లేదు. గ్రామీణ ప్రజానీకానికి యివి అందుబాటులో లేవు. తెలంగాణ ప్రాంతానికి చెందిన ఉద్యోగాలు వారికే చెందాలని, సర్కారు ప్రాంతం వారిని వెనక్కి పంపించాలనీ ఎలాగయితే తెలంగాణ ఉద్యమకారులు ఆందోళన చేస్తున్నారో, అలాగే రాయలసీమలో కూడా ఉద్యమించారు.

ప్రాంతీయంగా తెలంగాణ, రాయలసీమలు వెనుకబడి పోవడానికి, చారిత్రక రాజకీయ కారణాలు ఉన్నాయి. మొదటినుండి రాయలసీమ కోస్తాఆంధ్ర నాయకుల స్వార్థానికి, రాయలసీమ ప్రాంతం నాయకుల అవకాశవాదానికి బలయిపోయిన చరిత్ర ఉంది. 1800 సంవత్సరంలో నైజాం పాలకులు నేడు రాయలసీమ ప్రాంతంగా చెప్పబడుతున్న నాలుగు జిల్లాలను (నెల్లూరు ప్రాంతంతో పాటు) బ్రిటిష్ వారికి దారదత్తం చేసారు. ఆనాడు ఈ ప్రాంతాన్ని దత్త మండలం అని పిలిచేవారు. ఆంధ్రోద్యమంలో పాల్గొన్న నాయకులు, విజయనగర రాజుల పాలనలో ఉన్న ఈ ప్రాంతానికి 'రాయలసీమ' అని నామకరణం చేసారు. కానీ, తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలవారు ఆంధ్రప్రదేశ్ అవతరణతో తమ సమస్యలు పరిష్కారం అవుతాయని ఏనాడూ విశ్వసించలేదు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడక ముందునుండీ కోస్తా ఆంధ్ర నాయకుల వ్యవహారం పై అనేక అనుమానాలు వ్యక్తంచేసారు.

1913లో బాపట్లలో జరిగిన ఆంధ్రమహాసభలో కోస్తాఆంధ్రకు సంబంధించిన అనేక తీర్మానాలు చేసారు. ఆంధ్ర ప్రాంతంలో విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలనీ, రైల్వే నిర్మాణాలను చేపట్టాలనీ, నీటి ప్రాజెక్టులు కట్టాలనీ డిమాండు చేసారు. కోస్తా ఆంధ్ర నాయకుల పక్షపాత వైఖరిని గమనించి రాయలసీమ నాయకులు ఆంధ్రోద్యమానికి కొంతకాలం దూరంగా ఉన్నారు. రాయలసీమ అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటామని కోస్తా ఆంధ్ర నాయకులు హామీ ఇవ్వడంతో ఆంధ్రోద్యమంలో పాల్గొనడానికి ఒప్పుకున్నారు. కానీ రాయలసీమ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడితేనే లాభం అని భావించారు. నాటి రాయలసీమ నాయకులలో ప్రముఖుడు 'సాధన' పత్రిక సంపాదకుడు పప్పూరి రామచార్యులు 1931లో జరిగిన ఆంధ్రమహాసభలో ఆంధ్ర ప్రాంత నాయకులు స్వభావం గురించి స్పష్టంచేస్తూ "భాషా ప్రయుక్త రాష్ట్రం అక్కరలేదనను. అందువల్ల లాభములనేకం కలవు. కాని చెన్న రాజధాని నుండి ఆంధ్రరాష్ట్రం విడివడుట లాభకరమైనచో ఆంధ్రరాష్ట్రం నుండి రాయలసీమ విడివడుట మరింత లాభముకదా! ఉత్తరాది వారిని మనలను ఎర్రమల కొండలు వేరు చేయుచున్నవి. వారి భాష, ఆహార విహారాదులు వేరు. ప్రకృతి సిద్ధమయిన విషయం కావున పొత్తు కుదరదు. ఆంధ్ర విశ్వవిద్యాలయ విషయం కూడా మాకు అనుభవం అయింది. వారిలో వారే కలహించినారని అధ్యక్షులు తెలిపినా మాకీయకూడదనడంలో అందరూ విభేదించిన వారే.... కావున ఉత్తరాది వారిలో చేరుటకన్నను వేరు రాష్ట్ర స్థాపనకు గడంగుట మేలు...." సాధన పత్రికలో పప్పూరి రామాచార్యులు 1931 జులై నెలలో వ్రాసిన కోస్తా ఆంధ్ర నాయకుల పక్షపాత వైఖరిని నిరసిస్తూ, ప్రత్యేక రాష్ట్రం అవసరం గురించి రాశారు.

ప్రధానంగా (1) ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి రాయలసీమ వేరై ఈ సీమవాసులు మద్రాసు యూనివర్సిటీని ఆశ్రయించాల్సిన వచ్చింది. (2) ఒకవేళ ఆంధ్రరాష్ట్రం వస్తే తమిళులు వదిలినా మమ్ము ఆంధ్రులు వదిలేటట్టులేరు. ఇంతవరకు అయ్యరులు పాలించారు. ఇక పంతుళ్లు పాలిస్తారు. (3) మా బీద మండలం మూలధనం ఉత్తర సర్కారులకు ప్రవహించి పోవుచున్నది. అక్కడనుండి పైసా తిరిగి వచ్చుటలేదు. (4) రాయలసీమలో 80 లక్షల జనాభా (ప్రస్తుతం) ప్రకృతి సంపద, ఖనిజాలు, అటవి సందప కలవు. ఐరోపాలోని డెన్మార్కు మొదలగు చిన్న దేశాలు, తిరువాన్కూరు, మైసూరు వంటి సంస్థానాలవలే రాయలసీమ ప్రత్యేక రాష్ట్రంగా అభివృద్ధి చెందగలదు'' ఈ అభిప్రాయాలను ఆనాటి నాయకులు సమర్థించారు.

**ఆచరణకు నోచుకోని 'శ్రీబాగ్ ఒడంబడిక'**

అభివృద్ధి చెందిన కోస్తా ఆంధ్ర, రాయలసీమల మధ్య వైరుధ్యాలు

తీవ్రస్థాయికి చేరుకున్న ఈ దశలో 3-10-1937న ఆంధ్రమహాసభ రజతోత్సవాలు విజయవాడలో జరిగాయి. రాయలసీమ అభివృద్ధికి తగిన హామీలను ఆంధ్రప్రాంత నాయకులు రాయలసీమ వారికి యిచ్చిన తర్వాతనే ఈ మహాసభలో పాల్గొన్నారు. నాటి సభలో రాయలసీమ అభివృద్ధికి తుంగభద్ర ప్రాజెక్ట్ నిర్మాణం చేపట్టాలనీ, రాయలసీమలో రాష్ట్ర రాజధానిని, విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయాలని డిమాండ్లు చేసారు. ఈ అంశాలే ఆ తర్వాత కుదిరిన శ్రీబాగ్ ఒడంబడికలో ఉన్నాయి.

రజతోత్సవాల తర్వాత మద్రాసులో ఆంధ్రపత్రిక యజమాని శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి భవనంలో (శ్రీబాగ్) ఆంధ్ర, రాయలసీమ నాయకుల మధ్య 16-11-1937లో రాయలసీమ అభివృద్ధికి సంబంధించిన అంశాల మీద ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందాన్నే 'శ్రీబాగ్ ఒడంబడిక' గా వ్యవహరిస్తారు. ఈ ఒప్పందాన్ని నాటి కోస్తా ఆంధ్ర ప్రముఖ నాయకులు ఎవ్వరూ మనస్ఫూర్తిగా ఒప్పుకోలేదు. విధిలేకనే సంతకాలు చేసారు. పప్పూరి రామాచార్యులు ఈ ఒప్పందం గురించి వ్యాఖ్యానిస్తూ ".... చారిత్రక కారణముల వలన కలిగిన ఇబ్బందులను తొలగించుకొనుటకై 'శ్రీబాగ్ ఒడంబడిక' ఏర్పరచబడింది. దానికి ఆంధ్రజాతి ఐక్యతకోరు ప్రతివారు ఒప్పుకొని తీరవలసిందే. ఈ ఒప్పందం స్థిరము కాదని సందేహించువారు కొందరున్నారు. అందులకే రాష్ట్ర కాంగ్రెస్ సంఘంవారు దీనిపై ముద్రవేసి రాజకీయ బలము నొసగినారు"

కోస్తా ప్రాంత నాయకత్వానికి, రాయలసీమ ప్రాంతం యెడల ఉన్న వైఖరి మొదటినుండీ మనస్ఫూర్తిగా నిజాయితీ లేకపోవడం వల్ల 'శ్రీబాగ్ ఒడంబడిక' స్ఫూర్తి ఆచరణలో అమలు కాలేదు. నీటి పారుదల సౌకర్యాలకు సంబంధించి ఈ ఒడంబడికలో నిర్దిష్టమయిన డిమాండు పొందుపరచబడింది. "వ్యవసాయకంగా, ఆర్థికంగా కోస్తా జిల్లాల స్థాయికి రాయలసీమ, నెల్లూరు జిల్లాలను ఎదిగేటట్లుగా సర్వతాభివృద్ధి సాధనకై పదేళ్లు, అవసరమయితే అంతకు మించి నీటి పారుదల పథకాలను ప్రాధాన్యతనిచ్చి అమలు జరపాలి. ముఖ్యంగా ఈ ప్రాంతంలో తుంగభద్ర, కృష్ణా, పెన్నా నదుల జలాల వినియోగానికి సంబంధించిన పథకాలపైన, పెద్ద ప్రాజెక్టుల పైన పదేళ్లు ప్రత్యేక శ్రద్ధ పెట్టి అమలుపరచాలి."

రాయలసీమ నాయకులు కూడా రాయలసీమ సమస్యలను తమ స్వార్థ ప్రయోజనాలకు వాడుకున్న చరిత్ర ఉంది. 1946 ఎన్నికల్లో విజయం సాధించిన టంగుటూరి ప్రకాశం నాయకత్వాన మంత్రివర్గం ఏర్పాటయ్యింది. రాయలసీమ శాసనసభ్యులంతా ప్రకాశంకు ఓటువేసి గెలిపించారు. రాయలసీమ నాయకులు కడప కోటిరెడ్డి, సంజీవరెడ్డికి మంత్రి వర్గంలో స్థానం లభిస్తుందని ఆశించారు. ప్రకాశం కోటిరెడ్డిని మంత్రి వర్గంలోని తీసుకోవడంతో అసంతృప్తి చెందిన సంజీవరెడ్డి వర్గం 1947లో ప్రకాశం మంత్రివర్గాన్ని పడగొట్టడంలో ప్రముఖ పాత్ర వహించింది. కాంగ్రెస్ పార్టీమీద ఆధిపత్యం కోసం పట్టాభి సీతారామయ్య, టంగుటూరి ప్రకాశం ముఠాల మధ్య పోటీ కాంగ్రెస్ పార్టీలో ముఠా రాజకీయాలు తీవ్రస్థాయికి చేరుకున్నాయి. ఈ పరిస్థితులోనే 1947 అక్టోబర్ 25, 26 తేదీలలో జరిగిన రాయలసీమ మహాసభలో సంజీవరెడ్డిగారి ప్రసంగం గమనార్హం. "అందుచేతనే మనకు రాముడు రాజ్యమేలినా, రావణుడు రాజ్యమేలినా ఒక్కటేననే మనస్తత్వం ఏర్పరడటానికి కారణమైంది. మనకు రాష్ట్ర ప్రసక్తి ఉత్సాహాన్ని రేకెత్తించలేకుండా పోతూ ఉంది. వేరే రాష్ట్రం వచ్చినా మనకు మోక్షం కలుగుతుందనే ఆశ ఇప్పటి మన ఉత్తరాది సోదరుల ఉపేక్షా భావాన్ని చూస్తే నన్నుగిల్లుతూ ఉంది... ఈ సభలో కోరబడే ఇట్టి న్యాయసమ్మతమయిన హక్కులన్నీ యివ్వబడితే తప్ప మనం ఆంధ్రరాష్ట్రంలో చేరడానికి వీలుకాదు. ఒట్టిమాటలకు బేలపోయే కాలం తీరిపోయింది. మన హక్కులు మనకు దొరకని పక్షంలో అప్పుడు మనం రాయలసీమ రాష్ట్రాన్ని ప్రత్యేకంగా కోరవల్సిందే. కాని అన్యదా శరణం నాస్తి. ఈ అవసరాన్ని మనకు ఉత్తరాది సోదరులు కల్పింపకుందురుగాక. అని యి వేదిక నుండి వారిని హెచ్చరించుచున్నాను." 1949లో పి.ఎస్. కూమారస్వామి మంత్రివర్గంలో స్థానం లభించడానికీ, 1957కి డిప్యూటి ముఖ్యమంత్రి కావడానికి సంజీవరెడ్డి రాయలసీమ వెనుకబాటుతనం అడ్డుపెట్టుకున్నారు. ఆంధ్రోద్యమ చరిత్రలో స్వార్థ రాజకీయాలకు రాయలసీమ బలైపోయింది. 1953లో రాయలసీమ, కోస్తా ఆంధ్రలు కలిసి ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. అయినా భాషా ప్రాతిపదికన రాష్ట్రాలు ఏర్పడటంలో అన్ని ప్రాంతాలు సమానం అన్నంతమాత్రాన సమానత్వం రాదు. ఆయా ప్రాంతాల మధ్యనెలకొన్న అసమానతలను తొలగించడానికి ప్రభుత్వం ప్రయత్నించాలి. ప్రభుత్వం అటువంటి ప్రయత్నం చేయకపోగా వెనుకబడిన ప్రాంతాల మధ్య వివక్షతను చూపించింది. ఈ వివక్షతను అర్థం చేసుకుంటే తప్ప రాయలసీమ హక్కులు ఎలా అంతరించిపోయాయో తెలుస్తుంది.

1951లో అప్పటి మద్రాసు రాష్ట్రం ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారి కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టను అమలు చేయాలని ప్రయత్నించారు. ఈ పథకాల కింద కర్నూలు జిల్లాలో సంగమేశ్వరం వద్ద కృష్ణా నదిపై 270 టిఎంసి (శతకోటి ఘనపుటడుగులు) సామర్థ్యంతో రిజర్వాయరును, కడప-నెల్లూరు జిల్లా సరిహద్దులో పెన్నా నదిపై 276 టిఎంసి లతో రిజర్వాయరును నిర్మించి, వీటి కింద కడప-కర్నూలు జిల్లాలలో 6.4 లక్షల ఎకరాలకు, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో 10.5 లక్షల ఎకరాలకు, తమిళనాడులో 7.2 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం, మద్రాసుకు మంచినీటి సౌకర్యం కల్పించాలని ఉద్దేశించారు. కృష్ణ-పెన్నార్ ప్రాజెక్ట్ వలన రాయలసీమ జిల్లాలకు ప్రయోజనం అతి స్వల్పమే. ఈ ప్రాజెక్టను అమలుచేయడానికి ప్లానింగ్ కమీషన్ కూడా ఆమోదం తెలిపింది. కాని, ఈ ప్రాజెక్ట్ వలన తెలుగువారు నష్టపోయి, తమిళులు లాభపడతారనే పేరుతో ఆంధ్ర ప్రాంతలోని అన్ని రాజకీయ పక్షాలు ఈ ప్రాజెక్టను విరమించమని ఆందోళన చేయగా ఆగిపోయింది.

కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టను విరమించిన తర్వాత కృష్ణా జలాల వినియోగంపై ప్లానింగ్ కమీషన్ ఖోస్లా కమిటీని నియమించింది. ఖోస్లా కమిటీ తన నివేదికలో గుంటూరు జిల్లాలోని నందికొండ (ప్రస్తుతం నాగార్జునసాగర్) వద్ద, కర్నూలు జిల్లాలోని సిద్దేశ్వరం (ప్రస్తుతం శ్రీశైలం) వద్ద రిజర్వాయర్లను నిర్మించాలని, కడప-కర్నూలు (కె.సి. కెనాల్) కాలువలో 6000 క్యూసెక్కుల నీరు ప్రవహించేటట్లుగా వెడల్పు చేయాలని, సిద్ధేశ్వరం కుడి గట్టునుండి రెండు కాలువలు తవ్వి కుడి కాలువను కడప జిల్లాలోని గండికోట వద్ద పెన్నా నదిపై నిర్మించే రిజర్వాయరులో కలపాలనీ, నందికొండ ప్రాజెక్ట్ (నాగార్జునసాగర్) కుడి కాలువను నెల్లూరు జిల్లాలో పెన్నా నదివరకు పొడిగించి, అక్కడి నుండి మద్రాసుకు తవ్వాలని, నీటిని సరఫరా చేసి కాలువను తవ్వాలని, చివరిగా పులిచింతల (గుంటూరు) వద్ద రిజర్వాయరును నిర్మించి కృష్ణా డెల్టాకు

నీరు అందివ్వాలని పేర్కొంది.

ఖోస్లా కమిటీ రిపోర్టులో రాయలసీమకు కృష్ణా జలాలు లభించాలన్న సూచన పెద్దగా చేయకపోయినా, కనీసం ప్రతిపాదల్ని కూడా ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం చేపట్టలేదు. తెలుగువారి ప్రయోజనాల నిమిత్తం కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టును విరమింపజేసి, కరువులతో సతమతమయ్యే రాయలసీమకు మొండిచేయి చూపించింది. కృష్ణా-గుంటూరు జిల్లాలోని మెట్టప్రాంతాలకు నీరు అందియ్యాలనే పేరుతో కృష్ణా నదిపై భారతదేశంలోనే అతిపెద్ద ప్రాజెక్ట్ అయిన నాగార్జునసాగర్‌ను 1954లో నిర్మించి రాయలసీమ ప్రజలను వమ్ముచేసింది ప్రభుత్వం. ఖోస్లా కమిటీ కర్నూలు-కడప కాలువ సామర్ధ్యాన్ని 6000 క్యుసెక్కులకు పెంచాలనీ చేసిన సిఫార్సును అమలుచేయకుండా కేవలం 3000 క్యుసెక్కులకు కుదించివేయడం ద్వారా రాయలసీమ ఘోరంగా నష్టపోయింది. సిద్దేశ్వరం స్థానంలో శ్రీశైలం ప్రాజెక్టును జలవిద్యుత్ ప్రాజెక్ట్‌గా మార్చి నిర్మించడం ద్వారా కృష్ణా నది నుండి రాయలసీమకు నీరు మళ్లించే అవకాశానికి శాశ్వతంగా సమాధి కట్టింది. శ్రీశైలం ప్రాజెక్టును నాగార్జునసాగర్‌తో అనుసంధానం చేయడం ద్వారా నాగార్జునసాగర్‌కు నీటి కొరత లేకుండా ఉండాలనే ఆలోచన ఉంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటు తర్వాత తెలంగాణ, కోస్తా ఆంధ్ర నాయకులు పోటీపడి అభివృద్ధి పథకాలను తమతమ ప్రాంతాలకు తరలించుకపోయారు. వీళ్ల మధ్య పోటీ కారణంగా రాయలసీమ మరింత నిర్లక్ష్యానికి గురయింది. 1945లో ప్రారంభించబడిన తుంగభద్ర ప్రాజెక్ట్ 5 దశాబ్దాలు గడిచినా పూర్తికాలేదు. కన్నీటి తుడుపుగా బైలవానితిప్ప ప్రాజెక్ట్, అప్పర్ పెన్నార్ ప్రాజెక్టులు చెన్నరాయస్వామి గుడి ప్రాజెక్ట్, వంటి చిన్న ప్రాజెక్టులు నిర్మించినా వీటి కింద 5 లేక 10 వేల ఎకరాల ఆయకట్టు మాత్రమే ఉంది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడేనాటికే కోస్తాఆంధ్రలో కాలువల కింద 26,75,499 ఎకరాలు, రాయలసీమలో 2,03,900 ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం లభించింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత ప్రారంభించిన నాగార్జునసాగర్, పోచంపాడు (శ్రీరాంసాగర్) ప్రాజెక్టులకు నిధుల కొరత లేకుండా వేగంగా పూర్తిచేసారు. అప్పటికే నిర్మించిన కృష్ణా గోదావరి ఆనకట్టల కట్టడం ద్వారా కోస్తా ఆంధ్రలో విస్తారమయిన ఆయాకట్టు అభివృద్ధి జరిగింది.

1982-83 నాటికి రాష్ట్రంలో మూడు ప్రాంతాల్లో ప్రాజెక్ట్ కాలువల కింద నీటి పారుదల సౌకర్యాలు 1956-57 లో పోల్చితే ఈ విధంగా ఉంది.

| ప్రాంతం | ప్రాజెక్టులు | ఆయకట్టు | వ్యవసాయ బావులు |
|---|---|---|---|
| కోస్తాఆంధ్ర | 22 | 36,37,719 (43.8%) | 19665 (45.7%) |
| రాయలసీమ | 11 | 17,60,500 (51.2%) | 9022 (21%) |
| తెలంగాణ | 26 | 29,11,638 (35%) | 14,307 (33%) |
| ఆంధ్రప్రదేశ్ | 59 | 83,09,857 (100%) | 42,994 (100%) |

మూలం : డైరక్టరేట్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ పొలిటిక్స్ 2005

ప్రాంతాల వారీగా వర్షపాతంలో తీవ్రమయిన వ్యత్యాసం ఉంది. కోస్తా, తెలంగాణలలో సరాసరి వార్షిక వర్షపాతం 1000 మి.మీ. ఉండగా, రాయలసీమలో అతి తక్కువగా ఉంది.

రాయలసీమలో సరాసరి వర్షపాతం (మి.మీ)

| సంవత్సరం | రాయలసీమ | ఆంధ్రప్రదేశ్ |
|---|---|---|
| 1985-85 | 534 | 806 |
| 1995-96 | 607 | 930 |
| 1999-00 | 563 | 879 |
| 2001-02 | 736 | 798 |
| 2003-04 | 715 | 940 |
| 2004-05 | 715 | 940 |

మూలం : డైరక్టరేట్ ఆఫ్ ఎకనామిక్స్ 2005

కృష్ణా నదీ జలాలను రాష్ట్రంలో ప్రాంతాలవారీగా పంపకం జరిగినప్పుడు కూడా రాయలసీమకు అన్యాయం జరిగింది. కోస్తా ఆంధ్ర ప్రాంతం వారే లాభపడ్డారు. బచావత్ ట్రిబ్యూనల్ అవార్డు ప్రకారం కృష్ణాజలాలు పంపిణీ ఈ విధంగా ఉంది.

ప్రాంతాలవారీగా కాలువలు, బావుల ద్వారా ఇతర నీటి వనరుల ద్వారా సాగు అయ్యే భూమి విస్తీర్ణంలో కూడా వ్యత్యాసాలు ఉన్నాయి. నీటి పారుదల ప్రాజెక్టులు ఉన్న ప్రాంతాల్లోని ఆయాకట్టు పెరుగుతూ ఉంది. తెలంగాణ, రాయలసీమ ప్రాంతంలో కరెంటు బావుల కింద, అంటే రైతులు వ్యవసాయానికి అవసరమయిన నీటికోసం కోట్లాది రుపాయలును వెచ్చించాల్సి వస్తుంది. నిటి పారుదల సౌకర్యాల్లో అసమానతలు పోకుండా ఈ ప్రాంతాల మధ్య సమానంగా అభివృద్ధి చెందే అవకాశాలు ఉండవు. రాయలసీమ ప్రాంతంలో 1999-2000 నాటికి కాలువల కింద 20 శాతం, చెరువుల కింద 8 శాతం, గొట్టపు బావుల కింద 39.11 శాతం, బావులు 31 శాతం, ఇతర నీటి వనరుల కింద 2 శాతం సాగయ్యేది. కాని 2004 నాటికి కాలువల కింద 6 శాతం, చెరువుల కింద రెండు శాతం తగ్గింది.

| వనరులు | రాయలసీమ | కోస్తాఆంధ్ర | తెలంగాణ |
|---|---|---|---|
| కాలువలు | 12.18 | 54.85 | 11.7 |
| గొట్టపుబాలువు | 79.13 | 27.23 | 73.12 |
| చెరువులు | 6.60 | 13.10 | 12.08 |
| ఇతరుములు | 2.09 | 4.82 | 3.06 |
| మొత్తం | 100.00 | 100.00 | 100.00 |

ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయంగా నీటి వనరుల శాతం

మూలం : డైరక్టరేట్ ఆఫ్ ఎకనామిక్స్ ఆం.ప్ర. 2004

కాంగ్రెస్ అధికారంలోకి వచ్చాక ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర రెడ్డి తలపెట్టిన "జలయజ్ఞం" పేరుతో ప్రతిపాదించిన ప్రాజెక్టులు, వాటి నిర్మాణానికి అవసరమయిన ఖర్చును పరిశీలిస్తే ఇవి ఈ శతాబ్దంలో పూర్తి అవుతాయా అనే అనుమానం వస్తూంది.

రాయలసీమలో కె.సి. కెనాల్, తుంగభద్ర దిగువ కాలువల ద్వారానే వ్యవసాయానికి నీటి వనరులు సమకూరుతున్నాయి. తెలుగు గంగ ప్రాజెక్ట్ ప్రతిఫలంగా నెల్లూరు జిల్లాలకు ఉపయోగపడుతుంది. మిగతా చిన్న చిన్న ప్రాజెక్టుల కింద ఆయకట్టు 5000 నుండి 10000 ఎకరాలకు మించదు. ఈ ప్రాజెక్ట్‌లో వర్షాలు లేక నీరు ఉండటం

లేదు. బచావత్ ట్రిబ్యూనల్ కృష్ణా జిల్లాల నీటిని మూడు రాష్ట్రాల మధ్య కేటాయించింది.

బచావత్ ట్రిబ్యూనల్ తీర్పు తర్వాత రాయలసీమకు కేటాయించిన కృష్ణా జలాల వివరాలు.

1. కడప-కర్నూలు కాలువ 39.90 టిఎంసి
2. తుంగభద్ర ఎగువ కాలువ 29.50 టిఎంసి
3. తుంగభద్ర దిగువ కాలువ 32.50 టిఎంసి
4. బైరవానితిప్ప ప్రాజెక్ట్ 4.90 టిఎంసి
5. గాజుల దిన్నె (సంజీవయ్యసాగర్) 2.00 టిఎంసి
6. చిన్నతరహా పథకాల కింద 13.90 టిఎంసి
7. శ్రీశైలం కుడికాలువ 11.00 టిఎంసి
(ఈ పథకానికి కేటాయించిన నీరు 19 టిఎంసిలు. ఇందులు 8 టిఎంసిలు కె.సి. కెనాల్‌కు కేటాయించిన నీటిని యిచ్చారు)

మొత్తం 133.70 టిఎంసి

ఆంధ్రరాష్ట్రంలో అఖిలపక్ష సమావేశం ద్వారా రాయలసీమకు 122 టిఎంసిలు మాత్రమే కేటాయించారు. ఇవికూడా సరిపోవడం లేదు. నిత్యం కరువు కటకాలతో రాయలసీమ ప్రాంతంలోని రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. రాయలసీమ ఉద్యమకారులు గతంలో ఈ ప్రాంతానికి 370 టిఎంసిల నీటిని కేటాయించాలని డిమాండు చేసారు. కానీ, ప్రభుత్వం ఇటువైపుగా చర్యలు తీసుకోలేదు.

జనాభా ప్రాతిపదిక, సాగుభూమి దామాషా ప్రకారం కాకుండగా, వర్షపాతం, వెనుకబాటుతనం, కరువుల తీవ్రత దృష్టిలో పెట్టుకొని ప్రాతిపదికన రాయలసీమకు నీటిని కేటాయిస్తే తప్ప ఈ ప్రాంతం మరింతగా వెనుకబడిపోయే ప్రమాదం ఉంది.

### పారిశ్రామిక, విద్యా రంగంలో అసమానత

కోస్తా ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలతో పోల్చితే రాయలసీమ ప్రాంతం పారిశ్రామికంగా చాలా వెనుక బడి ఉంది. ఈ ప్రాంతంలో ప్రభుత్వరంగంలో నెలకొల్పిన పెద్ద పరిశ్రమలు లేవు. రాయలసీమ పేపర్ మిల్లు, కార్బైడ్ ఫ్యాక్టరీ (కర్నూలు), గుంతకల్ స్పిన్నింగ్ మిల్ (గుంతకల్), నిజాం షుగర్ ఫ్యాక్టరీ (హిందూపురం) ఏ.పి. లైటింగ్స్ (అనంతపురం) మూసివేశారు. నాపరాయి గనులు, స్టీల్ ఫ్యాక్టరీలు, ప్రైవేట్ రంగంలో ఉన్నాయి. ప్రభుత్వ రంగంలోని పరిశ్రమలను మూసి వేయడం ద్వారా వేలాది మంది కార్మికులు నిరుద్యోగులయ్యారు. ఈ ప్రాంతంలో అనేక విలువయిన ఖనిజాలు దొరుకుతున్నా వాటికి సంబంధించిన పరిశ్రమలను నెలకోల్పడానికి శ్రద్ధ చూపలేదు. రామగిరిలో ఉన్న బంగారు గనులు కూడా మూత పడ్డాయి.

రాష్ట్రంలో ఉన్న మొత్తం ఫ్యాక్టరీలు అందులో పనిచేస్తున్న కార్మికులు సంఖ్యను పోల్చి చూస్తే రాయలసీమ ప్రాంతం చాలా వెనుకబడి ఉంది.

చెప్పుకోదగ్గ పరిశ్రమలు లేనందున ఈ ప్రాంతంలో పారిశ్రామిక అభివృద్ధి జరగలేదు. ముఠా కక్షల వలన ప్రైవేట్ రంగంలో పరిశ్రమలు నెలకొల్పడానికి పారిశ్రామికవేత్తలు ముందుకు రావడం లేదు. ప్రభుత్వ ఉద్యోగాల్లో కూడా రాయలసీమకు అన్యాయం జరిగింది. ఈ ప్రాంతంలో

| ప్రాంతం | ఫ్యాక్టరీల సంఖ్య (శాతం) | ఉత్పాదిక పెట్టుబడి లక్షల్లో | కార్మికుల సంఖ్య (శాతం) | విలువ (శాతం) |
|---|---|---|---|---|
| రాయలసీమ | 11.00 | 7.0 | 8.0 | 8.0 |
| తెలంగాణ | 57.0 | 60.0 | 73.0 | 70.0 |
| కోస్తాఆంధ్ర | 32.0 | 33.0 | 22.0 | 22.0 |
| మొత్తం | 100.0 | 100.0 | 100.0 | 100.0 |
| ఆంధ్రప్రదేశ్ | 19112 | 3713122 | 1021726 | 100595 |

ఉన్న ప్రభుత్వ ఆఫీసుల్లో రాయలసీమేతరులు ఉన్నారు. వీరిని వెనక్కి పంపిచాలని రాయలసీమ ఉద్యోగులు చాలా కాలంగా ఆందోళన చేస్తున్నారు. దాదాపు 50000 వేల ఉద్యోగాలు రాయలసీమ వాటాగా యివ్వాలని కోరుతున్నారు.

ఆంధ్రోద్యమంలోనే ఇక్కడ విశ్వవిద్యాలయం నెలకొల్పుతామని హామీ యిచ్చిన కోస్తా ఆంధ్ర నాయకులు విశాఖపట్నంలో యునివర్సిటీని స్థాపించి రాయలసీమకు అన్యాయం చేశారు. ప్రస్తుతం విద్యారంగంలో తెలంగాణ కంటే (హైదరాబాద్ మినహాయించి) కొంత వరకు అభివృద్ధి సాధించినా, కోస్తా ఆంధ్ర కంటే వెనుకబడి పోయింది. అక్షరాస్యతలో ప్రభుత్వ సరాసరికి సమానంగా ఉంది. ప్రభుత్వ ఆధ్వర్యంలో డిగ్రీ, ఇంజనీరింగ్ కళాశాలలు గతంలో ఏర్పాటు చేసినవే. ప్రస్తుతం ప్రైవేట్ రంగంలోనే కాలేజీలు ఎక్కువగా వస్తున్నాయి. పేద, మధ్యతరగతి ప్రజలకు ఇవి అందుబాటులో లేవు.

నీటి కేటాయింపులోనూ, పారిశ్రామిక రంగంలోనూ రాయలసీమ ప్రాంతం చాలా వెనుకబడింది. వ్యవసాయరంగం సంక్షోభంలో ఉంది. దీని ఫలితంగా రైతుల ఆత్మహత్యలు పెరుగుతున్నాయి. పరిశ్రమలు మూసివేయడంతో కార్మికులు ఆత్మహత్యలకు ఆకలి చావులకు గురవుతున్నారు. చేనేత కార్మికులు ఆత్మహత్యల గురించి వార్తలు చూస్తూనే ఉన్నాం.

రాయలసీమ పట్ల ప్రభుత్వం నిర్లక్ష్యాన్ని వ్యతిరేకిస్తూ వివిధ వేదికల ద్వారా ఉద్యమాలు నడిచాయి. కొంతకాలం కొనసాగి ఆగిపోయాయి. తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే రాయలసీమ ప్రాంతం కోస్తాఆంధ్ర ప్రాంతంతో కలిసి ఉండగలదా? అనే ప్రశ్న నేడు కొంత మంది రాజకీయ నాయకులు లేవదీస్తున్నారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం వస్తే, మాకు కూడా ప్రత్యేక రాష్ట్రం యివ్వమని కొంతమంది అడుగుతున్నారు. కానీ తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కావాలని అక్కడి ప్రజలు గట్టిగా కోరుతున్నారు. అలాంటి కోరిక రాయలసీమ ప్రాంతంలో లేదు. ప్రత్యేక రాష్ట్రం వలన రాయలసీమ ఎక్కువగా లాభపడుతుందని కూడా చెప్పలేం. ఈ ప్రాంతం అభివృద్ధికి ప్రభుత్వం ప్రత్యేకమయిన పథకాలను, అవకాశాలను రూపొందించాలి. మొదట నదీ జలాల్ని ప్రత్యేక ప్రాతిపదికన కేటాయించి, ప్రాజెక్టలను పూర్తి చేయాలి. ప్రాంతీయ సమానత్వం ఒక ప్రజాస్వామిక హక్కుగా గుర్తించనప్పుడే ప్రాంతాల మధ్య విభేదాలను విద్వేషాలను దూరం ఉంచగల్గుతాం. తెలంగాణా నాయకులు కూడా రాయలసీమ వెనుకబాటుతనాన్ని గుర్తించాలి. ప్రభుత్వం కల్పించే అభివృద్ధి పథకాలను వ్యతిరేకించరాదు. ◆

# తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వం - అన్యాయాల చరిత్ర

- రాజవరం పార్థసారథి

తెలంగాణ విషయంలో ప్రాంతీయ అసమానత అనిగాని, వెనుకబాటుతనం అనిగాని, అభివృద్ధిరాహిత్యం అనిగాని, నిధులు-నీళ్లు-నియామకాలలో వివక్ష అనిగాని, తెలంగాణకు అన్యాయంచేసిన, ద్రోహంచేసిన నాయకులు అనిగాని చర్చించడం చాల అవసరమే. పూర్తిగా సరైనదే గాని అలా మాత్రమే చర్చిస్తే అసలు సమస్య అర్థం కాదు. ఎందుకంటే అదే మొత్తం సమస్య కాదు. అది విశాల చిత్రంలో ఒక భాగాన్ని మాత్రమే స్పృశించినట్టు అవుతుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడినప్పటినుంచీ తెలంగాణ ప్రాంతానికి నిధుల కెటాయింపులోనూ, అభివృద్ధి పథకాలలోనూ, నీటి పారుదల పథకాలు చేపట్టి ఎక్కువభూమికి సాగునీటి సౌకర్యం అందించడంలోనూ, స్థానికులకు విద్యా, ఉద్యోగావకాశాలు కల్పించడంలోనూ, ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక సంస్థలలో నిర్ణయాధికారాన్ని కల్పించడంలోనూ తెలంగాణపట్ల, తెలంగాణ వాసులపట్ల అన్యాయం, వివక్ష అమలయ్యాయి.

ఆ మాటకు వస్తే అంతకుముందరి నిజాం పరిపాలనలో కూడ తెలంగాణ జిల్లాలకు అందవలసిన న్యాయమైన వాటా అందలేదు. ప్రపంచంలోనే హెన్రీ ఫోర్డ్ తర్వాత అత్యంత సంపన్నుడుగా పేరు తెచ్చుకున్న మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ జిల్లాల నుంచి, జాగీర్దార్ల ద్వారా, దేశముఖ్‌ల ద్వారా, తన సొంత రెవెన్యూ బలగాల ద్వారా కోట్లాది రూపాయలు సంపాదించినప్పటికీ, అందులో కొంత భాగాన్ని హైదరాబాద్ నగరాభివృద్ధికీ, హైదరాబాదులో ఆధునిక విద్యా, వైద్య, రవాణా సౌకర్యాలు కల్పించడానికీ ఉపయోగించినప్పటికీ, మిగిలిన జిల్లాలన్నీ ఏ ఆధునిక సౌకర్యానికీ నోచుకోక వెనుకబాటుతనంలోనే ఉంచబడ్డాయి, ఉండిపోయాయి. ఈ విషయం, తెలుగు భాషా ప్రాంతాలైన వరంగల్లు, కరీంనగరం, అదిలాబాదు, నిజామాబాదు, మెదక్, నల్లగొండ, మహబూబ్‌నగరం, అత్రాఫ్ బల్దా జిల్లాలకు మాత్రమే కాక, మరాఠీ భాషా ప్రాంతాలైన ఔరంగాబాదు, భీడ్, పర్భనీ, నాందేడ్, ఉస్మానాబాదు జిల్లాలకు, కన్నడ భాషా ప్రాంతాలైన గుల్బర్గా, రాయచూరు, బీదర్‌లకు కూడ సమానంగా వర్తిస్తుంది. మహారాష్ట్రలోని పాత హైదరాబాదు సంస్థానంలో ఉండిన మరాఠ్వాడా ప్రాంతాన్ని పశ్చిమ మహారాష్ట్రతో పోల్చిచూసినా, కర్ణాటకలో ఇప్పటికీ హైదరాబాదు కర్ణాటక అని పిలిచే ప్రాంతాన్ని, మైసూరు కర్ణాటక అని పిలిచే ప్రాంతంతో పోల్చిచూసినా నిజాం పాలన వారసత్వంగా మిగిల్చిన వెనుకబాటుతనం కొట్టవచ్చినట్టు కనబడుతుంది.

అయితే ఇక్కడ ప్రశ్న ఆ రాచరిక భూస్వామ్య వారసత్వానిది కాదు. ఆ వారసత్వాన్ని వదల్చడానికి, ఏకమయిన ప్రాంతాలమధ్య అసమానతలు తగ్గించడానికి ప్రజాస్వామికమని తమనుతాము నిర్వచించుకున్న సమైక్య ప్రభుత్వాలు ఏ చర్యలు చేపట్టాయనేది ముఖ్యమైన ప్రశ్న. అంతకుముందే బ్రిటిష్ పాలనవల్ల ఆధునిక సౌకర్యాలు పొందిన కోస్తాంధ్ర ప్రాంతంతో పోల్చిచూసి, తెలంగాణకు ఎక్కువ సౌకర్యాలు, అవకాశాలు కల్పించవలసి ఉండగా, ఆ పని చేయలేదు సరిగదా, 1956 తర్వాత ఏ ఒక్క సంవత్సరంలోనూ మొత్తం కెటాయింపులలో జనాభా నిష్పత్తి ప్రకారం 40 శాతం వాటా గాని, విస్తీర్ణం నిష్పత్తి ప్రకారం 42 శాతం వాటా గాని, రెవెన్యూ వసూళ్ల ప్రకారం 40 శాతం వాటాగాని కూడ అందలేదు. తెలంగాణ నుంచి వచ్చే ఆదాయపు మిగులును తెలంగాణలోనే ఖర్చు పెట్టాలని పెద్దమనుషుల ఒప్పందం (1956) నిర్దేశించినా, ఆ ఒప్పందం అమలుకాలేదు. నీటిపారుదల సౌకర్యాల కల్పనలోనూ, విద్యా, వైద్య, రవాణా సౌకర్యాల కల్పనలోనూ, స్థానికులకే ఉద్యోగాలు కల్పించడంలోనూ, తెలంగాణకు న్యాయంగా అందవలసిన వాటా అందలేదు.

నాలుగు దశాబ్దాలుగా సాగుతున్న ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఆందోళనలోనూ, గత పది సంవత్సరాలుగా విస్తృతంగా వెలువడిన సాహిత్యంలోనూ ఆ అంశాల గురించిన గణాంకాలు విరివిగానే బయటివచ్చాయి. గత పది సంవత్సరాలలో వందకు పైగా వెలువడిన ఇటువంటి పుస్తకాలనుంచి, ప్రభుత్వం ప్రకటించిన గణాంకాలనుంచి, స్వతంత్ర పరిశోధకులు తవ్వితీసిన వాస్తవ గణాంకాలనుంచి తులనాత్మక పరిశీలన చేసి తెలంగాణ గురయిన అసమానత గురించి ఒక సమగ్ర నివేదికను ప్రచురించవలసిన అవసరం ఉంది.

ఆ అసమానత గురించి, కోల్పోయిన అభివృద్ధి అవకాశాల గురించి మాత్రమే తెలంగాణ ప్రత్యేకరాష్ట్ర ఆకాంక్ష పెల్లుబుకుతున్నదని చాలమంది అనుకుంటూ ఉంటారు. అందువల్ల అభివృద్ధి ఆశచూపితే ఆ ఆకాంక్ష చల్లారిపోతుందనుకుంటారు. మొదటిసారి, 1969లో ప్రత్యేక రాష్ట్ర ఆందోళన జరిగినప్పుడు, ఈ అంశం కొంత ఎక్కువగానే బయటపడినమాట నిజమే. అప్పటికి సమైక్య ఆంధ్రప్రదేశ్ ఏర్పడి 13 సంవత్సరాలు మాత్రమే అయినందువల్ల, ఆ రాష్ట్రం ఏర్పాటు కూడ ఒక పెద్దమనుషుల ఒప్పందం వల్ల జరిగి, తెలంగాణ ప్రాంతానికి కొన్ని ప్రత్యేక రక్షణలు ఇచ్చినందువల్ల, ఆ రక్షణలను అమలు చేయాలని, అవి అమలు చేయకపోతే రాష్ట్రాన్ని విభజించాలని అప్పటి ఆందోళన జరిగింది. అప్పటి దృష్టి ప్రధానంగా పెద్దమనుషుల ఒప్పందం లోని రక్షణలమీదనే ఉండింది. అంటే ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ కూడ ఉన్నప్పటికీ అసమానతే ప్రధానాంశమయింది.

ఆ అసమానతలను తీర్చేపని అప్పుడేకాదు, ఆ తర్వాత మూడున్నర దశాబ్దాలలోనూ జరగలేదుగాని, ఇప్పటికీ తెలంగాణ సమస్య అంతా అసమానత, అభివృద్ధి రాహిత్యం సమస్యేనన్నట్టు ప్రవర్తిస్తూ, మన పాలకవర్గాలు సామాజిక సమస్యలపట్ల తమకు కనీస అవగాహన కూడ లేదన్న విషయం రుజువు చేసుకుంటున్నాయి. నిజమైన సామాజిక సమస్యల తీవ్రతను, విస్తృతిని తగ్గించిచూపి, మసిపూసిమారేడుకాయ

చేయగలమని అనుకుంటున్నాయి.

ఇప్పటికీ తెలంగాణ వెనుకబాటుతనం, కోస్తాంధ్రతో పోలిస్తే వివక్ష, అసమానత నిజమయిన సమస్యలేగాని, వాటితో సమానంగానో, కాస్త ఎక్కువగానో ఇతర సమస్యలు కూడ ఉన్నాయి. తెలంగాణ ప్రజల ఆకాంక్షలను విస్మరించడంలో, అణచివేయడంలో, పక్కదారిపట్టించడంలో పాలకవర్గాలు చేసిన ప్రయత్నాల వల్ల, ఆ ఆకాంక్షలను తీర్చడానికి క్షమించడానికి వీలులేనంత ఆలస్యం ఉద్దేశ్యపూరితంగానే చేసినందువల్ల ఆ సమస్యకు ఉన్న విభిన్నకోణాలు బయకివస్తూ ఉన్నాయి. ఆ సమస్యలు మరింత జటిలంగా, సంక్లిష్టంగా మారుతున్నాయి. ఇప్పుడు ఇంకా అభివృద్ధి గురించో, వెనుకబాటుతనం గురించో మాట్లాడడం, ఆ వెనుకబాటుతనాన్ని పోగొట్టే అభివృద్ధి పథకాల గురించి, ప్రత్యేక ప్యాకేజీల గురించి చర్చించడం చరిత్రను ఏ ముప్పైయేళ్ల వెనుకకో, యాభై యేళ్ల వెనుకకో తీసుకుపోవడమే.

అందువల్ల, ఇవాళ వెనుకబాటుతనం గురించి, అభివృద్ధి గురించి మాట్లాడడం తో సమానంగానో, ఇంకా ఎక్కువగానో చరిత్ర గురించి మాట్లాడవలసి ఉంటుంది. ఏ చరిత్ర తెలంగాణను వెనుకబాటుతనానికి, అభివృద్ధిరాహిత్యానికి బలిచేసిందో వివరంగా అధ్యయనం చేయవలసి ఉంటుంది.

ఆ చరిత్రను 1956కు చాల ముందుగానే ప్రారంభించవలసి ఉంటుంది. తెలుగు భాష మాట్లాడే ప్రజలు రెండు విభిన్న పాలనల కింద ఉన్నారని, వారంతా ఒకే పాలన కిందికి రావాలని ఇరవయో శతాబ్ది తొలిరోజుల నుంచే ఆలోచనలున్నాయి. ఆ ఆలోచనలు అన్ని రాజకీయ పక్షాలనుంచీ, మేధావులనుంచీ వ్యక్తమయ్యాయి. జాతీయ కాంగ్రెస్ 1927లోనే భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు తన అనుకూలతను ప్రకటించింది. తెలంగాణతో సహా తెలుగుభాషా ప్రాంతాలన్నీ ఏకంకావాలని 1936లో ఆంధ్రా కాంగ్రెస్ స్వరాజ్య పార్టీ ప్రతిపాదించింది. మామిడిపూడి వెంకటరంగయ్య 1937లోనే ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికకు రాసిన ఒక వ్యాసంలో ఆ ప్రతిపాదన చేశారు. ఆ తర్వాత కోస్తాంధ్ర ప్రాంతం నుంచి ఎంతోమంది ఈ ఆలోచనను బలపరిచారు. కమ్యూనిస్టులు కూడ ఈ ఆలోచనకు సుముఖంగా ఉన్నారనేందుకు సూచనగా పుచ్చలపల్లి సుందరయ్య 1946లో 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' పుస్తకం రాశారు. కోస్తాంధ్ర ప్రాంతానికి చెందిన కమ్యూనిస్టులకు ఈ విశాలాంధ్ర ఆలోచన 1937 నుంచే ఉందని సెలిగ్ హారిసన్ రాశారు.

అయితే మొదటినుంచీ కూడ తెలంగాణ ప్రాంతంలో తెలుగుజాతి ఐక్యతగురించి అంతగా ఏకీభావం ఉన్నట్టు కనబడదు. ఇరవయో శతాబ్ది తొలిరోజుల నుంచే, హైదరాబాద్ సంస్థానంలో ఆంధ్ర భాషా నిలయాలు ఏర్పాటు చేయడం, 1921లో ఆంధ్ర జనసంఘం ఏర్పాటు చేయడం, దాన్ని 1930 కల్లా నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభగా మార్చడం చూస్తే అప్పటి తెలంగాణ ప్రజా నాయకులు ఆంధ్ర ప్రాంతంతో భిన్నత్వాన్ని చూసుకున్నారని అనిపించదు. అయితే అది రాజకీయ వివాదంగా మారి, అప్పటి ప్రభుత్వాధికారి నవాబ్ అలీ యార్ జంగ్ బహదూర్ "మద్రాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలతో తెలంగాణ జిల్లాలను విలీనం చేయడమే మీ ఆంధ్రోద్యమ లక్ష్యం లాగుందని ప్రభుత్వం దృష్టికి వచ్చింది" అని 1936లో రాస్తే, అటువంటి ఆచరణసాధ్యంకాని ఆలోచనలు చేయడానికి తాము అంత తెలివితక్కువ వాళ్లం కామని మాడపాటి హనుమంతరావు జవాబు రాశారు. కాని క్రమక్రమంగా హైదరాబాదు సంస్థానంలో కూడ అటు కాంగ్రెస్ లోనూ, ఇటు కమ్యూనిస్టులలోనూ విశాలాంధ్ర ఆలోచనలు బలం పుంజుకున్నాయి.

ఈలోగా బ్రిటిష్ వలసపాలకులు వెళ్లిపోయి, కాంగ్రెస్ అధికారంలోకి రావడం, హైదరాబాదు పై పోలీసుచర్య జరిగి, అది భారత యూనియన్‌లో విలీనంకావడం, మద్రాసు రాష్ట్రం నుంచి తెలుగు జిల్లాలు వేరుపడి ఆంధ్ర రాష్ట్రం ఏర్పడడం, ఆ కొత్త ఆంధ్ర రాష్ట్రం తనకంటూ ఒక రాజధానీ నగరం లేక తాత్కాలిక రాజధానిగా కర్నూలు నుంచి పాలన సాగిస్తూ, హైదరాబాదు మీద కన్ను వేయడం లాంటి పరిణామాలన్నీ జరిగిపోయాయి. అప్పుడు కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాల పునర్విభజన కోసం జస్టిస్ సయ్యద్ ఫజల్ అలీ అధ్యక్షతన, హృదయనాథ్ కుంజ్రూ, కె.ఎం. పణిక్కర్ సభ్యులుగా ఒక కమిషన్ ను నియమించింది. ఆ కమిషన్ 1954 జూన్ - జులైలలో హైదరాబాదు వచ్చి వేరువేరు రాజకీయ పక్షాలనుంచి, ప్రజా సమూహాలనుంచి అభిప్రాయాలు సేకరించింది. హైదరాబాదు రాష్ట్రాన్ని భాషాప్రాతిపదికపై మూడుభాగాలు చేసి, తెలంగాణను ఆంధ్ర రాష్ట్రంతో కలపాలని ఒక అభిప్రాయం, హైదరాబాదు రాష్ట్రాన్ని విభజించకుండా యథాతథంగా ఉంచాలని ఒక అభిప్రాయం, హైదరాబాదు రాష్ట్రాన్ని విభజించాలనీ కాని తెలంగాణను ఆంధ్రతో కలపకుండా స్వతంత్రంగా ఉంచాలని ఒక అభిప్రాయం వచ్చాయని కమిషన్ రాసింది.

తలసరి రెవెన్యూ ఆంధ్ర రాష్ట్రంలో తొమ్మిది రూపాయల ఆరు అణాలు ఉండగా, తెలంగాణలో పదిహేడు రూపాయలుగా ఉందని, ప్రభుత్వానికి సాలీనా తెలంగాణ నుంచి ఐదుకోట్ల రూపాయల అదనపు ఆదాయం వస్తున్నదని, రాయలసీమనుంచి, కృష్ణా, గుంటూరు జిల్లాలనుంచి భూస్వాములు వచ్చి తెలంగాణలో భూములు కొనేస్తారని, పేద తెలంగాణ రైతులు ఇప్పుడు చేతికందే డబ్బులతో మురిసిపోవచ్చునని, కాని దీర్ఘకాలంలో కలిగే నష్టాన్ని గుర్తించడంలేదని, విద్యావిషయకంగా అభివృద్ధి చెందిన కోస్తాంధ్ర వాసులు తెలంగాణను ముంచెత్తి ఉద్యోగావకాశాలన్నింటినీ తన్నుకుపోవచ్చునని కమిషన్ తనకు అందిన అనుమానాలన్నిటినీ నమోదు చేసింది. తెలంగాణను ప్రత్యేకరాష్ట్రంగా ఉంచాలని కొందరు నాయకులు చేసిన వాదనలో అమోదించవలసిన అంశాలు ఉన్నాయని, కనుక తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగా ఉంచడమే మంచిదని, లేదా 1961 ఎన్నికలలో వెలువడే ప్రజాభిప్రాయాన్ని బట్టి విలీనం గురించి నిర్ణయం తీసుకోవచ్చునని కమిషన్ 1955 సెప్టెంబర్ 30న సమర్పించిన నివేదికలు సూచించింది.

అయినా, కోస్తాంధ్ర నాయకుల ఒత్తిడికి తలఒగ్గి, కేంద్రప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు పావులు కదిపింది. అప్పటివరకూ తెలంగాణ ప్రత్యేకరాష్ట్రాన్ని సమర్థిస్తుండిన హైదరాబాద్ ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు, 1955 అక్టోబర్‌లో ఢిల్లీలో జరిగిన ముఖ్యమంత్రుల సమావేశంలో ఆంధ్ర-తెలంగాణ విలీనాన్ని సమర్థిస్తూ ప్రకటన చేసి అందరినీ ఆశ్చర్యపరిచారు. ఇందుకు తెరవెనుక, కాంగ్రెస్ లోపల చాల రాజకీయాలు జరిగాయి. ఇటు తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగా ఉంచడానికి, అటు ఆంధ్ర-తెలంగాణ సమైక్యరాష్ట్రం ఏర్పరచడానికి

చాల ప్రయత్నాలు జరిగాయి. క్రమక్రమంగా సమైక్యవాదులది పైచేయి కావడంతో, కనీసం తెలంగాణకు రక్షణలు కల్పించే ఒప్పందం అయినా చేసుకోవాలనే ఆలోచన వచ్చింది. (ఆశ్చర్యకరంగా, రాయలసీమ నాయకులు కూడ కోస్తాంధ్ర నాయకులమీద రెండుదశాబ్దాల కింద ఇటువంటి అనుమానాలే ప్రకటించి, 1937లో శ్రీబాగ్ ఒడంబడిక ద్వారా తమ హక్కుల రక్షణకు లిఖిత వాగ్దానం పొందారు. ఆ ఒడంబడికలోని హామీలు కూడ అరకొరగానే అమలయ్యాయి.)

ఆ పూర్వరంగంలో 1956 ఫిబ్రవరి 19న ఢిల్లీలో హైదరాబాద్ హౌజ్‌లో కోస్తాంధ్ర నుంచి బెజవాడ గోపాల్ రెడ్డి, అల్లూరి సత్యనారాయణరాజు, నీలం సంజీవరెడ్డి, గౌతు లచ్చన్న, తెలంగాణ నుంచి బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకటరంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి, జె.వి. నర్సింగరావు 'పెద్ద మనుషుల ఒప్పందం' మీద సంతకాలు చేశారు.

ఆ ఒప్పందంలో ఉన్న 14 అంశాలలో ముఖ్యమైనవే అమలులోకి రాలేదు. తెలంగాణ ప్రాంతీయ మండలి ఏర్పాటు వంటి ఒకటి రెండు అంశాలు వాస్తవరూపం ధరించినప్పటికీ, వాటికి ఏ అధికారాలూ లేకుండా చేసి, తూట్లు పొడవడానికి అన్ని ప్రయత్నాలూ జరిగాయి. అప్పటికి ఉన్న ఉద్యోగులకు ఉద్యోగభద్రత కల్పించడంలో, కొత్త ఉద్యోగాలు స్థానికులకు కల్పించడంలో, తెలంగాణలోని వ్యవసాయ భూముల అమ్మకాలపై పరిమితుల విషయంలో పెద్దమనుషుల ఒప్పందం విధించిన రక్షణలలో ఏ ఒక్కదాన్నీ ఖాతరు చేయలేదు. 1957 నుంచి పనిచేస్తూవచ్చిన తెలంగాణ ప్రాంతీయ మండలి తెలంగాణ అభివృద్ధి కోసం చేసిన సూచనలన్నిటినీ పక్కనపెట్టారు.

ఆ ఉల్లంఘన వల్ల ఏర్పడిన అసంతృప్తి 1969 నాటికి విద్యార్థులలో, ఉద్యోగులలో ఆందోళనకు దారితీసింది. ఆ ఆందోళన తెలంగాణ అంతటా విస్తరించి, ఒక సంవత్సరంపాటు క్రియాశీలంగా సాగింది. అన్ని ప్రజాఉద్యమాలతో వ్యవహరించినట్టుగానే పాలకవర్గాలు తీవ్రమైన అణచివేతద్వారా ఆ ఆందోళనను అణచివేయడానికి ప్రయత్నించాయి. తెలంగాణ జిల్లాన్నిటా జరిగిన పోలీసు కాల్పులలో 370 మంది విద్యార్థులు, యువకులు మరణించారు. విద్యార్థులు ఒక విద్యా సంవత్సరం నష్టపోయారు. కొన్ని నెలలపాటు ప్రభుత్వ కార్యాలయాలు పనిచేయలేదు. జనజీవనం స్తంభించిపోయింది. ఈ ఆందోళన ప్రభావం పార్లమెంటరీ ఎన్నికలమీద కూడ పడి, 1971లో లోక్‌సభకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో తెలంగాణలోని 14 స్థానాలకుగాను, తెలంగాణ ప్రజాసమితి 10 స్థానాలను గెలుచుకోగలిగింది.

ఇలా ఉండగా, హైదరాబాదు సంస్థానంలో 1919లో ప్రభుత్వం జారీ చేసిన ముల్కీ నిబంధనలు చెల్లవంటూ ఆంధ్రప్రాంత ఉద్యోగులు న్యాయస్థానాన్ని ఆశ్రయించారు. రాష్ట్ర హైకోర్టు వారి వాదనను సమర్థిస్తూ, ముల్కీ నిబంధనలను కొట్టివేస్తూ తీర్పు ఇచ్చింది. దానిపై సుప్రీం కోర్టుకు వెళ్లగా, సుప్రీంకోర్టు ముల్కీ నిబంధనలు చెల్లుతాయని చెపుతూ హైకోర్టు తీర్పును కొట్టివేసింది. సుప్రీం కోర్టు తీర్పును వ్యతిరేకిస్తూ, రాష్ట్రవిభజనను కోరుతూ జై ఆంధ్ర ఉద్యమం (1972) ప్రారంభమయింది. జై ఆంధ్ర ఉద్యమాన్ని ఆపడానికనేపేరుతో కేంద్రప్రభుత్వం ఆరుసూత్రాల పథకం (1973) అనే తెలంగాణవ్యతిరేక రాజీ సూత్రాన్ని తెలంగాణ నాయకులమీద రుద్దింది. అప్పటికే కాంగ్రెస్ లో కలిసిపోయిన తెలంగాణ ప్రజా సమితి నాయకులు ఈ రాజీకి అంగీకరించారు. ఆరు సూత్రాల పథకం లో పేరుకు కొన్ని తెలంగాణ ప్రయోజనాల హామీలు ఉన్నప్పటికీ అవేవీ అమలులోకి రాలేదు సరిగదా, అవన్నీ అమలుచేసిన తర్వాత అమలులోకి రావలసిన ఆరోసూత్రం వల్ల, ముల్కీ నిబంధనలు, తెలంగాణ ప్రాంతీయ మండలి రద్దయిపోయాయి. ఆరు సూత్రాల పథకానికి కొనసాగింపుగా రాష్ట్రపతి ఉత్తర్వులు (1975) వచ్చి, తెలంగాణలో స్థానికుల ఉద్యోగాల రక్షణకొరకు రాజ్యాంగానికే సవరణ చేయవలసి వచ్చింది. అయినా రాష్ట్రపతి ఉత్తర్వులను అమలు చేసేందుకు ఒక ప్రభుత్వ ఉత్తర్వు ఇవ్వడానికి మరొక 11 సంవత్సరాలు వేచిచూడవలసి వచ్చింది. 1985 డిసెంబర్‌లో వచ్చిన ఆ జీవో 610 ఇప్పటికి ఇరవై సంవత్సరాలు గడిచినా అమలుకు నోచుకోలేదు. ఆ జీవో ను అమలు చేయాలనే డిమాండ్ గత ఐదారు సంవత్సరాలుగా పెద్దఎత్తున సాగుతున్నప్పటికీ, ఆ దిశగా ప్రయత్నాలేవీ మొదలు కాలేదు.

ఈ చరిత్రంతా గుర్తు చేయడం ఎందుకంటే, సమైక్యరాష్ట్రంలో తెలంగాణ ప్రయోజనాలు నెరవేరడం అసాధ్యమని ఇప్పటికి ఐదు దశాబ్దాలుగా అడుగడుగునా రుజువయిందని చూపడానికే. తెలంగాణకు చెందిన నాయకులు ముఖ్యమంత్రులుగా ఉన్నప్పుడు కూడ తెలంగాణ ప్రయోజనాలు నెరవేరలేదంటే సమైక్యరాష్ట్రంలో అమలయ్యే రాజకీయార్థిక పాలనావిధానాలు అందుకు అనుకూలమైనవి కాకపోవడంచేతనే. ఆ నాయకులకు తెలంగాణ పట్ల తగినంత ప్రేమ, చిత్తశుద్ధి లేకపోవడం అదనపు కారణమేతప్ప ఏకైక కారణం కాదు.

సమైక్య రాష్ట్రంలో అమలయిన ఆ ప్రత్యేక రాజకీయార్థిక పాలనా విధానాల గురించి ఇంకా వివరమైన పరిశోధనలు జరగవలసే ఉందిగాని, స్థూలంగా ఆ విధానాలను నిర్ణయించిన ప్రాతిపదికలను గుర్తించవచ్చు. ఉపజాతీయాకాంక్షల పట్ల చిన్నచూపు, సాంస్కృతిక అణచివేత, అంతర్గత వలస విధానం, వనరులకోసం, ముడిసరుకులకోసం, చౌక శ్రామికులకోసం ఒక ప్రాంతాన్ని సొంత పెరడుగా - హింటర్ లాండ్ గా - వాడుకోవడం, స్థానికులకు ఏ రంగంలోనూ నిర్ణయాధికారాన్ని ఇవ్వకపోవడం, స్థానికంగా ఒక దళారీవర్గాన్ని, భాగస్వాములను తయారుచేసి, వారిని తమలో కలుపుకోవడం, ప్రదర్శన వస్తువులుగా చూపడం, స్థానిక ఆకాంక్షలను సమరశీలంగా వ్యక్తీకరించే శక్తులమీద తీవ్రమైన నిర్బంధాన్ని ప్రయోగించడం వంటి ప్రాతిపదికలమీద ఆ పాలనావిధానాలు ఆధారపడ్డాయి.

ఈ ప్రాతిపదికలన్నిటినీ కూడ చాల వివరంగా పరిశీలించవలసి ఉంటుంది. ఆ ప్రాతిపదికలు ఏయే స్థాయిలలో ఏ మేరకు పనిచేశాయో, వాటివల్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీసుకున్న ఏయే నిర్ణయాలు ఎంతమేరకు ప్రభావితమయ్యాయో చారిత్రక వాస్తవాల సహాయంతో, గణాంకాల సహాయంతో వివరించవలసి ఉంటుంది. అటువంటి లోతయిన విశ్లేషణ జరపకపోతే, ఆంధ్రప్రదేశ్ అభివృద్ధిలో తెలంగాణకు జరిగిన అన్యాయాన్ని, తెలంగాణ ఎదుర్కొన్న అసమానతను ఎవరో కొందరు వ్యక్తులకు ఆపాదించడం జరుగుతుంది. ఆయా సమయాలలో ఆయా వ్యక్తులు నిర్ణయాధికారంలో ఉండి అటువంటి నిర్ణయాలకు కారణమై ఉంటారుగాని, వారిని గురించి తెలుసుకోవడం ఎంత ముఖ్యమో, వారిని నడిపించిన శక్తులగురించి తెలుసుకోవడం అంతన్నా ముఖ్యం. ఆ దిశగా కృషిజరగవలసి ఉంది. ◆

# సమైక్య ఆంధ్రప్రదేశ్ - ప్రాంతీయ వ్యత్యాసాలు

-జె. శివరామ్

సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటై అర్ధశతాబ్ది పూర్తి కావస్తోంది. ఎందరో, మరెందరో త్యాగ ధనుల కృషి ఫలితంగా తెలుగుజాతి అంతా ఏకరాష్ట్రంగా ఒకే గొడుకు క్రిందకు రావడం ముదావహం. ఐకమత్యమే మహాబలం. కలసి ఉంటేనే కలదు సుఖం అన్నది ఆర్యోక్తి. కాని అప్పుడప్పుడు అవాంతరాలు, అపోహలు తలెత్తడమే కాకుండా కొన్ని స్వార్థపరశక్తులు అరాచకం సృష్టించాలని ప్రయత్నం చేస్తుంటారు. దీనికి రాజకీయాలను పావులుగా వాడుకొవడం కూడా జరుగుతుంది. వైషమ్యాలకు పోకుండా విధ్వంస శక్తుల కబంధ హస్తాల్లోగాని, నిరాశ, నిస్పృహ రాజకీయ అవకాశ వాదుల మాయమాటలకు ప్రలోభ పడకుండా ప్రజలు ఏకతాటిపై నడుస్తేనే రాష్ట్రం సమగ్రాభివృద్ధి దిశలో పయనించగలుగుతుంది. ఏ రాజకీయ పార్టీ అయినా ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నికల ద్వారా ప్రభుత్వం అధికార పగ్గాలు చేపట్టినప్పుడు రాజకీయాలకు, ప్రాంతీయ తత్వాలకు అతీతంగా ప్రజోపకర పథకాలు చేపట్టి ప్రాంతీయ వివక్షతకు తావివ్వకుండా అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టితే జాతిపిత మహాత్మా గాంధీజీ కలలు కన్న రామరాజ్య స్థాపనకు అవకాశముంటుంది. కాని కొన్ని స్వార్థపర శక్తులు ఇటీవల కాలంలో వేర్పాటు వాదానికి ఆజ్యం పోస్తున్నారు. ఇది ఎంతవరకు సమంజసమో ప్రజలే నిర్ణయించాలి.

భౌగోళికంగా ఆంధ్రప్రదేశ్‌లో నాలుగు ప్రాంతాలు మిళితమైవున్నాయి. అవి 1) ఉత్తర కోస్తా ఆంధ్ర - ఈ ప్రాంతంలో మూడు జిల్లాలు వున్నాయి. అవి శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం. 2) దక్షిణ కోస్తా ఆంధ్ర - ఈ ప్రాంతంలో ఆరు జిల్లాలు వున్నాయి. అవి తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలు. 3) రాయలసీమ - ఈ ప్రాంతంలో నాలుగు జిల్లాలు వున్నాయి అవి చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలు. ఇక నాల్గోది తెలంగాణ ప్రాంతం - ఈ ప్రాంతంలో పది జిల్లాలు వున్నాయి. మహబూబ్‌నగర్, రంగారెడ్డి, హైదరాబాద్, మెదక్, నిజామాబాద్, అదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్గొండ జిల్లాలు వున్నాయి. ఈ నాలుగు ప్రాంతాల్లో పుష్కలంగా సహజ వనరులు వేర్వేరు విధంగా లభ్యమవుతున్నా, వాటిని సద్వినియోగ పరచుకోవటానికి, ప్రభుత్వం శాయశక్తులా కృషిచేస్తున్నా కుటిల రాజకీయాల వల్ల కొన్ని అవాంతరాలు తలెత్తుతూ వుంటాయి. వాటిని అధిగమిస్తే రాష్ట్రం నిస్సందేహంగా సస్యశ్యామలం అవుతుంది. ఈ నేపథ్యంలో రాష్ట్రంలో ప్రాంతీయ వ్యత్యాసాలను అర్థ గణాంక శాఖ విడుదల చేసిన గణాంకాల ప్రకారం విశ్లేషించవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది. కాని ప్రప్రథమంగా రాజకీయ అసమానతల గురించి చర్చించటం ఎంతైనా అవసరం.

మన రాష్ట్రం అవతరించిన నాటి నుండి రాష్ట్ర ముఖ్యమంత్రి పదవి దక్షిణ కోస్తా ఆంధ్రకు చెందిన కాసు బ్రహ్మానందరెడ్డి, భవనం వెంకట్రామ్, నేదురుమల్లి జనార్ధన్ రెడ్డి, రాయలసీమకు చెందిన నీలం సంజీవరెడ్డి, దామోదరం సంజీవయ్య, కోట్ల విజయభాస్కర్ రెడ్డి, నందమూరి తారకరామారావు, (నందమూరి తారకరామారావు గుడివాడ, హిందూపూర్ నియోజకవర్గాల నుండి గెలిచి, గుడివాడ నియోజకవర్గాన్ని వదులుకోవడం జరిగింది. అందువలన ఎన్.టి.ఆర్. ను రాయలసీమకిందనే వరిగణించటం జరిగింది) నారా చంద్రబాబునాయుడు, డా వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి మున్నగువారు, ఇక తెలంగాణ నుండి పి.వి. నరసింహారావు, జలగం వెంగళరావు, టంగుటూరి అంజయ్య, మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రి పదవిని చేపట్టడం జరిగింది. కానీ ఉత్తర కోస్తా ఆంధ్ర నుండి ఏ ఒక్క రాజకీయ నాయకుడూ రాష్ట్ర ముఖ్యమంత్రి పదవి చేపట్టేందుకు అవకాశం ఇంతవరకు రాలేదు సరికదా ఆ అవకాశం మృగ్యమే అన్నట్లు కానవస్తోంది. అనగా ఉత్తర కోస్తా ఆంధ్ర రాజకీయంగా వెనుకబడ్డట్టు కానవస్తోంది.

**ప్రాంతాల వారీగా ఆర్థిక వ్యత్యాసాలు**

ప్రజాస్వామ్య వ్యవస్థలో రాష్ట్రంలో విభిన్న ప్రాంతాల అభివృద్ధి తెలుసుకోవటానికి కాని, వ్యత్యాసాలు గుర్తించటానికి గాని గణాంకాలు దోహదపడుతున్నాయి. మన రాష్ట్రం భౌగోళిక విస్తీర్ణం 2.75 లక్షల చ.కి.మీ. ప్రాంతాల వారీగా చూస్తే తెలంగాణ ప్రథమ స్థానంలో వుండగా దక్షిణ కోస్తా రెండవ స్థానంలో, రాయలసీమ మూడవ స్థానంలో, ఉత్తర కోస్తా ఆంధ్ర నాల్గవ స్థానంలో వున్నాయి. 2001 జనాభా లెక్కల ప్రకారం మన రాష్ట్ర జనాభా 7.62 కోట్లు, దీనిలో తెలంగాణ వాటా 40.7 శాతం కాగా దక్షిణ కోస్తా 30.3 శాతం, రాయలసీమ 17.7 శాతం ఉత్తర కోస్తా ఆంధ్ర 11.3 శాతం తదుపరి స్థానాల్లో వున్నాయి. ఏ ప్రాంతంలో నైనా ఆర్థికాభివృద్ధి రేటు జనాభా పెరుగుదల రేటుపై ఆధారపడి వుంటుంది. అనగా జనసాంద్రతను బట్టి ప్రాంతాల ఆర్థిక స్థితిగతులను బేరీజు వేయవచ్చు. మన రాష్ట్రం మొత్తం మీద జనసాంద్రత 2001 జనాభా లెక్కల ప్రకారం ప్రతి చ.కి.మీ.కు 277 వుండగా ఉత్తర కోస్తాలో 367, దక్షిణ కోస్తా ఆంధ్రలో 333, తెలంగాణలో 270, రాయలసీమలో 200 వుంది.

విద్య యే ప్రగతికి మెట్టు. 2001 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్రం మొత్తం మీద అక్షరాస్యులు 399.34 లక్షలు. ప్రాంతాల వారీగా చూస్తే తెలంగాణ ప్రథమ స్థానంలో వుండగా దక్షిణ కోస్తా ఆంధ్ర రెండవ స్థానంలో, రాయలసీమ మూడవ స్థానంలో, ఉత్తర కోస్తా ఆంధ్ర అట్టడుగునవుంది.

షెడ్యూల్డ్ కులాల వారిలో అక్షరాస్యులు దక్షిణ కోస్తా ఆంధ్రలో అధికంగా వుండగా తెలంగాణ రెండవ స్థానంలో వుంది. కాని షెడ్యూల్డ్ తెగల వారిలో అక్షరాస్యులు తెలంగాణాలోనే అధికంగా వున్నారు.

ప్రధానంగా మనది వ్యవసాయ రాష్ట్రం. రాష్ట్రం మొత్తం మీద

వ్యవసాయం పనివారు 172.21 లక్షలు. వీరిలో అత్యధికంగా తెలంగాణలోనే వున్నారు. దక్షిణ కోస్తా ఆంధ్ర రెండవ స్థానంలో వుంది. ఈ దశలో కూడా ఉత్తర కోస్తా ఆంధ్ర చివరి స్థానంలో వుంది.

ఆరోగ్యమే మహాభాగ్యం అన్నారు. రాష్ట్రం మొత్తం మీద 1570 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు వుండగా అత్యధిక భాగం తెలంగాణలో వున్నాయి. దక్షిణ కోస్తా ఆంధ్ర తదుపరి స్థానంలో వుండగా ఉత్తర కోస్తా ఆంధ్రలో 214 మాత్రమే వున్నాయి. అలోపతి ఔషధాలయాలు దక్షిణ కోస్తా, తెలంగాణాలో దాదాపు సమానంగా వుండగా ఉత్తర కోస్తాలో 32 మాత్రమే వున్నాయి. క్రమబద్ధ వైద్యులు రాష్ట్రం మొత్తం మీద 7415 వుండగా వీరిలో సింహ భాగం తెలంగాణలోనే వున్నారు. కాంట్రాక్టు వైద్యులు కూడ తెలంగాణ ప్రాంతంలోనే అధికంగా వున్నారు.

నీటిపారుదల రంగానికి ప్రస్తుతం అధికారంలో వున్న కాంగ్రెస్ పార్టీ ప్రభుత్వం అత్యంత ప్రాధాన్యతనిస్తోంది. ఈ రంగానికి వార్షిక ప్రణాళికలో కూడ కేటాయింపులు అధికం. సేద్యానికి అందుబాటులో లేని భూమి రాష్ట్రం మొత్తం మీద 2005-06వ సంవత్సరంలో 108.98 లక్షల హెక్టార్లు వుండగా దీనిలో దాదాపు 38 శాతం తెలంగాణలోనే వుంది. దక్షిణ కోస్తా, రాయలసీమకు దాదాపు సరిసమానంగా వుండగా ఉత్తర కోస్తా ఆంధ్రకు 11.52 లక్షల హెక్టార్లు వుంది. కాగా సేద్యానికి తగిన భూమి రాష్ట్రం మొత్తం మీద 154.94 లక్షల హెక్టార్లు వుండగా ప్రాంతాల వారీగా చూస్తే తెలంగాణలోనే అత్యధికంగా వుంది. పంట సేద్యంలోలేని వాడుక భూమి కూడ తెలంగాణలోనే ఎక్కువగా వుంది. స్థూలనీటిపారుదల భూమి మొత్తం స్థూలంగా పండించిన భూభాగంలో దక్షిణ కోస్తా ఆంధ్రలో 61 శాతం వుండగా తెలంగాణలో 46 శాతం వుంది. రాయలసీమలో 24 శాతమే వుంది. తెలంగాణ, రాయలసీమకు సాగుబడికి, సేద్యానికి నీరు ఎంతైనా ఆవశ్యకం. ఆహారధాన్యాల ఉత్పత్తి రాష్ట్రంలో ఎన్నడూ లేనంతగా 2005-06 సంవత్సరంలో 169.50 లక్షల మెట్రిక్ టన్నుల ఉత్పత్తి జరిగింది. ఈ దిశలో తెలంగాణ మొదటి స్థానంలో వుండగా, దక్షిణ కోస్తా రెండవ స్థానంలో, ఉత్తర కోస్తా ఆంధ్ర చివరి స్థానంలో వుంది.

భూకమతాల, సాగుకమతం తెలంగాణలో అధికంగా వుండగా సగటు కమతం సైజు రాయలసీమలో 1.61 హెక్టార్లు వుండగా తెలంగాణలో 1.37 వుంది.

పశు కృత్రిమ గర్భాదాన కేంద్రాలు తెలంగాణలో అధికంగా వుండగా పశుగ్రాసం కోసం అభివృద్ధి చేయబడిన భూమి దక్షిణ కోస్తా ఆంధ్రలో, తెలంగాణలో దాదాపు సమంగా వుండగా ఉత్తర కోస్తా ఆంధ్రలో అతి తక్కువగా వుంది. పశుగణం కూడ తెలంగాణలోనే అధికంగా వుంది.

పరిశ్రమలు ప్రగతికి మార్గదర్శకాలు. రాష్ట్రం మొత్తం మీద వార్షిక పరిశ్రమ సర్వే ప్రకారం 14,802 వుండగా తెలంగాణలోనే అధికంగా వున్నాయి. దక్షిణ కోస్తా ఆంధ్ర రెండవ స్థానంలో వుంది. ఈ ఫ్యాక్టరీలలో పనిచేయు ఉద్యోగులు గూడ తెలంగాణలోనే అధికంగా వున్నారు. స్థూలంగా తయారీ వల్ల కలిసిన / పెరిగిన విలువ అత్యధికంగా 47.2 శాతం తెలంగాణలో వుండగా ఉత్తర కోస్తా రెండవ స్థానంలో వుంది. ఈ దిశలో రాయలసీమ అట్టడుగున వుంది.

నీరు ఎంత ఆవశ్యకమో విద్యుత్ గూడ అంతే ఆవశ్యకం. సగటు తలసరి విద్యుత్ వినియోగం తెలంగాణలో 592 కి.వా.గం. (కిలో వాట్లు/గంటకు) వుండగా రాయలసీమలో 450 కి.వా.గం. వుంది. విద్యుత్ పంపుసెట్లు 59.3 శాతం తెలంగాణలోనే వున్నాయి. దక్షిణ కోస్తా రెండవ స్థానంలో వుండగా, ఉత్తర కోస్తా చివరి స్థానంలో వుంది.

రవాణా ఆర్థిక ప్రగతి సూచించే ఒక ముఖ్య భూమిక. ప్రాంతాల వారీగా చూస్తే రోడ్లు పొడవు తెలంగాణలోనే అధికంగా వుండటమే కాకుండా మోటారు వాహనాలు కూడ ఈ ప్రాంతంలోనే అధికంగా వున్నాయి.

అబ్కారి రాబడి వసుళ్లు రాష్ట్రం మొత్తం మీద రు. 2147 కోట్లు వుండగా తెలంగాణ వాటానే 75 శాతం.

స్థూల ప్రాంతీయ ఆదాయం గణాంకాలు 2003-04 సంవత్సరానికి మాత్రమే లభిస్తున్నాయి. నిలకడ ధరల్లో చూస్తే తెలంగాణ ప్రాంతంలోనే అధికంగా వుండగా దక్షిణ కోస్తా రెండో స్థానంలో, ఉత్తర కోస్తా ఆంధ్ర చివరి స్థానంలో వుంది.

రాష్ట్రం మొత్తం మీద ఉద్యోగులు 12.28 లక్షలు వుండగా తెలంగాణలోనే 5.95 లక్షలు వున్నారు. కాని రాష్ట్రంలో 610 జీవోను అమలు చేస్తే ఈ సంఖ్య తగ్గే అవకాశం వుంది. దీనివలన తెలంగాణ వారికి ఉద్యోగావకాశాలు మెరుగుపడతాయి. గిర్‌గ్లానీ కమీషన్ నివేదికను తు.చ. తప్పకుండా అమలు చేయవలసిన ఆవశ్యకత ప్రభుత్వ తక్షణ కర్తవ్యంగా వుండాలి. నిరుద్యోగులు కూడా తెలంగాణలోనే అధికంగా వున్నారు. రాష్ట్రంలో ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలు, హైస్కూళ్లు తెలంగాణలోనే అధికంగా వుండగా, వీటిలోని ఉపాధ్యాయులు గూడ తెలంగాణలోనే అధికంగా వున్నారు.

తపాలశాఖ కమ్యూనికేషన్ రంగంలో ప్రధాన భూమిక పోషిస్తోంది. రాష్ట్రం మొత్తం మీద తపాలా కార్యాలయాలు 16,190 వుండగా తెలంగాణ 5,830 కార్యాలయాలతో ప్రథమ స్థానంలో వుంది. బ్యాంకు ఆఫీసులలో తెలంగాణ ప్రథమ స్థానంలో వుండగా రుణ డిపాజిట్ల దామాషా దక్షిణ కోస్తా ఆంధ్రలో 88.4 వుండగా రాయలసీమలో 73.9, తెలంగాణలో 72.2 వుంది. ఉత్తర కోస్తా ఆంధ్ర చివరి స్థానంలో వుంది.

పై విశ్లేషణ బట్టి తేలేదేమిటంటే రాష్ట్రం వివిధ ప్రాంతాల వారీగా చూస్తే ఉత్తర కోస్తా ఆంధ్ర వెనుకబడి వున్నట్లు అధికార గణాంకాలు తేటతెల్లంగా తెలుపుతున్నాయి. ఇంట్లో ఎలుకలున్నాయని ఇంటికి నిప్పంటించుకొంటామా? ప్రతి దానికి ఒక మంచి పరిష్కారముంటుంది. మహాకవి భారవి చెప్పినట్లు ఏ పనైనా ఆలోచించుకొని చేయాలి. ఏ ప్రాంతంలోనైనా వెనుకబాటు తనాన్ని నిర్మూలించాలంటే మనకు అందుబాటులో వున్న ప్రకృతి వనరులను సద్వినియోగించుకోవాలి. తెలుగుజాతి నిండు గౌరవాన్ని కాపాడుకోవాలి. వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి, వేర్పాటు వాదం పేరుతో సమైక్య రాష్ట్రానికి లభించే అభివృద్ధి ఫలాలను కొన్ని స్వార్థపర వర్గాలు స్వాహాచేసే ప్రమాదం పొంచివుంది. విశాల దృక్పథం గల తెలుగు ప్రజలందరూ గమనించి మన రాష్ట్రసమైక్యతను పరిరక్షించుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది. ◆

## ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ వ్యత్యాసాలు

| సూచిక (1) | నిర్దేశ సంవత్సరం (2) | ఉత్తర కోస్తా ఆంధ్ర (3) | దక్షిణ కోస్తా ఆంధ్ర (4) | రాయలసీమ (5) | తెలంగాణ (6) | ఆంధ్రప్రదేశ్ (7) |
|---|---|---|---|---|---|---|
| విస్తీర్ణం ('000 చ.కి.) | 2001 | 23.5 | 69.3 | 67.4 | 114.80 | 275.00 |
| జనాభా (లక్షల్లో) | 2001 | 86.19 | 230.86 | 135.18 | 309.87 | 762.10 |
| జనసాంద్రత | 2001 | 367.00 | 333.00 | 200.00 | 270.00 | 277.00 |
| అక్షరాస్యులు (లక్షల్లో) | 2001 | 42.17 | 133.18 | 69.64 | 154.35 | 398.34 |
| మొత్తం పనివారి జనాభా (లక్షల్లో) | 2001 | 39.79 | 104.00 | 64.41 | 140.74 | 348.94 |
| వ్యవసాయ పనివారు (లక్షల్లో) | 2001 | 18.13 | 54.40 | 34.27 | 65.41 | 172.21 |
| షె. కులాల అక్షరాస్యులు (లక్షల్లో) | 2001 | 3.65 | 23.26 | 9.93 | 19.94 | 56.78 |
| షె. తెగల అక్షరాస్యులు (లక్షల్లో) | 2001 | 2.77 | 3.33 | 1.42 | 7.89 | 15.41 |
| ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు | 31-3-2005 | 214 | 442 | 312 | 602 | 1570 |
| అలోపతి ఔషధాలయాలు | 31-3-2005 | 32 | 94 | 43 | 93 | 262 |
| క్రమబద్ధ వైద్యులు (అలోపతి) | 31-3-2005 | 960 | 1,922 | 1,475 | 3,058 | 7,415 |
| కాంట్రాక్టు వైద్యులు (అలోపతి) | 31-3-2005 | 59 | 233 | 132 | 319 | 743 |
| సేద్యానికి అందుబాటులో లేని భూమి (లక్షల్లో) | 2005-06 | 11.92 | 27.87 | 27.81 | 41.38 | 109.98 |
| సేద్యానికి తగిన భూమి (లక్షల్లో) | 2005-06 | 11.01 | 36.97 | 37.64 | 69.32 | 154.94 |
| గుంట సేద్యంలో లేని వాడుక భూములు (లక్షల్లో) | 2005-06 | 0.54 | 3.29 | 1.64 | 4.07 | 9.54 |
| స్థూలంగా పండించిన భూభాగం (లక్షల హెక్టార్లు) | 2005-06 | 11.34 | 39.94 | 31.15 | 51.19 | 133.62 |
| స్థూలంగా నీటిపారుదల భూమి (లక్షల హెక్టార్లు) | 2005-06 | 4.46 | 24.37 | 7.62 | 23.51 | 59.96 |
| ఆహార ధాన్యాల ఉత్పత్తి (లక్షల టన్నులు) | 2005-06 | 7.42 | 70.17 | 16.62 | 75.29 | 169.50 |
| భూకమతాలు (లక్షలలో) | 2001-01 | 13.45 | 34.26 | 21.21 | 46.39 | 115.31 |
| సాగు కమతం (లక్షల హెక్టార్లు) | 2000-01 | 11.09 | 35.20 | 34.25 | 63.45 | 143.91 |
| సగటు కమతం సైజు (హెక్టార్లు) | 2000-01 | 0.82 | 1.03 | 1.61 | 1.37 | 1.25 |
| పశుశాలలు (సంఖ్య) | 2003 | 487 | 1,410 | 1,020 | 2,059 | 4976 |
| పశు కృత్రిమ గర్భాదాన కేంద్రాలు (సంఖ్య) | 31-3-2005 | 456 | 1,403 | 996 | 1,940 | 4795 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
|---|---|---|---|---|---|---|
| పశుగ్రాసం కోసం అభివృద్ధి చేయబడిన భూమి (లక్షల హెక్టార్లు) | 31-3-2005 | 0.69 | 5.77 | 2.96 | 5.66 | 15.08 |
| మొత్తం పశుగణం (లక్షల్లో) | 2003 | 43.25 | 101.44 | 101.37 | 236.13 | 482.19 |
| ఫ్యాక్టరీలు (సంఖ్య) | 2003-04 | 1,227 | 5,660 | 2,177 | 5,738 | 14,802 |
| ఫ్యాక్టరీలలో ఉద్యోగులు (లక్షల్లో) | 2003-04 | 0.87 | 1.67 | 0.55 | 5.55 | 8.64 |
| స్థూలంగా తయారి వల్ల కలిగిన పెరిగిన విలువ (రు. కోట్లు) | 2003-04 | 5,089 | 2,882 | 796 | 7,831 | 16,598 |
| సగటు తలసరి విద్యుత్ వినియోగం (కి.వా.గం.) | 2004-05 | 323 | 384 | 450 | 592 | 575 |
| విద్యుత్ పంపుసెట్లు (సంఖ్య) | 31-3-2005 | 71,352 | 3,71,772 | 5,22,445 | 14,08,796 | 23,74,365 |
| మోటారు వాహనాలు (లక్షల్లో) | 31-3-2005 | 5.45 | 16.25 | 6.46 | 29.81 | 57.97 |
| రోడ్లు పొడవు (కి.మీ.) | 2004-05 | 18,015 | 50,358 | 39,694 | 78,969 | 1,87,036 |
| అబ్కారి రాబడి వసూళ్లు (రు. కోట్లు) | 2004-05 | 84.56 | 304.71 | 146.13 | 1611.59 | 2146.99 |
| స్థూల ప్రాంతీయ ఆదాయం నికర రాబడి (రు. కోట్లు) | 2003-04 | 12,663 | 31,883 | 15,252 | 42,833 | 1,02,631 |
| ఉపాధి కేంద్రాల ద్వారా ఉపాధి పొందినవారు (సంఖ్య) | 31-12-2004 | 199 | 324 | 377 | 2023 | 2923 |
| నిరుద్యోగులు (లక్షల సంఖ్య) | 31-12-2004 | 3.57 | 5.12 | 4.80 | 10.75 | 24.24 |
| ఉద్యోగులు (లక్షల్లో) | 2001 | 1.17 | 3.13 | 2.03 | 5.95 | 12.28 |
| ప్రాథమిక పాఠశాలలు (సంఖ్య) | 2004-05 | 8,010 | 16,964 | 12,799 | 23,907 | 61,680 |
| ప్రాథమికోన్నత పాఠశాలలు (సంఖ్య) | 2004-05 | 1,892 | 3,918 | 3,409 | 7,448 | 16,667 |
| హైస్కూళ్లు (సంఖ్య) | 2004-05 | 1,279 | 3,203 | 2,354 | 7,585 | 14,421 |
| ఉపాధ్యాయులు : | | | | | | |
| ప్రాథమిక పాఠశాలలు (సంఖ్య) | 2004-05 | 17,140 | 45,117 | 32,204 | 72,474 | 1,66,935 |
| ప్రాథమికోన్నత పాఠశాలలు (సంఖ్య) | 2004-05 | 10,770 | 22,968 | 20,875 | 49,372 | 1,03,985 |
| హైస్కూళ్లు (సంఖ్య) | 2004-05 | 11,612 | 33,929 | 22,755 | 72,103 | 1,40,399 |
| పోస్టాఫీసులు (సంఖ్య) | 31-3-2005 | 1,942 | 4,963 | 3,455 | 5,830 | 16,190 |
| బ్యాంకు (సంఖ్య) | 31-3-2006 | 683 | 2021 | 963 | 2476 | 6143 |
| పరిషత్ డిపాజిట్ దామాషా | 31-3-2006 | 64.3 | 88.4 | 73.9 | 72.2 | 74.5 |

ఆధారం : అర్థ గణాంక శాఖ, హైదరాబాద్

# అభివృద్ధికి భౌగోళిక అవకాశాలు

- టి.వివేక్

ఆర్థిక అభివృద్ధి, సామాజిక న్యాయం, మెరుగైన పర్యావరణం-వీటిని అభివృద్ధి లక్ష్యాలుగా అంతర్జాతీయంగా గుర్తించడమైనది. ఈ లక్ష్యాలను సాధించడానికి ప్రణాళికను ఒక సాధనంగా చేసుకుంటారు. ఆర్థిక అభివృద్ధి సాధారణంగా ఈ కింది లక్ష్యాల వైపుకు ఉద్దేశించబడి ఉంటుంది.

1. జాతీయ ఆదాయంలో పెరుగుదల.
2. వేగవంతమైన పారిశ్రామికీకరణ
3. ఉపాధి అవకాశాలను విస్తృతపరచడం
4. ఆదాయం, సంపదలలో అసమానతల తొలగింపుకు కృషిచేయడం.

అభివృద్ధి లక్ష్యాలు ప్రధానంగా ఆర్థిక పరమైనవి. ప్రణాళికా కర్తల నిర్ణయాలు రంగాల వారీగా ఉంటున్నాయి. ఈ ధోరణి వల్ల వ్యవసాయం, పరిశ్రమలు, రవాణా, ఆరోగ్యం ఇలాంటి భిన్న ఆర్థిక రంగాలలో ఎక్కువగా పెట్టుబడులు పెట్టడం జరుగుతోంది. ఆయా రంగాలలో పెట్టబడిన పెట్టుబడులను మాత్రమే అభివృద్ధికి ప్రమాణంగా పరిగణిస్తారు. ఇంకా చెప్పుకోవాలంటే లబ్దిదారుల సంఖ్య మున్నగునవి పరిగణిస్తారు. ఈ మొత్తం క్రమంలో సామాజిక, పర్యావరణ స్పృహలేకుండా కేవలం పాలనా వ్యవహారంగా చూసే ధోరణి మనకు కనబడుతోంది.

సామాజిక శాస్త్రవేత్తలు మరీ ముఖ్యంగా భౌగోళిక శాస్త్రవేత్తలు చాలా కాలం క్రితమే గుర్తించింది ఏమంటే అభివృద్ధికి, సామాజిక కార్యకలాపాల ఆవరణకు మధ్య చాలా అవినాభావ సంబంధం ఉంటుంది. ఖండిత ప్రణాళికల్లో సర్వసమ్మతం కాని భౌతిక, సామాజిక, ఆర్థిక ఆవరణ నిర్లక్ష్యం చేయబడుతోందని వారు అంటారు. ఈ ఖండిత ప్రణాళికలు చాలా అరుదుగా మాత్రమే అభివృద్ధి క్రమపు సమన్వయానికి అందుతున్నాయి.

పైన సూత్రీకరించిన ఆలోచనను తెలంగాణ ప్రశ్నకు, అభివృద్ధికి అన్వయించడమయినది.

యూరోపులో ఒకటి లేక అంతకన్నా చాలా ఎక్కువ దేశాలకంటే మన రాష్ట్రం పెద్దది. మూడు ప్రాంతాలు, వేరువేరు రాజకీయ నేపథ్యాలు కలిగినవి సమ్మిళితమై ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినది. ఆ క్రమంలో ఆర్థిక, నేపథ్య సర్దుబాట్లు చాలానే చేసుకున్నాయి. అందువల్ల మనకు కేవలం ప్రాంతీయంగానే కాక చరిత్ర, అలవాట్లు, సామాజిక దృక్పథాలు, నమ్మకాలు ఇలా చాలా వాటిలో ఆ తేడాలు కన్పిస్తాయి. ఈ మూడు ప్రాంతాల ఆర్థిక, సామాజిక పరిస్థితుల్లో చాలా తేడాలున్నాయి. ఎక్కువశాతం సారవంతమైన డెల్టా భూములు కలిగిన కోస్తా ప్రాంతం ; వ్యవసాయ అభివృద్ధికి పరిమితమైన అవకాశాలు కలిగి, నైరుతి రుతుపవనాల నీడలో రాయలసీమ ప్రాంతం; ఇక తెలంగాణకు వస్తే చాలా ఆసక్తికరంగా ఉంటుంది. బొగ్గు, నీరు వంటి ప్రకృతి వనరులు పుష్కలంగా ఉన్నప్పటికీ అభివృద్ధిలో తీవ్రమైన వెనుకబాటుతనంతో నిల్చిపోయింది.

చాలా ప్రణాళికలు చేసినప్పటికీ ఎందుకు ఈ వెనుకబాటుతనం ఉందో పరిశీలించాల్సిన అవసరం ఉంది. సాధారణంగా ఈ ప్రాంతీయ అసమానతలను తలసరి ఆదాయంతో అర్థం చేసుకుంటారు. ఇటీవలి కాలంలో ఇతర సూచికలను కూడా అభివృద్ధిని లెక్కించడంలో పరిగణనలోకి తీసుకుంటున్నారు. ఆ సూచికలు : 1. ఆయుప్రమాణం, 2. జ్ఞాన సముపార్జనకు అవకాశాలు, 3. జీవన ప్రమాణాలు. ఈ మొత్తాన్ని కలిపి మానవ అభివృద్ధి సూచికగా పేర్కొంటున్నారు.

ఒక ప్రాంత అభివృద్ధి అక్కడి శ్రామిక శక్తి ఉత్పత్తిలో పాల్గొనేదానిపై, వారి ఉత్పాదకత తోను ప్రభావితం అవుతుందని ఆర్థికవేత్తలు అంటారు. శ్రామిక శక్తి పాల్గొనడమనేది నీటి పారుదల వసతులపైన, అక్షరాస్యత స్థాయి పైన ఆధారపడి ఉంటుంది. సిఆర్ఆర్ ఫౌండేషన్ వారి అధ్యయనం ద్వారా మనకు తెలుస్తున్నది ఏమంటే తెలంగాణ గ్రామీణ ప్రాంతంలో మహిళా శ్రామికులు ఎక్కువ స్థాయిలో కనబడుతున్నారు. ఇది నీటి పారుదల వసతికి, అక్షరాస్యతకు మధ్యనున్న బలమైన సంబంధాన్ని సూచిస్తోంది. అయితే ఈ మహిళా శ్రామికులు ఉత్పత్తిలో పాల్గొనే శాతం ఉత్తరాంధ్రలో 32% నుంచి తెలంగాణ 43% కు ప్రాంతాల వారి మారుతూ ఉంది. తెలంగాణలో పెద్దసైజు భూకమతాలు చాలా వరకు తగ్గిపోయినప్పటికీ కౌలు వ్యవసాయం పెరిగిపోతోంది. మరో పక్క ఉత్పత్తిని భాగాలుగా (పాలుకి) పంచుకోవడం పోయి, స్థిరంగా అద్దె చెల్లించే పద్ధతిలోకి వ్యవసాయం మారిపోయింది. ఆ విధంగా తెలంగాణలో మళ్లీ కౌలు వ్యవస్థ పునరుద్ధరణ, పెరుగుదల కన్పిస్తాయి. అయితే ఇటువంటి పరిణామం వెనుక భూమి గల రైతులు వ్యవసాయం పట్ల అనాసక్తత చూపడం, మరోపక్క భూపరిమితి చట్టాలు-ప్రభుత్వ చర్యలను మించి, ఉద్యమకారుల ప్రభావం కనిపిస్తుంది.

ఈ అధ్యయనంలో అర్థమవుతున్న మరో అంశం వర్షాభావ ప్రాంతాల్లో భూగర్భ జలవనరులు హద్దు మీరి తీవ్రంగా వినియోగించడం వలన నీటి పారుదల నిలకడ లేని వ్యవహారంగా మారిపోయింది. మొత్తం నీటి పారుదల వసతిలో ఉపరితల నీటిపారుదల, బోరుబావుల ద్వారానే 70% నీటి పారుదల ఈ ప్రాంతంలో జరుగుతోంది. దీని ఫలితంగా అంటే, భూగర్భ జలాన్ని విపరీతంగా వాడేయడం వలన నికర సాగు భూమి తగ్గి, పడావు భూమి పెరిగిపోతోంది. వాటర్‌షెడ్ లాంటి పథకాలు ఆచరణకు, ఆలోచనలకు మధ్యఉన్న అఖాతంలో కొట్టుమిట్టాడుతున్నాయి. దీనికి తోడు ఈ పరిస్థితిని మరింత దిగజార్చే వైపుగా పంటల సరళి పరుగుతీస్తోంది. తృణధాన్యాల కింద వున్న పంట విస్తీర్ణం తగ్గిపోవడం వలన తెలంగాణ గ్రామీణ ప్రజల ఆహారపు సమతుల్యత దెబ్బతిని పోతోంది.

ఈ అధ్యయనం మూడు ప్రాంతాల్లోని పారిశ్రామిక రంగంలో అసమాభివృద్ధిని, తేడాలను ఎత్తిపట్టింది. 'రంగాలవారిగా అభివృద్ధి జరుగుతుందనే' ఒక సిద్ధాంతం ఉంది. దీని ప్రకారం పారిశ్రామిక అభివృద్ధి వ్యవసాయాన్ని, సేవల పరిశ్రమ పారిశ్రామిక రంగాన్ని తొలగిస్తాయి. ఆసక్తికరంగా ఈ అధ్యయనంలో మాత్రం ఈ సూత్రీకరణ మన రాష్ట్రంలో తలకిందులైంది. మన రాష్ట్రంలో ఉత్పత్తిరంగం అభివృద్ధి ఏ మాత్రం సంతృప్తికరంగా లేదు. ఉత్తర తెలంగాణలో ఈ ఉత్పత్తిరంగం అభివృద్ధి అనేది మరింత అధ్వాన్నంగా ఉంది. ఈ ప్రాంతంలో పెద్ద ఎత్తున మహిళలు, పిల్లలు బీడీలు చుట్టే పనిలో పాల్గొంటున్నారు.

ప్రాంతాల్లోని వ్యత్యాసాలు ఆరోగ్య, విద్యా రంగంలో కూడా కనబడతాయి. మొత్తంగా చూస్తే ఉత్తర తెలంగాణ ప్రాంతం, మహబూబ్‌నగర్ జిల్లాలు చాలా తక్కువ అక్షరాస్యతతో అట్టడుగు స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. ఈ ప్రాంతాలలోనే చాలా తక్కువ అక్షరాస్యత కలిగిన 65 మండలాలు ఉన్నాయని గుర్తించారు.

ప్లానింగ్ కమీషన్‌లోని ఎస్ఇఆర్ డివిజన్ వారు 'భారత దేశంలో అభివృద్ధి సరళి – ఆంధ్రప్రదేశ్‌లో ఒక అధ్యయనం' పేర ఒక పరిశీలన నిర్వహించారు. ఈ అధ్యయనం కూడా పెరిగిపోతున్న ప్రాంతీయ వ్యత్యాసాలని ఎత్తిచూపింది. అలాగే ఈ అధ్యయనం ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ వ్యవసాయ ఆధారిత స్వభావాన్ని కలిగివున్నదని తేల్చి చెప్పింది. 57 వేల కోట్లకు పైగా ఇంటాబైటా ఇన్నేళ్లలో వివిధ మార్గాల ద్వారా అప్పులు తెచ్చినప్పటికీ నీటి పారుదల వసతిని మెరుగుపర్చడంలో ప్రభుత్వం చూపిన అశ్రద్ధను తీవ్రంగా తప్పుబట్టింది. ఇప్పటి దాకా వచ్చిన ప్రభుత్వాలన్నీ కూడా ఆచరణలో ఒక దాని విధానాలను మరొకటి విభేదిస్తూ ప్రధానమైన ప్రాజెక్టులను చేపట్టకుండా జాప్యం చేస్తూ వున్నాయని గుర్తించింది. బచావత్ ట్రిబ్యునల్ నిర్దేశించిన జలవనరుల సామర్థ్యాన్ని విధానకర్తలు ఉపయోగించుకోలేక పోయినట్టు పేర్కొన్నారు. విధానకర్తల నిర్లక్ష్యం, వైరుధ్యాల వల్ల తీవ్రంగా నష్టపోయింది మాత్రం తెలంగాణయే. తెలంగాణ కరువు ప్రాంతాన్ని గోదావరి నీళ్ల ఉపయోగించి అభివృద్ధి పరచడంలో చేసిన జాప్యం వల్ల ఎంతో విలువైన సమయాన్ని ఈ ప్రాంత ప్రజలు కోల్పోయారు. ఈ నిర్లక్ష్యమే ప్రజల అసంతృప్తికి దారి తీసింది.

ఈ అసమతుల్య అభివృద్ధి వ్యూహాలు ప్రాంతాల మధ్య అసమానతలను మరింత పెంచాయి. సమతుల్య అభివృద్ధి అనేది ఒక యాదృచ్ఛిక ప్రస్తావనగానే ఉండిపోయింది. ఈ అసమతుల్యత వివిధ ప్రాంతాల ప్రజల మధ్య సమష్టి భావనకు పెద్ద అడ్డుగోడగా నిలిచిపోయింది.

ఈ అధ్యయనాలన్నిటితో మనకు అవగతమయ్యేది ఏమంటే కేవలం కొన్ని రంగాలకు పెట్టుబడి పెట్టడం వలన దానంతకు అదే అభివృద్ధి క్రమపు పొందికలో ఐక్యతనేమీ తెచ్చిపెట్టదు. కొంత మంది భౌగోళికవేత్తలు సూచిస్తున్నది ఏమనగా దేశం మొత్తాన్ని ఒక యూనిట్‌గా పరిగణించి, అందులో వివిధ ప్రాంతాలని ఉపయూనిట్లుగా వివిధ రంగాలకు ప్రణాళికలు రూపొందాలి. దేశం అత్యున్నత స్థానంలోను మిగిలిన ప్రాంతాలు ఒక క్రమ పొందికలోనూ ఉండాలి. ఇంకా ఏమన్నారంటే ప్రాంతాలుగా విడిపోవడం అంటే, దేశ ఆర్థిక వ్యవస్థను ఆయా ప్రాంతాల ఉత్పాదకతను గరిష్ట స్థాయికి పెంచడం ద్వారా అభివృద్ధి పరచడం. దీనికి సాధికారత చేకూర్చే అంశాలు 1. ఆవరణ ఒక వాస్తవం, 2. ఈ ఆవరణలో భౌతిక, సామాజిక, సాంస్కృతిక వాతావరణం ఇంకా మానవ కార్యక్రమాలను అనుసంధానిస్తుంది. అయితే ఒక ప్రాంతాన్ని ఒక యూనిట్‌గా పరిగణించి, ఎందుకంటే ఆ ఆవరణ గుణగణాలలో సజాతీయతను కలిగి వుంటుంది కాబట్టి, అది దృష్టిలో ఉంచుకొని సరియైన విధానాలను రూపొందించాలి. ప్యాట్రిక్ గెడ్డెస్ ప్రకారం అభివృద్ధికి ప్రాంతీయ ప్రాతిపదికను, వనరులు, స్థలం, మనుషులు అనే విధానాన్ని బలంగా పేర్కొన్నారు. ఆయన చెప్పినదాని ప్రకారం ఒక ప్రాంతాన్ని పనిగాని సమూహంగాని లేకుండా అధ్యయనం చేయడం మ్యాపులు, అట్లాస్‌లు చూసినట్లే. ఏ సమూహమైనా స్థలం, కాలం, పని అనేవి లేకుండా ఉన్నట్లయితే అది కేవలం మానవజాతిశాస్త్రం ఆసక్తి మాత్రమే అవుతుంది. ఇంకా చెప్పాలంటే స్థలం-పని-సమూహం అనబడే త్రికోణం పర్యావరణం-ఆర్థిక వ్యవస్థ-సమాజం అనే అర్థంతో సరిపోతుంది. ఒక సజాతీయ సామూహిక ఆవరణను (భౌగోళికతను) ఏర్పర్చడంలో ఉద్దేశం ఏమంటే మనుషులు, వనరుల మధ్య ఉన్నతమైన సంబంధాన్ని ఏర్పర్చడం. తక్కువ ఘర్షణతో ఎక్కువ ఉత్పత్తిని సాధించడంగా ఉంటుంది.

ముగింపుగా, అభివృద్ధి గురించి పేర్కొనాలంటే కేవలం ప్రణాళికలు, విధానాలు, ఆర్థిక వ్యవస్థలోని వివిధ రంగాలలో పెట్టుబడులు మాత్రమే ఒక ప్రాంతపు వెనుకబాటు సమస్యకు పరిష్కారం కాజాలవు. చరిత్ర క్రమానుగతి మన రాష్ట్రాన్ని ఒక రాజకీయ యూనిట్‌గా నిలిపింది. కానీ స్థలం, పని, సమూహ చలనాలు ఈ ఐక్యతకు సవాలుగా నిలుస్తున్నాయి. ఇక్కడ ఆవరణనే సమూహం నెరపే జీవిత నాటకానికి రంగస్థలం. సమూహం తాను నివసించే ఆవరణలో వున్న వనరులను తాము కోరుకున్నట్లు ఉపయోగించుకోవడంలో, వాటిపై తమ ఆధిపత్యాన్ని కలిగి వుండడంలో వారికి చాలా సహజమైన, తర్కబద్ధమైన హక్కులు ఉంటాయి.

సజాతీయ ఆవరణలు కలిగిన ప్రాంతాలు ఒకే విధమైన సాధారణతను సంతరించుకుంటాయి. తెలంగాణ కూడా అలాంటి ఆకాంక్షల వ్యక్తీకరణలో భాగమే. సాధికారతతో తమ వనరులను తాముకోరుకున్నట్టు ఉపయోగించుకోవలనే ఆ ప్రాంతవాసుల ఆకాంక్షలో భాగమే. ◆

**వచ్చే సంచికలో.....**

★ పద్నాలుగు కుట్ర కథలు - కొణతం దిలీప్ ★ విస్తరిస్తున్న విషసంస్కృతి రాగింగ్ - రాంకి ★ తెలంగాణ చరిత్రంతా త్యాగాల, పోరాటాల చరిత్రే - చిక్కుడు ప్రభాకర్ ★ ఉన్నత విద్యార్జన దళితుల జన్మహక్కు - నాగం కుమారస్వామి ★ ఐదేళ్ల డిగ్రీ కోర్సు ఎవరికోసం? - స్ఫూర్తి ★ తెలంగాణ రాష్ట్రం-కొన్ని అనుమానాలు, ప్రశ్నలు, సూచనలు - దుర్గం రవీందర్ ★ భంగల్ ఆర్టీసీ డిపో మూసివేతను అడ్డుకున్న మహిళా ఉద్యమం - తుర్లపాటి లక్ష్మి ఎనిశెట్టి శంకర్ ★ లోక్‌సత్తా - జి.ఎస్. రామ్మోహన్ ★ ఫోకస్ : హైదరాబాద్ విస్తరణ - ప్రజాదృక్పథంలో మంచీచెడూ

# ఎవరీ భగత్‌సింగ్, ఏమిటితని గొప్ప?

- 'నేనెందుకు నాస్తికుణ్ణయాను' పుస్తకం ముందుమాట

కొందరు ప్రబుద్ధులైనా అడుగుతారనుకునే మాకు మేమై ప్రశ్నలు వేసుకుని జవాబు యిస్తున్నాం. జడభరతుల్ని ప్రపంచభార్గవులుగా, బూడిద బుగ్గిలో మిగిలిన కాసిన్ని నిప్పురవ్వల్ని తనవూపిరితో నివురూది మంటరాజేద్దామని సంకల్పించే వ్యక్తుల్లో భగత్‌సింగ్ లాంటి వాళ్లు మహ అరుదు. అలాంటి వాళ్లకు వేరే బిరుదు అక్కర్లేకపోయినా 'షహీద్' (ప్రాణత్యాగి) అని జనమే తానడగని దాన్ని తమంత తామై యిచ్చివున్నారు. రాజకీయ రంగప్రవేశం చేయబూనిన జవహర్‌లాల్ నెహ్రూకి గూడా అసూయ కలిగేంతగా, భగత్‌సింగ్ ఉరికంబమెక్కిన ఐదారేళ్ల వ్యవధిలోనే గాథలూ, గేయాలు వగైరా జన హృదయస్పందనలనూ అభినందనలనూ పుట్టించి, ఆ 'నవ్ జవాన్' ని కథాపురుషుణ్ణి చేశాయి. ఎంతలో ఎంత మార్పు!



అహింస అభినవ మతమై పదేళ్లు కావచ్చింది. గాంధీ మహాత్మాజీగా మారి పుష్కరకాలం దాటింది. తిలక్ మహరాజ్ శకం ముగిసింది. ద్వంద్వ పరిపాలనా పద్ధతి రాష్ట్రాలలో అమలుకు వచ్చింది. నిర్మాణ కార్యక్రమం బలవంతపు మాఘస్నానమైంది. కాంగ్రెసులో గాంధేయ బృందం చర్ఖా - ఖాదీ - మద్య నిషేధం - అస్పృశ్యతా నివారణ - స్త్రీ జనోద్ధరణ కార్యక్రమాన్ని ససేమిరా వదలమంటే, మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్‌దాస్‌లు శాసనసభా ప్రవేశం కోరుతూ కాంగ్రెస్ - ఖిలాఫత్ స్వరాజ్ పార్టీ పెట్టి, చివరికి గాంధీ జగమొండితనాన్ని కూడ మాన్పించారు. రాజ్యాంగబద్ధమైన పద్ధతుల్లో బ్రిటిష్ వ్యతిరేక జాతీయవాద పోరాటానికి మారు సాత్విక ప్రతిఘటన, సత్యాగ్రహ పద్ధతుల్లో ఆ పోరాటాన్ని నడిపి, యేడాది తిరిగి యేడాది మొదలు గాకముందే స్వరాజ్యం వచ్చేస్తుంది చూడండని ఆశలు గల్పించిక సహాయ నిరాకరణోద్యమం సాగించి, శ్రీకృష్ణజన్మస్థానాలను వేలాదిమందితో నింపించిన మహాత్మాజీ, తానే ఆశాభంగం చెంది దేశం సత్యాగ్రహానికి యోగ్యంగాలేదని చౌరీ చౌరాలో పోలీసుల సజీవదహనం సదవకాశం చేసుకుని ఉద్యమ విరమణకూ అస్త్ర సన్యాసానికి పిలుపిచ్చాకనే జైలుపాలై ఎర్వాడలో వుండిపోయాడు. ఈ ఆశాభంగం 'కఠోర శస్త్రి' కాగా యువకులూ సాహసమనస్కులూ మళ్లీ 'వందేమాతర' వుద్యమకాలంనాటి బ్రిటిష్ వ్యతిరేక భయానక చర్యలకు దిగక తప్పలేదు. జైలునుంచి విడుదలై వచ్చాక గాంధీ యిలాంటి టెర్రరిస్టులతో బహిరంగ వాదోపవాదాలకు దిగాడు. కలకత్తా కార్పొరేషన్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరైన సుభాస్‌చంద్రబోస్ చాటున స్వచ్ఛంద సేవకులుగానేగాక, సత్యాగ్రహులుగా కూడా నిజాయితీతో పనిజేసిన మాజీ టెర్రరిస్టులు, గాంధీకి తామిచ్చిన సదవకాశం వట్టిపోయిందని గ్రహించారు. టెర్రరిజం పునర్విజృంభణకు పరోక్షంగానైనా కారణభూతుడు, సబర్మతీ ఆశ్రమవాసీ సంసారం వదలని సన్యాసీ తక్లీ-చర్ఖా-ఖాదీ వాదీ, శాకాహార ఖాదీ, మేషక్షీరపీథీ అయిన గాంధీయే ననడం, నిజమాడడమేగాని నిందవెయ్యడంకాదు.

బెంగాలీ 'భద్రలోగ్' యువకులు అరవిందఘోష్ 'భవానీ మందిర' ప్రభావంతో బంకించంద్ర చటర్జీ 'వందేమాతరం' వుత్తేజంతో, హిందూ మతాన్నీ రాజకీయాన్నీ రంగరించి 'టెర్రరిజం' మిశ్రణం తయారుచేసి, యుగాంతర్, అనుశీలన్‌సమితి, సుహృత్ సమితి వగైరా బృందాలను పకడ్బందుగా నిర్మించి నిర్వహించడం ఈ శతాబ్దం తొలి దశకంలోనే ప్రారంభమైంది. హైందవ పునరుద్ధరణోద్యమాన్ని రాజకీయ కార్యాచరణలో అంట కాగుతూ వచ్చిన యీ ఉద్యమం వివేకానందుడు, నివేదితల పరోక్ష ప్రేరణ కూడా పొందింది. బరీన్‌కుమార్‌ఘోష్, ప్రమథ్‌నాథ్‌మిత్ర, పులిన్‌బిహారిదాస్, భూపేంద్రనాథ్ దత్త, నరేన్‌భట్టాచార్జీ (ఎం.ఎన్.రాయ్) వగైరాలకు జతీన్ బెనర్జీ ఆచార్యుడు, అరవిందుడు ప్రాచార్యుడు, సాయుధ సామ్రాజ్య శక్తిని బాంబులతో, రివాల్వర్లతో ఎదురుదెబ్బదీయడం, ఆత్మ విశ్వాసం, సాహసం కలిగించి రాజభక్తులనూ ద్రోహులనూ తొత్తులనూ గూఢచారులనూ అధికార్లనూ అదర బెదరగొట్టడం. బెంగాలు రాష్ట్ర విభజనను రద్దు చేసేంత వరకేగాక దేశం పరాధీనతనుంచి బయటపడేదాకా జ్వాలా తోరణాలుగా తామే మండి జనాన్ని లేవగొట్టడం - ఇవేవీ చిన్నవి చితకవీ అయిన లక్ష్యాలుకావు. నిజానికి వీళ్లను 'టెర్రరిస్టులు' అనడమే నింద, జాతీయ విప్లవకారుడనడం సరి.

దీనికితోడు, పరపంచలు పట్టి విదేశీ ప్రభుత్వం ధన, ఆయుధ సహాయంతో, స్వదేశాన్ని పాలించే విదేశీయులను అదరకొట్టడం ఆశయంగా శ్యామ్‌జి కృష్ణవర్మ, మదాంకామ, సవర్కార్, పింగ్లే, లాలాహర్దయాళ్, రాజామహేంద్రప్రతాప్, చుపకరామన్‌పిళ్లై, ఓబీదుల్లా బస్కతుల్లా, వగైరా యూరపులో, అమెరికాలో ఎన్నెన్నో కష్టాలు పడుతూ పట్టువీడక అఫ్ఘనిస్తాన్ మీదు నో సయాంద్వారానో దండయాత్రకు

ప్రయత్నాలు చేస్తువచ్చారు. 'సిపాయి తిరుగుబాటు' గానే రూఢికెక్కిన మొదటి స్వాతంత్ర్య సంగ్రామాన్ని సంస్మరించుకుని పెట్టిన 'గదర్' పార్టీ చేసిన మహాసన్నాహం అంతా పాలకుల, వారితాబేదార్ల మెళుకువ మూలాన ఛిన్నాభిన్నమైంది. 'కమాగటామరూ' నౌకలో చేసిన సముద్రయాత్ర అంతిమంగా శ్మశానయాత్ర అయింది. భాగాజతీన్ వీరమరణం, రస్‌బీహారీబోస్ పరారీ శచీంద్రనాథ్ సన్యాల్ ప్రవాసం, దాదాపు యిదేకాలానికి 'టెర్రరిజం' తొలిదశకు భరతవాక్యం. హోంరూల్ ఉద్యమం త్వరలోనే నీరుగారిపోయింది. రౌలెట్ చట్టం అమలైంది. జూరీలేని కోర్టులు, విచారణ అంతగాలేని శిక్షలు-'యముని మహిషపులోహ ఘంటలు'. గాంధీ నడిపిన రౌలెట్ సత్యాగ్రహం క్రమంలోనే జలియన్‌వాలాబాగ్ చిత్రవధలు, సహాయ నిరాకరణోద్యమ వైఫల్యం. సమాజంలో స్వలాభపరాయణమైన ధనికవర్గం వలసాధిపతులతో రాజీద్వారా ఆర్థిక రాయితీల సంపాదన. 'పెనుచీకటిపటు నిరాశ'. టెర్రరిజం రెక్కని రెక్కవిప్పక మరేంచేస్తుంది?

శచీంద్రనాథ్ సన్యాల్ అండమాన్‌ల నుండి బతికి బయటబడి మళ్లీ కాశీ చేరుకున్నాడు. చంద్రశేఖర్ ఆజాద్ కొదమ సింగంలా సంచరిస్తూ పథకం వేస్తున్నాడు. బిస్మిల్ వంటి వాళ్లు కాకోరీ వంటి చోట్ల రైళ్లనాపి ప్రభుత్వ ధనం లూఠీ చేస్తున్నారు. ధైర్యం అంతరించలేదు. చేవ విరగలేదు. సైమన్ కమీషన్ సందర్శనం సందర్భంలో, 'గోబ్యాక్ సైమన్' నినాదాలతో లాహోరులో తీసిన ఊరేగింపుకి ముందుండి నడిపిన లజ్‌పత్‌రాయమీద స్కాట్ నాయకత్వాన పోలీసులు కురిపించిన ఆ లాఠీవడగళ్లు ఆ వృద్ధున్ని మరణశయ్య ఎక్కించాయి. స్కాటే స్వయంగా లజ్‌పత్‌రాయ్‌ని పశువులా కొట్టాడు. 'మా మీదపడిన ప్రతిలాఠీ దెబ్బ బ్రిటిష్ సామ్రాజ్య శవపేటికలో దిగిన మరోమేకు' అంటూ పంజాబ్ కేసరి మరణించాక పంజాబ్ యువకులు పంజాలు విసిరారు. భగత్‌సింగ్ ముఖ్యుడుగా లజ్‌పత్‌రాయ్ హంతకుల్ని వధించాలనుకొని పొరపాటున శాండర్స్‌ను వధించాడు. ఆజాద్ నేతృత్వాన ఢిల్లీలో ఫీరోజ్‌షాకోట్లాలో జరిగిన రహస్య సమావేశంలో ఒక నిర్మాణం కార్యక్రమం, ఎత్తుగడల పథకం రూపొందాయి. భగత్‌సింగ్ బెంగాలుకు గూడా వెళ్లివచ్చాడు. అప్పటికే నీరసించి, సి.ఆర్.దాస్ హఠాన్మరణం తర్వాత వాడీ వేడీ కోల్పోయిన స్వరాజ్‌పార్టీ కేంద్ర శాసనసభలో చేస్తూ వచ్చిన ప్రయత్నాలన్నీ వ్యర్థమైనవని నిరూపించాలంటే, స్వయంగావెళ్లి ప్రచారయుద్ధం చెయ్యాలని, 'విజిటర్స్ గేలరీ' కి టికెట్లు సంపాదించివెళ్లి, పైనుంచి బాంబువేసి వెంటనే ఎర్రకరపత్రాలు విరజిమ్మి, త్వరలో పట్టుబడి లాహోర్ సెంట్రల్ జైలు పాలయిన భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లు రాజకీయఖైదీల గుర్తింపుకోసం సాగించిన ఆందోళనలో జతీన్‌దాస్ సుదీర్ఘ నిరశనదీక్షతో ప్రాణదానం చేశాడు. మరణదండన విధింపబడివున్న భగత్‌సింగ్‌నీ అతని అనుచరుల్నీ ఉరితాటినుంచి తప్పించి ఎంతోకొంత చిన్న శిక్షవేయించే అవకాశం వైస్రాయి ఇర్విన్‌తో జరిపిన చర్చల్లో గాంధీజీ మాటవరసన అడిగాడు కానీ నొక్కి మొండికిపడివుంటే వాళ్ల ప్రాణాలు దక్కివుండేవేమో? మహాత్ముడుగనక అవి తృణప్రాయాలేమో! కరాచీలో కాంగ్రెస్ సమావేశానికి వెళ్లే దారి పొడవునా గాంధీకి జరుగవలసిన సత్కారమే-ఛీత్కారం జరిగింది. గాంధీ మెడలో సుబాస్‌బోస్ వేసిన నిరసన ప్రకటన గాలికంటె పలచన. సాహసానికీ నిస్వార్థానికీ మాత్రమే గాక ఇతర టెర్రరిస్టులకింకా పట్టుబడని సోషలిస్టు దృక్పథానికి మారుపేరైన భగత్‌సింగ్ ఉజ్జ్వల ఉదంతం స్థూలచిత్రం ఇదీ.

భగత్‌సింగ్‌కీ తదితర జాతీయవిప్లవకారులకీ గల భేదం ఆస్తిక-నాస్తికుల మధ్యగలభేదం ఒకటేకాదు. బోల్షివిక్ విప్లవప్రభావం ప్రసరించి, ఇక్కడ ఒక కమ్యూనిస్టుపార్టీ మొలకెత్తాక గూడా జాతీయ విప్లవకారుల్లో అనేకులింకా వ్యక్తి హింసా చర్యలకుబదులు ప్రజాబలంతోసాగే వర్గపోరాటాలగూడిన కమ్యూనిజాన్ని ఆమోదించలేదు సరిగదా, అనుసరించనూలేదు. తొలి లాహోరుకుట్ర కేసులో వృద్ధ గదర్ వీరుడు బాబా కర్తార్‌సింగ్ ఉరికంబమెక్కి అమరుడైనప్పటి నుంచీ తన పద్దెనిమిదేళ్ల ఈడుకి మించిన విప్లవస్వప్నాలుకంటూ మొదట నౌజవాన్ భారత్ సభ నిర్మించి సోషలిస్టు భావప్రసారమూ టెర్రరిస్టు కార్యాచరణమూ మేళవిస్తూ వచ్చాడు. సోహన్‌సింగ్‌జోష్ సంపాదకుడుగా ఉండిన ఒక సోషలిస్టు పత్రిక సంపాదకమండలిలో కొంతకాలం పనిచేశాడు. అప్పటికి అందుబాటులో ఉండిన సోషలిస్టు సాహిత్యాన్ని సమాకూర్చుకొని అధ్యయనంచేయసాగాడు. హిందుస్తాన్ రిపబ్లికన్ అసోసియేషన్ అనే టెర్రరిస్టు సంస్థ పేరునితెచ్చి హిందుస్తాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ అసోసియేషన్‌గా మార్చడంలో, టెర్రరిజంలో గురుప్రాయుడైన ఆజాద్‌కి తాను గురువయ్యాడు. సోషలిస్టురాజ్య నిర్మాణధ్యేయమయింది. కమ్యూనిస్టులతో సంబంధాలు పెట్టుకున్నాడు. హెచ్.ఎస్.ఆర్.ఎ.ని కమ్యూనిస్టు ఉద్యమానికి సాయుధవిభాగంగా నడపాలనుకున్నాడు. అయితే భగత్‌సింగ్ మార్క్సిస్టు కాగలిగాడనడం అతిశయోక్తి అవుతుందని అజయ్‌ఘోష్ ఆ తర్వాత రాశాడు. లాహోరు జైల్లో ఉండగా బయటదేశంలో పరంపరగా జరగసాగిన ఘటనలు - సోలాపూర్‌లో ప్రజల తిరుగుబాటు, పేషావర్ ప్రజల విజృంభణ, ఠాకుర్ చంద్రసింగ్ నాయకత్వాన గుహర్వాళీ సైనికదళమొకటి వాయువ్యసరిహద్దు సీమలో ప్రజలపై కాల్పులు జరుపబోమని అధికారుల పట్లచేసిన వీరోచితమైన ధిక్కరణ - మహా ప్రజాఉద్యమంలో సాయుధ అంతర్భాగమై ఉండటం అవసరమనే పాఠాన్ని అతనికి నేర్పాయి. 1930 లో బోల్షివిక్ విప్లవ దినోత్సవ సందర్భంగా శుభాకాంక్షలు నందజేసేదాకా వెళ్లింది.

బతికి బయటపడిఉంటే భగత్‌సింగ్ తప్పక మార్క్సిస్టుగా పరిణమించే వాడు, కమ్యూనిస్టయ్యే వాడనడానికి అజయ్‌ఘోష్ లాంటివాళ్లలా కావడమే ఆధారమనుకునేరు! అండమాన్ దీవులలోని సెల్యులర్ జైలుకెళ్లిన భగత్‌సింగ్ అనుచరుడు జదేవ్ అక్కడి ఖైదీలలో 'కమ్యూనిస్టు కన్సాలిడేషన్ కమిటీ' నొకదాన్ని రూపొందించి కమ్యూనిస్టుపార్టీ మార్గదర్శకత్వాన పనిచెయ్యబూనడంకూడా ఆధారమే.

అయితే భగత్‌సింగ్‌లో ఈ పరిణామం పూర్తిగాక ముందే 1930లో ప్రభుత్వం లాహోర్ కుట్రకేసు ఆర్డినెన్సు తెచ్చి, ప్రత్యేక అసాధారణ న్యాయస్థానం ఏర్పాటు చేసింది. ఖైదీలకు బేడీలు వెయ్యడమేకాదు, వాళ్లు ప్రతికూల నినాదాలిస్తే న్యాయస్థానంలో న్యాయమూర్తులు చూస్తున్నప్పుడే లాఠీలతో పడగొట్టి బూటుకాళ్లతో తన్నడమేకాదు, లాయర్లు, సాక్షులూ చివరకు నిందితులూ కోర్టులో హాజరుకానక్కర్లేకుండానే త్వరత్వరగా విచారణతంతు పూర్తిజేసి మరణదండన విధింపజేసింది. జైలుకీ కోర్టుకీ పోయేదారికాచి ఎలాగో వీరిని విడిపించాలని ఆజాద్ చేసిన ప్రయత్నం నెరవేరలేదు. 1931

మార్చి 23న ఉరితీయడం జరిగిపోయింది. అప్పటికి అతనికి పాతికేళ్ల ప్రాయమైనాలేదు.

టెర్రరిస్టులనూ కమ్యూనిస్టులనూ కలిపిన లంకె అని శివవర్మ వర్ణించిన భగత్‌సింగ్‌ది లాహోరు సమీపాన సాండా గ్రామం. జననం 1907 సెప్టెంబరు 27న పుట్టింది లయాల్పూర్ జిల్లాలోని బాంగా-భాక్ గ్రామం. శిక్కు రైతు కుటుంబం. తండ్రి కిషన్‌సింగు ఆర్యసమాజ్ అనుచరుడూ సంస్కరణాభిమానీ. పినతండ్రి అజిత్‌సింగ్ లజపతిరాయ్‌తో కలిసి, జీలం నదీ పరీవాహప్రాంతంలో మాజీ సిపాయిలకు అంగ్రేజీ సర్కారిచ్చిన ఇనాం భూముల పన్నుల గురించి జరిపిన ఆందోళన ఫలితంగా 1909లో ప్రవాస శిక్షననుభవించాడు. తల్లి విద్యావతి, పాండూజాట్ వంశానికి చెందిన ఈ వంశస్థులు శిక్కుమతం స్వీకరించారు. తాత అర్జున్‌సింగ్ యూనానీ వైద్యుడు, 1853లో లాహోరు కాంగ్రెస్‌కు ప్రతినిధిగా వెళ్లివచ్చాడు. పొగాకు పంట వెయ్యడం, తోటిశిక్కుల దృష్టిలో సాంప్రదాయకం కాదని తెలిసీ తెగించి వేశాడు. మనవడు చనిపోయిన రెండేళ్లదాక జీవించాడు. తండ్రి కిషన్‌సింగ్ ఇన్‌షురెన్స్ ఏజంటుగా బాగానే గడిస్తూ జాతీయవాద భావాలతో సంఘ సంస్కరణాభిమానంతో క్షామబాధానివారణ కార్యక్రమంలో అనాథ శిశుశరణాలయాల స్థాపనలో ఆర్యసమాజ్ భావప్రచారంలో ప్రసిద్ధికెక్కి తన తమ్ములిద్దరినీ మరికొందరిని కూడగట్టి భారత్‌మాత సమాజం నెలకొల్పాడు. బడీ దో ఆబ్ కాలవచట్టానికీ కాలనైజేషన్ చట్టానికి వ్యతిరేకంగా లేచిన ఆందోళనలో అరెస్టయ్యాడు. గదర్ పార్టీని సమర్థించాడు. హార్థికంగా ప్రోత్సహించాడు, బాంగాగ్రామాన్ని వదలిపోగూడదనే ప్రభుత్వ నిర్బంధాన్ని అనుభవించాడు. స్వాతంత్ర్యోద్యమకాలంలో 42 రాజకీయ విచారణల నెదుర్కొని రెండేళ్లు జైలు జీవితం గడపాడు. బ్రిటిష్ అధికారులకు సింహస్వప్నమైన అజిత్‌సింగ్, కాంగ్రెస్ పోరాట పద్ధతులు సరిపడక వ్యవసాయ సమస్యల నాధారంజేసికొని రైతాంగంలో సంచలనం కలిగించి మీద పేర్కొన్న చట్టాలకు వ్యతిరేకంగా లేచిన ఆందోళనకు మొగేదారయ్యాడు. ప్రమాదకరమైన వ్యక్తి అనిపించుకొని ప్రవాస శిక్ష అనుభవించాడు. భగత్‌సింగ్ మీద ఇతని ప్రభావం బలీయం. కిషన్‌సింగ్, అజిత్‌సింగ్ "స్వాతంత్ర్య" భానూదయ కాలందాకా జీవించారు. అజిత్‌సింగ్ తమ్ముడు స్వరణ్ లాహోరు సెంట్రల్ జైలులో బండచాకిరిచేస్తూ క్షయతో 23వ ఏట 1910లో మరణించాడు.

పోరాట సంప్రదాయం గలిగిన కుటుంబం గనుక భగత్‌సింగ్ అదృష్టవంతుడు. అతని జన్మకాలానికి తొలి లాహోరు కుట్రకేసు నడుస్తూవుంది. 'రాజద్రోహ' భావాలు తీవ్రంగా వీస్తూవచ్చాయి, ఉగ్గుతో పెట్టినట్లు భగత్‌లో దేశస్వాతంత్ర్యాభినివేశం పుట్టి గట్టిపడింది. 1911-12లో బాంగా ప్రైమరీ స్కూలు చదువు, పసితనంలోనే సరాఫీ అంబాప్రసాద్, కర్తార్‌సింగ్, లజపతిరాయ్, రస్‌విహార్ బోస్‌లతో ముఖపరిచయాలు. కర్తార్‌సింగు ఉరి భగత్‌సింగ్ గుండెలో చిచ్చురగిల్చింది. 1916-17లో లాహోర్‌లోని దయానంద్ ఆంగ్లో-వేదిక స్కూల్లో చేరి చదవసాగాడు. జలియన్‌వాలాబాగ్ వద్దకు వెళ్లి పిడికెడుమట్టి నెత్తిపట్టి రాలని కన్నీరునిండిన కళ్లకాంతితో, 'త్యాగం' దీక్షబూనాడు. సహాయ నిరాకరణోద్యమంలో డి.ఏ.వి. స్కూలును, వదిలి 1921లో జాతీయ కళాశాలకు మారాడు. భగత్‌చరణ్‌వర్మ, సుఖ్‌దేవ్, యశ్‌పాల్, వగైరాలతో పరిచయం అప్పుడే. చరిత్రాధ్యాపకుడు జయచంద్ర విద్యాలంకార్ విప్లవాల చరిత్ర గురించి చెప్పిన పాఠాలు భగత్ తలకెక్కాయి. ఎఫ్.ఏ. పాసై బి.ఏ.లో చేరాడు. పెళ్లి ప్రస్తావన వస్తే 'పెళ్లికిది వేళకాదు. దేశం నన్ను పిలుస్తోంది. తనువుతో, మనస్సుతో, ధనంతో జాతిని సేవిస్తానని శపథం తీశాను.' అని తండ్రికి జాబురాశాడంటారు. 'పరాధీనదేశంలో నాకు పెళ్లంటూ జరిగితే, మృత్యువే నా వధువు,' అని స్నేహితులతో చెప్పి 1924లో కాన్పూరు వెళ్లిపోయాడు.

కాన్పూరులో గణేశ్ శంకర్ విద్యార్థి నడుపుతూవచ్చిన ప్రతాప్‌ప్రెస్‌కు వెళ్లి సంప్రదించాడు. స్వాతంత్రప్రియుడు కావడమంటే, జ్వాలకు శలభం కాగోరడమేనని ఆయన చెప్పాడు. తాను విని 'అలాగే'నన్నాడు. పేరు మార్చుకొని ప్రెస్‌లో పనిచేస్తూ, తీరికవేళల్లో వివిధ దేశాల విప్లవచరిత్రల గురించీ సోషలిజంగురించీ చదువుకుంటూ వచ్చాడు. బటుకేశ్వర్‌దత్, చంద్రశేఖర్‌ఆజాద్ వగైరాలు నేస్తులయ్యారు. హిందూస్తాన్ రిపబ్లికన్ అసోసియేషన్ సభ్యత్వం తీసుకున్నాడు. సాయుధవిప్లవం ద్వారా భారతసంయుక్త రాష్ట్ర సమాఖ్య రిపబ్లిక్ స్థాపన దానిలక్ష్యం. సార్వజనికఓటింగ్, అన్ని విధాల దోపిడీ రూపాలనిర్మూలన ఈ రిపబ్లిక్ మూలసూత్రం. కాన్పూర్ సమీపాన ఒక జాతీయ హైస్కూల్ హెడ్‌మాస్టర్‌గా కొంతకాలం పనిచేసి 1925లో మళ్లీ పంజాబ్ వెళ్లాడు. సోహన్‌సింగ్‌జోష్ నడుపుతూ వచ్చిన 'కీర్తి'(కష్టజీవి) పత్రికకు వ్యాసాలురాసూ 'కీర్తి-కిసాన్' పార్టీతో సంబంధాలు పెంచుకున్నాడు. కాని, హిందూస్తాన్ రిపబ్లికన్ అసోసియేషన్ వదలలేదు. కకోరీ రైలుదోపిడిలో పట్టుబడిన టెర్రరిస్టులను విడిపించేందుకు వేసిన పథకంలో పాల్గొనేందుకు కాన్పూరు వెళ్లాడు గాని అది పారలేదు. లాహోరుకు వచ్చి సహచరులతో కలసి నవజవాన్ భారతసభ స్థాపించాడు (1926). యావద్భారతదేశ కర్షక, కార్మికుల సంపూర్ణ స్వతంత్ర రిపబ్లిక్ స్థాపన దీనిధ్యేయం. హర్దయాళ్ రచన 'ది వెల్త్ ఆఫ్ నేషన్స్' అగ్నెస్ స్మెడ్లీ రచన 'ఇండియా అండ్ నెక్స్ట్‌వార్' వంటి పుస్తకాల అనువాదాలను ప్రకటింపజేశాడు. విద్యార్థులను సమీకరించాడు. అమరవీరులను గుర్తుచేసి నూతనోత్తేజం కలిగించాడు. వివిధ రాష్ట్రాల జాతీయవిప్లకారులలో ముఖ్యులు 1928 సెప్టెంబరులో ఢిల్లీలోని ఫిరోజ్‌షాకోట్లాలో సమావేశమై భగత్‌ను కార్యదర్శిగా ఎన్నికచేశారు. సోషలిజం అనేమాటను టెర్రరిస్ట్ ఉద్యమంలో ప్రవేశపెట్టి ఎచ్.ఎస్.ఆర్.ఏ. గా మార్చాడు. దానికి సేనాధిపతి ఆజాద్. సైమన్‌కమీషన్ సందర్శనం, లాఠీఛార్జ్ లజ్‌పత్‌రాయ్ మరణం, శాండర్స్‌వధ చకచకా జరిగిపోయాయి. లాహోర్‌నుంచి నేర్పుగా పరారీఅయి కలకత్తాకు వెళ్లి విప్లవకారులను కలిసి తిరిగి ఆగ్రాకువచ్చి బాంబులఫ్యాక్టరీ స్థాపించాడు. కేంద్ర శాసనసభలో పారిశ్రామిక వివాదాల బిల్లుతోపాటు 'పబ్లిక్ సేఫ్టీ' బిల్లు చర్చకు వచ్చిన సందర్భం కనిపెట్టి, అసెంబ్లి హాల్లో బాంబులు వెయ్యాలని బి.కె. దత్‌తో కలిసి 'విజిటర్స్‌గేలరీ'కి టికెట్ సంపాదించివెళ్లి, స్వరాజ్‌పార్టీ వారెకెవ్వరికీ హానికలగనంత కౌశలంతో 1929 ఏప్రిల్ 8న పై నుంచి బాంబులు, వెంటనే కరపత్రాలు విసిరారు. చుట్టుముట్టిన పొగ.... భయాందోళనలు.... 'ఇంక్విలాబ్ జిందాబాద్', డౌన్ విత్ బ్రిటిష్ ఇంపీరియలిజం!" నినాదాలు.... ఆ కరపత్రంలో--

"చెవిటివాళ్లు వినాలంటే గంభీర కంఠస్వరం కావాలి. అని ఇలాంటి సందర్భంలో ఫ్రెంచి అనార్కిస్ట్ ప్రాణత్యాగి వేలియాంట్ అన్న అమరవాక్యాలతో ఈ మా చర్యను మేం సమర్థించుకుంటున్నాం."

...అంటూ, మాంటేగు - షెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు అమలై ఆ పదేళ్లలో జరిగిన అవమానకరమైన చరిత్రను ఏకరువుపెట్టకుండా, ఇండియన్ పార్లమెంట్ అనే పేరెట్టుకున్న ఆ సభద్వారా భారతజాతికి జరిగిన పరాభవాలను పేర్కోకుండా, సైమన్ కమీషన్‌నుంచి ఏవో కొన్ని సంస్కరణలపేరిట రొట్టెముక్కల్ని జనం ఆశిస్తుంటే, ప్రభుత్వ మాత్రం కొత్త కొత్త దమనాత్మకశాసనాలను ప్రవేశపెట్టడం. శ్రామిక నాయకుల్ని నిర్బంధించడం, గాలి ఎటుకేసి వీస్తుందో తెలుపుతుందన్నారు. న్యూనత కలిగించే యీ ప్రహసనాన్ని అపుజేసి, అధికారోన్మత్తులైన విదేశీ దోపిడీదార్లు తమ చిత్తంవచ్చినట్టు చేసుకొనే అవకాశం కల్పించడం ద్వారా తమ నగ్న స్వరూపాన్ని ప్రజలముందు ప్రదర్శించుకోనిద్దామనేది తమ ఉద్దేశమన్నారు. ప్రజా ప్రతినిధులు తమ తమ నియోజకవర్గాలకు తిరిగిపోయి రానున్న విప్లవానికి జనాన్ని సమాయత్తం చెయ్యాలని కోరారు. వ్యక్తులను చంపడం తేలికేగాని భావాలను చంపడం తేలికకాదని భారతప్రజానీకం పక్షాన మేమునొక్కి చెప్పదలిచాం" అన్నారు. మానవజీవితానికెంతో పవిత్రభావం చూపే తాము, మానవుడు సమగ్రశాంతిని సంపూర్ణస్వేచ్ఛను అనుభవించగల ఉజ్జ్వలభవిష్యత్తు గురించి కలలుగనే తాము, మానవరుధిరాన్ని విధిలేక చిందించవలసి వచ్చినందుకు విచారిస్తున్నామంటూ, 'మహావిప్లవ' బలివేదిక ముందు వ్యక్తుల ఆత్మత్యాగం అందరికీ స్వాతంత్ర్యాన్ని సమకూర్చి, మనిషిని మరో మనిషి దోచుకొనేపద్ధతిని అసాధ్యం చెయ్యడం అనివార్యమని భావిస్తున్నట్లు రాశారు.

తప్పించుకుపోదలచుకుంటే వారికి అవలీలే గాని, ఉన్నచోటనే ఉండి, నినాదాలుచేస్తూ, కలవరంతగ్గి పోలీసులువచ్చి అరెస్టుచేసేదాకా హుందాగా నిబ్బరంగా నిలబడ్డారు. ఆ తర్వాతి కథ ముందుచేప్పిందే. అప్పటికే భగత్సింగులో సోషలిస్టు భావాలు పక్వానికి వచ్చిఉన్నాయి. దుస్సాహసం గాక సిద్ధాంతబలం సమకూరి వెన్నెముకవచ్చింది. వారివక్షాన అనఫలీ వాదించాడు. కోర్టులో నినాదాలిస్తూ కంపరంపుట్టించిన ఖైదీలు విప్లవప్రచారం చేసేందుకే న్యాయస్థానాన్ని వాడుకుంటున్నట్టు ప్రభుత్వం గ్రహించింది. వాళ్లు తమ 'నేరం' ఒప్పుకున్నారు. భగత్‌సింగ్ తన స్టేట్మెంట్‌లో బాంబువేసిన కారణం వివరించాడు. "ఇంగ్లాడును తన కలలనుంచి లేవగొట్టేందుకు బాంబు అవసరమైంది. హృదయవిదారకమైన తమ బాధను వెల్లడించేందుకు గత్యంతరమేదీలేని వారిపక్షాన మా అభ్యంతరాన్ని 'రిజిష్టర్' చేసేందుకు అసెంబ్లీ చేంబరు నేలమీద మేము బాంబువేశాం. చెవిటి వాళ్లు వినేలా నిర్లక్ష్యపరులకు సమయోచితమైన హెచ్చరికనిచ్చేలా చెయ్యడమే మా ఏకైక లక్ష్యం. మేమెలా చేశామో ఇతరులూ అలాగే భావిస్తున్నారు. పైకి ప్రశాంతంగా కనిపించే భారత జనతాసాగరం నుంచి తుపానొకటి బద్దలుకానున్నది. ముందున్న తీవ్రప్రమాదాలను లెక్కచేయక మహావేగంతో పోతున్నవారిని హెచ్చరించటానికి మేము చేసిందల్లా 'డేంజర్ సిగ్నల్' ఎత్తడమే. లవలేశమైనా అనుమానంలేకుండా ముందుతరం ఉహామయమైన అహింసాశకం, నిష్ఫలత్వంచెంది ఆ శకం గతించిందని మాత్రమే మేము సూచించాం". బలప్రయోగాన్ని పూర్తిగా తొలగించడం కేవలం భ్రమ అంటూ, గురుగోవింద్ సింగ్, శివాజీ, కమాల్‌పాషా, రిజాఖాన్, వాషింగ్‌టన్, గారిబాల్డి, లఫాయెతీ, లెనిన్‌లు బోధించిన ఆదర్శాల ఉత్తేజంతో ఒక కొత్త ఉద్యమం మనదేశంలో ఉదయామానమౌతూందని కూడా అన్నాడు. బాంబుమూలంగా ఎంత చిన్నగాయం తగిలినవారిపట్ల గాని, మరెవరిపట్ల గానితమకే కక్షాలేదు. మానవప్రాణం పవిత్రమైంది. ఒకరిని గాయపరచదానికిముందు మా ప్రాణాలే సమర్పిస్తామంటూ, విప్లవమనేది సమకాలికమౌలిక మహాసమస్యల పరిష్కారానికి ఏకైకమైన పటిష్టమైన చర్య. కార్మిక, కర్షక ప్రజాకోటికి ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాన్ని సమకూర్చగల చర్య అని వర్ణించారు. జడ్జి చెవులున్న బధిరుడు, కళ్లున్న అంధుడు గనుక యావజ్జీవ ప్రవాసశిక్ష విధించాడు.

మరి మరణదండన ? తమ అరెస్టు తర్వాత పోలీసులకు పట్టుబడిన సహచరులలో కొందరు ద్రోహులై రహస్య బాంబు ఫేక్టరీలు వగైరా చూపాక, రెండో లాహోర్ కుట్రకేసు పెట్టిన ప్రభుత్వం, భగత్‌సింగ్ పోల్చుకోలేని పోలీసు అధికారి కొంపముంచుతాడని భయపడి, వీళ్ల పీడా వదల్చుకోవాలని, స్పెషల్ ట్రిబ్యూనల్‌లో విచారణేగాని విచారణ నడిపి మరణదండన విధించింది. గాంధీగానీ, బోస్‌గానీ వీళ్ల ప్రాణాలను నిలబెట్టలేకపోయారు. మితవాదులూ, కాంగ్రెసు వామపక్షాస్థులూ మాటలతో మెప్పులతో సమస్యను దాటేశారు. ట్రిబ్యూనల్ సమక్షంలోనే నినాదాలిచ్చినందుకు లాఠీలూ, బూటుకాళ్ల తన్నులూతిని, రాజకీయ ఖైదీలుగా గుర్తింపుకోసం నిరసనదీక్ష పూని, చంద్రశేఖర్ ఆజాద్ కూడా వచ్చి రంక్షించలేని స్థితిలో, కరాచీ కాంగ్రెసు మహాసభా ప్రారంభ సమయానికి మెడలకు వుచ్చు బిగిసి ప్రాణాలు వదిలారు. 'నేను స్వేచ్ఛా జ్వాలను' అన్న భగత్‌సింగు దయాభిక్ష నడగలేదు. దేవుడి మీద భారం మోపరాదు. మతాన్నే తన్నేశాడు. నాస్తికుడయ్యాడు. మళ్లీ శిక్కు మతబోధలు ముప్పుజూపిన వారికి ఆశాభంగం కలిగించాడు. ఉరిదీయక తప్పనట్లయితే కరాచీ కాంగ్రెసు సభ ముందేగాని తర్వాత తీయవద్దన్న గాంధీ యుక్తిపరత్వం గెలిచింది. 1931 మార్చి 23ల సాయంకాలం 7 గంటలకు ఉరి, 24న శవ దహనం జరిగాయి. అది అహింసా శకం గాంధీ పరాభవం. కాంగ్రెస్ కార్యవర్గం నొసటితో వెక్కిరించింది. నోటితో పొగిడింది. 'భగత్‌సింగ్ నేడు వ్యక్తి కాదు, సంకేతం. దేశాన్ని ఆవేశించిన విప్లవోత్సాహ చిహ్నం' 1905 నుంచీ "వందేమాతరం" మంత్ర ప్రాయమైన నినాదంగా మారిన జాతికి భగత్‌సింగ్ కొత్త నినాదమిచ్చాడు.

ఇంక్విలాబ్ జిందాబాద్!

('నేనెందుకు నాస్తికుణ్ణయ్యాను?' అనే భగత్‌సింగ్ వ్యాసాన్ని పుస్తకంగా 1981లో ప్రచురించినపుడు "సొసైటీ ఫర్ సోషల్ చేంజ్" కావలివారు రాసిన ముందుమాట యిది.) ◆

# బుష్ మాట్లాడిన చోట తుపాకి మందు వాసన

- ఇతిహాస్



లాటిన్ అమెరికా చరిత్ర అంతా అరుణ వర్ణమే. తరతరాల దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా పోరాడిన యోధుల గాథలు ఈ ప్రాంతపు చరిత్రలో మరచిపోలేని ఘట్టాలు. సైమన్ రోల్వోస్, ఫిడెల్ కాస్ట్రో, మార్కోస్, హ్యూగో ఛావెజ్, మొరాలెస్, బేచ్‌లె.... ఒకరా ఇద్దరా... సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, ప్రజా శ్రేయస్సే ఊపిరిగా, స్వాతంత్ర్యం, సార్వభౌమత్వమే శ్వాసగా వారు ప్రపంచానికంతా ఆదర్శంగా నిలబడ్డారు. కోట్లాదిమంది జనులకు దిశానిర్దేశకులయ్యారు.

లాటిన్ అమెరికా ప్రజాపోరాటాల గురించి, రాజకీయ పరిణామాల గురించి వీక్షణం పాఠకులకు ఎప్పటికప్పుడు సమాచారం అందజేయాలనే ఉద్దేశ్యంతో ఈ శీర్షికను ప్రచురిస్తున్నాం.

*(ఐక్యరాజ్యసమితి సర్వప్రతినిధి సభలో 2006 సెప్టెంబర్ 20న వెనిజ్యులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్ చేసిన ఈ ప్రసంగం ఎంతో సంచలనం సృష్టించింది. గతంలో అమెరికన్ విదేశాంగ విధానాన్ని ఇంకా తీవ్రంగా వ్యతిరేకించిన వారు కూడ చేయలేకపోయిన సాహసం చేసి, అమెరికా గడ్డ మీదనే అమెరికన్ అధ్యక్షుడి యుద్ధ పిపాసను నిర్ద్వంద్వంగా ఖండించిన ఆ ఉపన్యాసంలోని ప్రధాన భాగాలివి. -సం.)*

ప్రపంచ దేశాల ప్రతినిధులారా, మీకు శుభోదయం. మొట్టమొదట నేను మీకు ఒక పుస్తకాన్ని పరిచయం చేస్తాను. ఇప్పటి వరకూ మీరు ఈ పుస్తకాన్ని చదవనట్టయితే దాన్ని చదవమని మిమ్మల్ని కోరుతున్నాను.

ప్రపంచ ప్రఖ్యాత మేధావులలో ఒకరైన నామ్ ఛామ్స్కీ రాసిన 'హెజిమొనీ ఆర్ సర్వైవల్ : ది ఇంపీరియలిస్ట్ స్ట్రాటజీ ఆఫ్ ది యునైటెడ్ స్టేట్స్' అనే అద్భుతమైన పుస్తకమిది. ఇరవయ్యవ శతాబ్దంలో ఈ ప్రపంచానికి ఏం జరిగిందో అర్థం చేసుకోవడానికి, ప్రస్తుతం ఏం జరుగుతుందో, మన భూమండలానికి పొంచి ఉన్న పెను ప్రమాదం ఏమిటో అవగతం చేసుకోవడానికి ఈ పుస్తకం ఉపయోగపడుతుంది.

అమెరికన్ సామ్రాజ్యపు నియంతృత్వ పోకడలు ఇవ్వాళ మానవజాతి మనుగడనే సవాల్ చేస్తున్నాయి.

మేం ఈ ప్రమాదం గురించి మిమ్మల్ని హెచ్చరిస్తూనే ఉంటాం. మన తలలపై వేలాడుతున్న కత్తి వంటి ఈ ప్రమాదాన్ని నిలువరించాలని మేం అమెరికన్ ప్రజానీకానికే కాక మొత్తం ప్రపంచ ప్రజలందరికీ విజ్ఞప్తి చేస్తున్నాం. నిజానికి నేనీ విషయాలన్నిటినీ ఈ పుస్తకం నుండి చదివి వినిపిద్దాం అనుకున్నాను. కానీ సమయాభావం వల్ల మీరు చదవాలన్న సిఫారసుతో వదిలేస్తున్నాను. నా ఉద్దేశ్యం ప్రకారం ఈ పుస్తకాన్ని మొదట నా అమెరికన్ తమ్ముళ్లు, చెల్లెళ్లు చదవాలి. ఎందుకంటే ప్రమాదం సరిగ్గా వారి నట్టింట్లోనే ఉంది.

దయ్యం ఇంట్లోనే ఉందిప్పుడు. స్వయంగా దయ్యమే ఇంట్లో ఉంది. ఆ దయ్యం నిన్న ఇక్కడికి వచ్చింది. ఆ దయ్యం సరిగ్గా నేను నిలబడి ఉన్న ఈ ప్రదేశం వద్దకే వచ్చింది. అందుకే ఇక్కడ ఇప్పటికీ గంధకం వాసన వస్తోంది.

నిన్న ఇదే వేదికపై అమెరికా దేశాధ్యక్షుడు - అదే నేను దయ్యం అని వ్యవహరించిన వ్యక్తి - నిలబడి ఈ ప్రపంచానికి తానే అధిపతినయినట్టు మాట్లాడాడు. నిజంగా ప్రపంచాధినేతలా...

నిన్న అమెరికా అధ్యక్షుడు చేసిన వ్యాఖ్యలను ఒక మానసిక వైద్యుడిని పిలిపించి విశ్లేషింపజేయాలని నాకనిపిస్తోంది. సామ్రాజ్యవాదపు ప్రతినిధిగా వచ్చిన అతగాడు ఇక్కడికి తన భావాలను పంచుకోవాలని వచ్చాడు. ఆధిపత్యం, దోపిడీ, పీడన అనే ప్రస్తుత విధానాన్ని కొనసాగించాలనేదే ఆ భావన సారం.

చామ్‌స్కీ తన పుస్తకంలో చెప్పినట్టు, తన ఆధిపత్య వ్యవస్థను సుస్థిర పరచుకునేందుకు అమెరికా చేయవలసినదంతా చేస్తోంది. మనం దాన్ని అలా చేయనీయకూడదు. ప్రపంచ నియంతృత్వం సుస్థిరం కానివ్వకూడదు మనం.

ఒక ప్రజాస్వామ్య వ్యవస్థను నెలకొల్పడమే తమ ధ్యేయమని చెబుతారు వాళ్లు. కానీ అది వారి తరహా ప్రజాస్వామ్య వ్యవస్థ. అది కలవారి ప్రజాస్వామ్యం - నా ఉద్దేశ్యంలో - ఆయుధాలు, బాంబుల సాయంతో నెలకొల్పే అసలు సిసలు 'ప్రజాస్వామ్యం'!

సైనికులను, బాంబులను ఉపయోగించి నెలకొల్పేది ఎటువంటి ప్రజాస్వామ్యం? నిన్నటి రోజున అమెరికా అధ్యక్షుడు ఇదే వేదికపై నుండి ఏమన్నాడో ఒక సారి వినండి : 'మీ పేదరికం నుండి బయటపడడానికి పోయిన మీ గౌరవం తిరిగి పొందడానికి, హింసామార్గం చేపట్టి వీరమరణం పొందడమే మార్గమని ఇవ్వాళ ఎక్కడ చూసినా తీవ్రవాదులు బోధిస్తున్నారు', అతనికి ఎక్కడ చూసినా తీవ్రవాదులే కనబడుతున్నారు. ఇక తమ్ముడూ! నీ దేహపు రంగు చూసి అతను 'ఇదిగో ఇక్కడ తీవ్రవాది ఉన్నాడని' అంటాడు. బొలీవియా దేశాధ్యక్షుడు ఎవో మొరాలెస్ ఇవ్వాళ బుష్ కళ్లకు ఒక తీవ్రవాదిగా కనబడుతున్నాడు.

సామ్రాజ్యవాదులకు అంతటా తీవ్రవాదులే కనబడుతున్నారు. నిజానికి మేం తీవ్రవాదులం కాదు. వాస్తవం ఏమిటంటే ప్రపంచం ఇవ్వాళ మేలుకొంటున్నది. అన్ని చోట్లా ప్రజలు ఇవాళ లేచి నిలబడుతున్నారు.

మీరు మమ్మల్ని తీవ్రవాదులు అనవచ్చు, కానీ మేం సామ్రాజ్య

వాదానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నాం. ఈ ఆధిపత్య నమూనాకు వ్యతిరేకంగా పోరాడుతున్నాం.

నిన్న అమెరికా అధ్యక్షుడు అంటాడూ "నేను పశ్చిమాసియా ప్రజలతో నేరుగా మాట్లాడడానికి వచ్చాను. మా దేశం శాంతిని కాంక్షిస్తుందని వారికి చెప్పడానికే వచ్చాను"

అది నిజమే!

మనం ఏ న్యూయార్క్‌లోనో, వాషింగ్టన్‌లోనో, సాన్‌డీగో లోనో ప్రజలను – అమెరికా పౌరులను – మీ దేశానికేం కావాలంటే – వారు శాంతి కావాలనే అంటారు.

కానీ అమెరికా ప్రభుత్వానికి శాంతి అవసరం లేదు. అది తన దోపిడీ, పీడన వ్యవస్థను యుద్ధం ద్వారా కొనసాగించాలనుకుంటోంది. అమెరికాకు శాంతి కావాలి! కానీ ఇరాక్‌లో జరుగుతుందేమిటి? లెబనాన్‌లో జరిగిందేమిటి? పాలస్తీనాలో? అసలేం జరుగుతుంది? వందేళ్లకు పైగా లాటిన్ అమెరికాలో, ప్రపంచమంతటా జరిగిందేమిటి? ఇప్పుడు వెనిజులాకు ఈ బెదిరింపులేమిటి? ఇరాన్‌కు బెదిరింపులేమిటి?

అమెరికా అధ్యక్షుడు ఇక్కడికి ప్రపంచ ప్రజలనుద్దేశించి ప్రసంగించడానికి వచ్చాడు. అతను ఆఫ్ఘాన్ ప్రజలతో, లెబనాన్, ఇరాన్ పౌరులను నేరుగా ఉద్దేశించి ప్రసంగించాడు.

ఒక సారిలా ఆలోచిద్దాం, ఒక వేళ ప్రపంచప్రజలు కూడా తిరిగి బుష్‌కు తమ మనసులోని మాట చెప్పాలనుకుంటే వారేం అనేవారు?

మేం గత ఏడాది కూడా ఈ సమావేశానికి వచ్చాం. గత ఎనిమిదేళ్లుగా క్రమం తప్పకుండా వస్తూనే ఉన్నాం. పోయినేడాది మేం అన్న మాటలు ఇప్పుడు నిజమయ్యాయి. మనం ఇవ్వాళ నిజాయితీగా ఒప్పుకుందాం. రెండో ప్రపంచ యుద్ధానంతరం ఆవిర్భవించిన ఐక్యరాజ్యసమితికి ఇప్పుడు నూకలు చెల్లాయి. అది ఇవ్వాళ విలువలేనిదయిపోయింది.

మనమంతా కలిసి ఐక్యరాజ్యసమితిని ఒక చర్చా వేదిక స్థాయికి మార్చేశాం. మనకేం అధికారాలు లేవు. ఇప్పుడు ప్రపంచం ఉన్న దారుణమైన పరిస్థితి లో దానిపై ఎలాంటి ప్రభావమూ వేయగల శక్తి ఇవ్వాళ ఐరాసకు లేదు. అందుకే సెప్టెంబర్ 20, 2006 నాడు వెనిజులా ఒక ప్రతిపాదన చేస్తోంది. రండి ఐక్యరాజ్యసమితిని పునరుద్ధరిద్దాం.

పరిస్థితులు ఇలా ఉన్నా ఆశాభావంతో ఉండేందుకు చాలా కారణాలు ఉన్నాయి. ఒక కవి అయితే ఈ పరిస్థితిని 'నిస్సహాయ ఆశాభావం' అని అనేవాడేమో. ఎందుకంటే చుట్టూ కమ్ముకున్న యుద్ధ మేఘాల మధ్య, బాంబుల మోత నడుమ – ఒక కొత్త యుగం ఉద్భవిస్తోంది!

సిల్వియా రొడ్రిగ్స్ మాటల్లో చెప్పాలంటే – ఈ యుగం ఒక హృదయానికి జన్మనిస్తోంది. ఇవ్వాళ ఎన్నో ప్రత్యామ్నాయ ఆలోచనలు ఉన్నాయి. వినూత్న ఆలోచనలు కలిగిన యువకులు ఉన్నారివ్వాళ. ఇదంతా ఒక దశాబ్దకాలంలోనే మనం చూశాం. చరిత్ర సమాప్తం అయిపోతుందనేది ఒక అపోహ మాత్రమేనని, నయా ఉదారవాద ప్రపంచం మిథ్యేనని తేలిపోయింది. ఈ వ్యవస్థ కేవలం పేదరికం పెంచడానికేనని ఇప్పుడు రూఢి అయ్యింది.

ఇప్పుడు మనం ఈ ప్రపంచపు భవిష్యత్తును నిర్వచించాలి. అంతటా ఉషోదయం అవుతోందిప్పుడు. మీరిది ఆఫ్రికాలో, యూరప్‌లో, లాటిన్ అమెరికాలో చూడొచ్చు. నేనీ ఆశావహ దృక్పథాన్ని నొక్కి చెప్పాలనుకుంటున్నాను. మనల్ని మనం పటిష్ట పరుచుకోవాలి. యుద్ధం చేయాలన్న మన తపనను, మన అవగాహనను పెంపొందించుకోవాలి. మనం ఒక కొత్త మెరుగైన ప్రపంచాన్ని ఆవిష్కరించాలి.

వెనిజులా ఈ పోరాటం చేస్తున్నందుకే మాకీ బెదిరింపులు. నన్ను కూలదొయడానికి అమెరికా ఒక కుట్రను అమలు చేస్తోంది. అనేక దేశాల్లో ఇటువంటి కుట్రలకు అమెరికా మద్దతిస్తోంది.

ఇటీవలే దారుణంగా హత్యకు గురైన చిలీ మాజీ విదేశాంగ మంత్రి ఓర్లాండో లేటిలియర్ గురించి ఇంతకు మునుపే చిలీ అధ్యక్షురాలు మిషెల్ బేష్‌లె గుర్తు చేశారు.

నేను మరొక్క విషయం చెప్తాను. ఆ నేరం చేసిన వాళ్లు ఇవ్వాళ స్వేచ్ఛగా తిరుగుతున్నారు. ఇక కొద్ది రోజుల్లోనే ముప్ఫైయవ వార్షికోత్సవం జరుపుకున్న మరో దారుణ సంఘటన గురించి గూడా మనం మాట్లాడుకోవాలి. 73 మంది అమాయకులు మృతి చెందిన క్యూబన్ ఎయిర్‌లైన్స్ విమానం పేల్చివేత జరిగి ఇన్నేళ్లు గడిచినా, ఆ సంఘటనకు బాధ్యత వహించిన వ్యక్తి అమెరికాలో సురక్షితంగా ఉన్నాడు. అమెరికా ప్రభుత్వ రక్షణలో ఉన్న ఈ అతిపెద్ద టెర్రరిస్టు – లూయిస్ పొసాడా కార్రిల్స్ ను వెనిజులా జైలు నుండి సిఐఏ తప్పించింది. అమెరికాది ఎంత ద్వంద్వనీతో చూడండి. అది తనకు అనుకూలమైన చోట తీవ్రవాదానికి మద్దతిస్తోంది.

క్యూబాలో కొన్నాళ్లు సంతోషంగా గడిపి ఇక్కడి కొచ్చాం మేము. క్యూబాలో ఒక కొత్త యుగం ప్రాణం పోసుకుంది. అదే అలీనోద్యమ శిఖరాగ్ర సమావేశం చేసిన ఒక చారిత్రక తీర్మానం. ఇదే దాని డాక్యుమెంట్. భయపడకండి, ఇప్పుడు నేనీ డాక్యుమెంట్‌ను చదవబోవడం లేదు.

యాభైకి పైగా దేశాధ్యక్షులు ఎంతో పారదర్శకంగా చర్చించిన మీదట ఈ తీర్మానాలు చేశారు. మేమంతా కలిసి ఒక నూతన అలీనోద్యమాన్ని ప్రారంభించాం.

నేనిక్కడ అడిగేది ఒక్కటే – ఈ కొత్త అలీనోద్యమానికి ఊతం ఇవ్వండి. సామ్రాజ్యవాదం ఇక పురోగమించకుండా అడ్డుకట్ట వేయడానికి ఇది అవశ్యం.

ఇక మీకు తెలుసనుకుంటాను. ఈ నూతన అలీనోద్యమానికి వచ్చే మూడేళ్లపాటు ఫిడెల్ కాస్ట్రో అధ్యక్షుడిగా ఉంటారు. అతనీ పనిని సమర్థవంతంగా నిర్వహించగలడని మనం విశ్వసించవచ్చు.

పాపం వాళ్లు 'ఫిడెల్ పని అయిపోయింది' అని సంబరపడ్డారు. కానీ వారి ఆశలు అడియాసలయ్యాయి. కాస్ట్రో మళ్లీ తన యూనిఫారం ధరించి అలీనోద్యమ సమావేశాలకు అధ్యక్షత వహిస్తున్నాడు.

ప్రియమైన సహచరులారా! ఒక నూతన, బలమైన ఉద్యమం జన్మించింది – ఇదో దక్షిణ ఉద్యమం. మేం దక్షిణాదికి చెందిన యువతీ యువకులం! మాకు ఈ భూగోళాన్ని రక్షించడానికి సలహాలు, సూచనలు కావాలి. భూగోళాన్ని సామ్రాజ్యవాద ప్రమాదం నుంచి రక్షించే ఆలోచనలు కావాలి. ఈ శతాబ్దంలోనే, ఎక్కువ రోజులు గడవకుండానే మనం ఆ భవిష్యత్తును చూస్తామని, నూతన యుగోదయాన్ని చూస్తామని నాకు ఆశ ఉంది. ◆

# తొలి తెలుగు మార్క్సిస్టు మేధావి డా. కె.బి. కృష్ణ

-శతజయంతి ఉత్సవ కమిటీ

సుప్రసిద్ధ మార్క్సిస్టు మేధావి డా. కె.బి. కృష్ణ(కాట్రగడ్డ బాలకృష్ణ) 1906 సెప్టెంబరు 25 న గుంటూరు జిల్లాలోని ఇంటూరు గ్రామంలో జన్మించారు. హైస్కూల్ విద్యను బాపట్లలోని బోర్డు స్కూల్‌లో పూర్తిచేసుకొన్నారు. మద్రాసు నగరంలోని వెస్లీ కళాశాలలో చదువు అనంతరం, 1921లో లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ పొలిటికల్ సైన్స్‌లో మూడు సంవత్సరాలు విద్యనభ్యసించారు. అనూహ్యమైన ప్రతికూల ఆర్థిక కారణాలవలన అక్కడ విద్య ఆగిపోయింది. కాని అనియతంగా లండన్ మ్యూజియంలో కృష్ణ తన పరిశోధనా పాటవాన్ని కొనసాగించారు. ఈ క్రమంలోనే ఆయన మార్క్సిస్టు సాహిత్యంతోపాటు బెర్ట్రాండ్ రస్సెల్, జాన్ డ్యూవే, వెల్స్ లాంటివారి రచనలను అవపోసనపట్టారు. అలానే ప్రాకృతిక తాత్వికులైన డార్విన్, థాంసన్, హాబ్‌హౌస్, వాలస్ లాంటివారి సాహిత్యాన్ని లోతుగా మదించారు. భారతీయ తత్వశాస్త్రాన్ని, ప్రత్యేకించి బౌద్ధ, జైన సాహిత్యాన్ని విస్తృతంగా అధ్యయనం చేశారు.

తన నియత విద్యను కొనసాగించేందుకు 1929 సెప్టెంబర్‌లో అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో చేరారు. ఉద్యోగం చేసుకుంటూ చదువు కొనసాగించి ఎం.ఎ., పిఎచ్.డి. పట్టాలను పొందారు. 1939 ఆగస్టు 2న భారతదేశానికి తిరిగి రాబోయే ముందు లండన్‌లో ఆగి తన పిఎచ్.డి. సిద్ధాంత వ్యాసానికి అవసరమైన మార్పులు, చేర్పులు చేశారు. దానిని 'ప్రాబ్లమ్స్ ఆఫ్ మైనారిటీస్, ఆర్ కమ్యూనల్ రిప్రజెంటేషన్ ఇన్ ఇండియా' పేరుతో 1939లో జార్జి ఎల్లెన్ అండ్ అన్‌విన్ ప్రచురణ సంస్థ ద్వారా ప్రచురించారు.

పద్దెనిమిది సంవత్సరాల విరామంతో భారతదేశానికి తిరిగి వచ్చిన కృష్ణ స్వాతంత్ర్య సమరంలోకి ఉరికారు. ప్రత్యేకించి స్వాతంత్ర్యం కొరకు ఉవ్వెత్తున ఉద్యమించిన విద్యార్థిలోకాన్ని చైతన్యవంతం చేసేందుకు వివిధ విద్యార్థి సభల్లో, ప్రత్యేకించి మద్రాసు, గుంటూరు సభల్లో పాల్గొన్నారు. అప్పుడే ప్రారంభమైన రెండవ ప్రపంచయుద్ధం, దాని పర్యవసానాలను విద్యార్థి లోకంముందు విశ్లేషించారు. విద్యార్థి సభలలో పాల్గొని, ఉద్రేకపూరిత ప్రసంగాలు చేసి, వారిని రెచ్చగొట్టాడన్న నెపంతో కృష్ణను 1941 మార్చి 2న అరెస్టు చేసి వెల్లూరు జైలులో నిర్బంధించారు. ఇక్కడ అక్టోబరు 8, 1941 వరకు ఉన్న కృష్ణను తదనంతరం మద్రాసు జైలుకు మార్చారు. మే 12, 1942 తరువాత కాలం కోయంబత్తూరు జైలుకు తరలించారు. జూన్ 24, 1942 న జైలు నుండి విడుదల చేశారు. జైలులో ఉండగా కృష్ణ ఒక పక్క తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించారు. మరోపక్క సహ ఖైదీలకు వర్తమాన రాజకీయ అంశాలమీద శిక్షణా తరగతులు నిర్వహించారు. మార్క్స్ రాసిన 'పెట్టుబడి' గ్రంథాన్ని సులువుగా అధ్యయనం చేయడానికి అవసరమైన మెళకువలను వారికందించారు. 1941 జూన్ 21న సోవియట్ యూనియన్ మీద హిట్లర్ దాడి చేయడంతో రెండవ ప్రపంచయుద్ధం స్వభావంలో వచ్చిన గుణాత్మక మార్పును విశ్లేషిస్తూ దాదాపు 300 పేజీల థీసిస్‌ను కృష్ణ జైలులో రూపొందించారు.

జైలు నిర్బంధానికి ముందు వివిధ విశ్వవిద్యాలయాలలో ఉద్యోగానికి చేసిన ఏ ప్రయత్నాలూ ఫలించలేదు. విడుదల అనంతరం చేసిన ప్రయత్నాలు అరకొరగా ప్రతిఫలించినా, వివిధ కారణాలవలన వాటిలో కృష్ణ ఎక్కువ కాలం కొనసాగలేదు. అతని విద్యార్హత, సునిశిత మేధోశక్తి, కుశాగ్రబుద్ధికి తగ్గ పనేదీ కృష్ణకు దొరకలేదు. దొరకలేదనడంకంటే, అతని శక్తి సామర్థ్యాలను వినియోగించుకోవడంలోని సంస్థాగత వైఫల్యాలకు ఇది దర్పణం పడుతుంది. ఇంకా చెప్పాలంటే, బ్రిటిష్ వలసవాద ప్రభుత్వపు కక్ష సాధింపు చర్య ఇందుకు ప్రబల కారణమన్నది యదార్థం.

1940 లో వివాహంతో వచ్చిన కుటుంబ సమస్యలు, అప్పటికే తీవ్రంగా వేధిస్తున్న ఆర్థిక వత్తిడులు, మధ్యలో జైలు నిర్బంధం, ఉద్యోగ వేటలోను, దొరికిన ఉద్యోగాల నిర్వహణలోని ఇబ్బందులు, సహకరించని మానసిక, శారీరక ఆరోగ్య స్థితి, కూతురి ఆకస్మిక మరణం లాటి అత్యంత ప్రతికూల పరిస్థితులలో సహితం కృష్ణ తన అధ్యయనాన్ని, పరిశోధనను విడనాడలేదు. దానిని బహుముఖంగా కొనసాగించారు. పదుల సంఖ్యలో వైవిధ్యభరితమైన అంశాలమీద రచనలు చేసి, 42 ఏళ్ల ప్రాయంలోనే 1948 డిసెంబరు 18 న కృష్ణ మరణించారు.

నిర్మొహమాటం, నిరాడంబరత, మృదు స్వభావం, ప్రాపంచిక అనాసక్తత, అంతర్ముఖత్వం కలగాపులగంగా రూపుదిద్దుకొన్నది కృష్ణ మూర్తిమత్వం.

కఠోరమైన శ్రమ తన లక్ష్యంగా చెప్పుకొన్న కృష్ణ రచనా వ్యాసంగం హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ఉండగా, అంటే 1929-1938 సంవత్సరాల మధ్య ఎక్కువగా సాగింది. భారతదేశం తిరిగి వచ్చిన తరువాత కూడ తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించారు.

1929 నాటికి కృష్ణ మార్క్సిజాన్ని తన ప్రాపంచిక దృక్పథంగా చేసుకొన్నారు. ఈ వెలుగులోనే ఆయన భారతదేశ చరిత్ర, తాత్విక సంప్రదాయాన్ని విశ్లేషించ పూనుకున్నారు. ఈ అధ్యయన ఫలితమే ఆయన 1932 లో రాసిన 'స్టడీస్ ఇన్ హిందూ మెటిరియలిజం' అన్న గ్రంథం. అలానే భారతదేశంలో కుల సమస్యకున్న ప్రత్యేకతను గుర్తించి, వర్గ పరిశీలనతో దానిని మిళితం చేయడం ద్వారా ఈ సమస్య పరిష్కారానికి బాటవేసిన విశిష్ట విశ్లేషకులు కృష్ణ. ఈ విశ్లేషణ ఫలితమే ఆయన రాసిన 'పొలిటికల్ అండ్ సోషల్ థాట్ ఆఫ్ బుద్ధిస్టు రైటర్స్' (1933).

42 ఏళ్ల వయస్సుకే ఇంతటి తాత్విక, రాజకీయ సిద్ధాంత కృషి చేసిన కృష్ణ, అతని రచనలు బయటి ప్రపంచానికి అంతగా తెలియవు. ఇందుకు ఒక కారణం, ఆయన రచనలలో అముద్రితాలు ఎక్కువ. ఆయన ముద్రిత రచనలలో రెండింటిని విశాలాంధ్ర ప్రచురణాలయం 1960 లో ముద్రించింది. మరొక రచనను 1994లో మిళింద ప్రచురణ సంస్థ వెలుగులోనికి తెచ్చింది. ఇవి కాకుండా కృష్ణ మేధాసంపత్తిని గురించి ఆయన సమకాలికులు, జైలులోని సహచరులు తమ గ్రంథాలలో ప్రస్తావించారు. కృష్ణకు అధ్యయనం, రచనా వ్యాసంగమే మొదటి, చివరి ధ్యేయం కావడంతో అతని ప్రతిభా పాటవాలు పలువురికి తెలిసే అవకాశం లేకుండా పోయింది. ఫలితంగా కృష్ణ సాగించిన తాత్విక, సైద్ధాంతిక కృషి మరుగున పడిపోయింది. ◆

# అసహజ మరణాల సూచి

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా కనీసం పదివేల మంది ఇటువంటి అసహజ మరణాల బారిన పడుతున్నారని ఒక అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త ప్రేమగా వ్యవహరించో, జాగ్రత్తగా వ్యవహరించో మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఆలోచింపజేస్తే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు/కారణాలు తెలియని | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 26-8-2006 నుండి 1-9-2006 | - | - | 10 | 1 | - | - | 12 | 10 | - | 17 | 21 | - | 1 | - | - | - | - |
| 2-9-2006 నుండి 8-9-2006 | - | - | 27 | - | - | - | 6 | 7 | - | 30 | 28 | 2 | - | - | - | - | - |
| 9-9-2006 నుండి 15-9-2006 | 3 | - | 31 | 2 | - | - | 10 | 9 | 1 | 32 | 17 | 1 | 2 | - | - | - | - |
| 16-9-2006 నుండి 25-9-2006 | - | - | 26 | - | - | - | 10 | 8 | - | 26 | 16 | 2 | 9 | - | - | 4 | - |
| మొత్తం | 3 | | 94 | 3 | - | - | 38 | 34 | 1 | 105 | 82 | 5 | 12 | - | - | 4 | - |




# ఆంధ్రప్రదేశ్ : నాడు - నేడు

## విద్యుత్ రంగం - స్థాపిత ఉత్పత్తి సామర్థ్యంలో పెరుగుదల

(మె.వా)

| సంవత్సరం | జలవిద్యుత్ | థర్మల్ విద్యుత్ | ప్రభుత్వరంగం | ప్రైవేటురంగం | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1959-60 | 124.0 | 89.0 | - | - | 213.0 |
| 1964-65 | 151.6 | 144.0 | - | - | 295.6 |
| 1969-70 | 271.6 | 337.0 | - | - | 608.6 |
| 1974-75 | 271.6 | 620.0 | - | - | 891.6 |
| 1979-80 | 841.6 | 1050.0 | - | - | 1891.6 |
| 1983-84 | 1659.8 | 1247.5 | 54.0 | - | 2961.3 |
| 1984-85 | 1971.4 | 1192.5 | 162.0 | - | 3325.9 |
| 1989-90 | 2431.21 | 1402.5 | 717.0 | - | 4550.71 |
| 1994-95 | 2667.21 | 2552.5 | 897.0 | 2.73 | 6119.64 |
| 1999-2000 | 2683.21 | 3224.5 | 942.5 | 654.1 | 7504.31 |
| 2003-2004 | 3586.36 | 2972.5 | 2212.5 | 1924.22 | 10,695.58 |

(మూలం : డైరెక్టరేట్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ స్టాటిస్టిక్స్, హైదరాబాద్)

(36వ పేజీ తరువాయి)

పదఘట్టనలతో, అణచివేతతో, ఎదురు కాల్పుల హత్యలతో భీతావహం సృష్టిస్తున్నారు. రాత్రి వేళల్లో పొల్లాలకు నీళ్లు పెట్టుకోవాలన్నా, కాపలాకు వెళ్లాలను, కూంబింగ్ పార్టీల భయం ప్రజలను వెంటాడుతున్నాది. గ్రామాల్లో కాస్తో కూస్తో చదువుకున్న యువకులు గ్రమాలు విడిచి అటు విప్లవోద్యమంవైపోగా ఇటు దేశాంతరమో వెళ్లి పోతున్నారు. చివరికి వైద్య సదుపాయలు అందించే అర్.ఎం.పి డాక్టర్లు కూడా పోలిసు దాడులకు వెరశి వేరే ప్రాంతాలకు వలస పోతున్నారు. విప్లవోద్యమాల వల్ల భూ సంబంధాల్లో వచ్చిన మార్పులను పోలీసులూ అధికారులూ మళ్లీ పాత పద్ధతిలోకి తెచ్చే ప్రయత్నాలు మొదలు పెట్టారు. పేదలు సాగు చేసుకొంటున్న భూములను పెత్తందార్లకే అప్పజెప్పమని బలవంతం చేస్తున్నారు. వందల మందిపై తప్పుడు కేసులు బనాయించి ఇప్పటికీ జైళ్లలో కుక్కుతున్నారు. విప్లవకారులకు ఆశ్రయం ఇస్తున్నారనీ, అన్నం పెడ్తూన్నారనీ, ఎప్పుడు పడితే అప్పుడు గ్రామాలపై పోలీసులు దాడులు చేయడం. కాళ్లు చేతులు విరగగొట్టడం, అసభ్య పదజాలంతో అవమానించటం, నిత్యకృత్యాలుగా నడుస్తున్నాయి. పోలీసు చర్యల ఫలితంగా విప్లవోద్యమం బలహీన పడిందనే ఆలోచనతో కనుమరుగైపోయిన ముఠాకక్షలు అక్కడక్కడా ఇటీవల తెరపైకి వస్తున్నాయి. పలనాటి భవిష్యత్ చిత్రపఠం ఏరకంగా మారబోతుందోనని సర్వత్రా ఉత్కంఠ నెలకొని ఉంది.

ఏది ఏమైనా పలనాటి వెనుకబాటు తనం పోయి ప్రశాంత జీవన పరిస్థితులు రావాలని ప్రజలు కోరుకొంటున్నారు. ఇన్ని జరుగుతున్నా, ఈ ప్రాంత రాజకీయ నాయకులు, ఈ ప్రాంత అభివృద్ధి గురించి మాట్లాడకుండా, ఈ ప్రాంత నీటి సమస్యల గురించి ప్రస్తావించకుండా, ప్రజలపై జరుగుతున్న అణచివేత విధానాలను ఆపటానికి కృషి చేయకుండా, పలనాటి పాలన్నూ స్పెషల్ పోలీసు బలగాలకు అప్పజెప్పి, పట్టణాలలో తిరుగుతూ రాజకీయాలను వ్యాపారంగా మార్చుకుంటున్నారు, ఇతర ప్రాంతాల రాజకీయ నాయకులకు తోకలుగా మారి, వంత పాటలు పాడటాన్ని ఈ ప్రాంత వాసులు తీవ్రంగా నిరసిస్తున్నారు. పాత పలనాటి సువిశాల రాజ్యమంతటికీ కొత్త నీటి సౌకర్యాలు కల్పించే చిన్న చిన్న ప్రాజెక్టులు నిర్మించమని, సాగర్ కుడికాలువ ఆయకట్టును ఎడారిగా మార్చొద్దని, పోలీస్ అణచివేతను, కూబింగ్‌లనూ అపివేయాలనీ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నారు. వారి ఆశలు, ఆశయాలు ఫలించాలని కోరుకుందాం. ◆

## విడుదలైన ఎనిమిది నెలల్లోనే నాల్గవ ముద్రణ !!

మీ ఆత్మీయ స్పందనకు మా హృదయపూర్వక ధన్యవాదాలు

- వీక్షణం పబ్లికేషన్స్




వెల
రూ.50/-

ప్రపంచ బ్యాంక్ వంటి అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు పేద దేశాల అవసరాలు పెంచి, కొత్త అవసరాలు సృష్టించి ఆ అవసరాలు తీర్చుకునేందుకు ఇబ్బడిముబ్బడిగా అప్పులు ఇచ్చే కుట్ర, బహుళ జాతి కంపెనీల ప్రయోజనాలు నెరవేర్చేందుకు ఉద్దేశించిన ఓ అంతర్జాతీయ కుట్ర ఇప్పుడు బట్టబయలైంది. 'ఎకనామిక్ హిట్‌మాన్' అనే ఆర్థిక దళారీలను నియమించి, అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రభుత్వాధినేతలను ప్రలోభపెట్టి, ఆ దేశాలను అమెరికన్ సామ్రాజ్య వాదానికి బంట్లుగా మార్చేసిన ఈ కుట్ర గుట్టు విప్పారు జాన్ పెర్కిన్స్. స్వయంగా ఎకనామిక్ హిట్‌మాన్‌గా పనిచేసి ఇప్పుడు చేతికంటిన సామాన్యుల రక్తాన్ని పశ్చాత్తాపంతో కడుక్కోవాలనుకుంటున్న పెర్కిన్స్ అంతరంగ కథనమే ఈ సంచలనాత్మకమైన పుస్తకం.

**కాపీలు లభించు షాపులు:**

**హైదరాబాద్** : ప్రజాశక్తి బుక్ హౌస్, దిశ పుస్తక కేంద్రం - చిక్కడపల్లి, సాహిత్య నికేతన్ - బర్కత్ పుర, నవోదయా బుక్ షాప్ - కోఠి, తెలుగు బుక్ షాప్ - కోఠి, సహచర బుక్ మార్క్ - బాగ్‌లింగంపల్లి.

**విజయవాద** : ప్రజా శక్తి బుక్ హౌస్, మైత్రి బుక్ హౌస్, సాహిత్య నికేతన్

**నెల్లూరు**: మణి బుక్ స్టాల్ - సండే మార్కెట్, గుంటూరు - అష్టలక్ష్మీ పుస్తక భండార్

**విశాఖపట్నం, తిరుపతి, గుంటూరు, ఖమ్మం, హన్మకొండ, నల్గొండ** } ప్రజాశక్తి బుక్ హౌస్

ఎం.ఓ / డి.డి కింది అడ్రస్‌కు పంపి కూడా మీ కాపీ పొందవచ్చు.

### మీ సామాజిక స్ఫూర్తికి మా వంతు సహకారం

పుస్తకం చదివి అమితంగా ప్రభావితం అయిన కొంతమంది పాఠకులు పుస్తకాన్ని తమ మిత్రులకు, శ్రేయోభిలాషులకు బహూకరించాలని నిర్ణయించుకున్నారు. ఉపాధ్యాయ, ఉద్యోగ, ట్రేడ్ యూనియన్ సంఘలకు చెందిన వారు కూడా ఇలా పెద్దమొత్తంలో కాపీలు కొనుగోలు చేశారు. హైదరాబాద్‌లో ఇద్దరు పాఠకులు చెరి వందకాపీలు కొనుగోలు చేసి తమ సామాజిక స్ఫూర్తిని చాటుకున్నారు.

మీరూ 'ఒక దళారీ పశ్చాత్తాపం' పుస్తకాన్ని ఇలా మీ మిత్రులకు, శ్రేయోభిలాషులకు బహూకరించదలుచుకుంటే మమ్మల్ని సంప్రదించండి. ఎక్కువ కాపీలు తీసుకునే వారికి ఇప్పుడు భారీ తగ్గింపు ఇస్తున్నాం.




వీక్షణం పబ్లికేషన్స్

3-6-394, మైత్రీ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్-500 029. ఫోన్-ఫ్యాక్స్: 040-6684 3495

